# భారతి

సాహిత్య మాసపత్రిక

జూన్ 1978

## హృదయ కమలం
దాశరథి

## తుహిన తోరణము
సత్యనారాయణ శాస్త్రి

## మానవతా రాగంతో
రంగారావు

## యుగపురుషుడు మార్క్స్
కృష్ణారావు

## సిముక సాతవాహనుడి నాణాలు
పరబ్రహ్మ శాస్త్రి

## జానపద గేయం - వ్యవస్థ
లక్ష్మీనారాయణ శర్మ

## కొమర్రాజు వెంకట లక్ష్మణరావు
వేంకటరావు

## ఆకలి
## కోయిల పాత పాట పాడదు
శివప్రసాద్

ఇంకా సామాన్యార్య, శశికాంత్ శాతకర్ణి, లక్ష్మీదేవి, వేంకటేశ్వర్లు, రామచంద్ర, కిశోర్ బాబు - అశోక్ బాబు, నిఖిలేశ్వర్, పార్థసారధి ఇతరుల రచనలు


వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



జూన్ 1978

సంపుటము : 55    సంచిక : 6

విడిప్రతిక వెల రూపాయిన్నర

II

# ముఖ్యమంత్రి సచివాలయంలో ప్రజల ఫిర్యాదుల విభాగం

ప్రభుత్వం దగ్గర పరిష్కారం కాకుండా ఉండిపోయిన తమ మహజర్లను గురించి ప్రజలు ఫిర్యాదులు, విజ్ఞాపన పత్రాలను అందజేయడానికి వీలుగా ముఖ్యమంత్రి సచివాలయంలో ప్రత్యేకంగా "ప్రజల ఫిర్యాదుల విభాగం" ఏర్పాటు చేయబడింది. హైదరాబాదులోని సచివాలయంలో సాధారణ పరిపాలన శాఖ కొత్త భవనంలోని రెండవ అంతస్థులో ఈ విభాగం పనిచేస్తున్నది.

తమ ఫిర్యాదులు, విజ్ఞాపన పత్రాలు పంపదలుచుకున్న వారు పనికి సంబంధించిన పూర్తి సమాచారం, ఇదివరకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల వివరాలతో మూడు ప్రతులు శ్రీ కె. కె. మొయినుద్దీన్, ప్రభుత్వ ఉపకార్యదర్శి, (ఫిర్యాదుల విభాగం), ముఖ్యమంత్రి సచివాలయం, హైదరాబాదు - **500022** కు పంపించవలసిందిగా కోరుతున్నాము.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

9/78-79



3

# విషయానుక్రమణిక

## జూన్ 1978



―(*)―

# హృదయ కమలం

## డాక్టర్ దాశరథి

నరుని ఉరములోని నవ హృదయం
పరమేశ్వరుని పాణింధమం
సృష్టించే సమయాన దైవం కుమ్మరి
సృష్టించిన తరువాత అతడే కమ్మరి

గుండె అనే ఈ కొలిమి
మండుతుంటేనే బలిమి

ఉచ్ఛ్వాస నిశ్వాశాలు
సంకోచ వ్యాకోచాలు
జననం నుంచి మరణం ఎరకు
జనులు జీవించడం కొరకు;

సుఖంలో దుఃఖంలో
సుషుప్తిలో జాగృతిలో

ఉషలో నిశలో
నడకలో పడకలో

గడబిడ చేయని దడ దడ
తడబడబోనిది ఆ నడ

నిమిషం ఆగని ఆ కళపెళ
నిలుపును మన కన్నులలో తళ తళ

విరిసిన కమలం హృదయం
జననం, దానికి ఉదయం;

మరణమె సాయం సమయం
అప్పటిదాకా అభయం!

పుట్టుక నుండే పయనం
గిట్టిననాడే శయనం

ఈ దేహం దేవాలయం
ఈ గుడిలో దీపం హృదయం

మండే ప్రాణ జ్వాల
గుండెకు తేజోమాల

రుధిర గంగ కది హిమాలయం
కరుణా గౌరికి శివాలయం

కవి కలాన్ని కదపాలన్నా
కృషికుడు హలాన్ని నడపాలన్నా
లయ తప్పక నర్తకి నాట్యం చేయాలన్నా
శ్రుతి తప్పక గాయని గానం చేయాలన్నా

ఎముకల సీకుల గదిలో మెదిలే
హృదయం చలనం వున్నన్నాళ్లే
మానవ మేధాశక్తికి అందని

మహా విచిత్రం మానవ హృదయం
నిలవకు హృదయం! నీకు వందనం!

నీదీ నాదీ రుధిర బంధనం!

ప్రేయసీ ప్రియుల తీయని ప్రణయం
మహా కవులలో మంజుల కవనం
సేనా వాహిని చేసే కదనం
వీటికి ప్రాణం నీ సంచలనం

మాపై అలగకు అపుడే ఆగకు
మంచి పనులను మధ్యన ఆపకు

నవ మోహనమై నా వాహనమై
ఉరగము కంటే తురగము కంటే
అనలము కంటే పవనము కంటే

వేడిగ వాడిగ వెళ్ళెదవు
చతురస్రంలో సాగెదవు
కాల పథంలో కదలెదవు
అలసట యెరుగక ఉరికెదవు

గమ్యం చేర్చుట నీ ధర్మం
కాదంటావా మా కర్మం!

హృదయ కమలం

మనిషి మనిషిలో నీ వుండాలి
కనికరమన్నది కలిగించాలి

హృదయం లేనిది మనిషేకాదు
ఉదయం లేనిది పగలే కాదు

నశ్వరమైనది నర జీవితము
శాశ్వతమైనది సత్కవిత్వము;

సత్కవిత్వమును సాధించుటకు
నీ తోడ్పాటే మా వాంఛితము

నీ రుధిరంలో నా బ్రతుకున్నది
నా అధరంలో నీ పిలుపున్నది

నేస్తం! నీవే నాకు సమస్తం
నీ చలం నా నవ్య కవిత్వం

జీవన పవనపు స్రోతపు నీవే
జీవుల పాలిటి నేతవు నీవే

రుధిర సరసిలో విరియు కమలమా!
సుధ లందించే మధుర హృదయమా!

---

# నిగూఢంగా ఎదిగే అశ్వత్థం

## శ్రీ శశికాంత్ శాతకర్ణి

విరిగిన బడి ప్రహరీ గోడల నానుకుని నిటారుగా ఎదిగి
నింగి అంచుల్ని అందుకొంటోంది అశ్వత్థ వృక్షం
బడిలోని పిల్లల సామూహిక పఠనాల రొదను మోసుకొస్తూ
అల్లిబిల్లిగా వీచే గాలి మిలమిల మెరిసే
అశ్వత్థపు ఆకుల కళ్ళను తాకగానే
ఎక్కడలేని క్రమశిక్షణతో మెల మెల్లగా
తెరలు తెరలుగా వీస్తుంది

విస్తరించే శాఖోప శాఖలతో నిటారుగ
ఎదిగే అశ్వత్థం క్రింద
నూపప్పు జీళ్ళు మామిడితాండ్ర అమ్ముకొనే ముసల్ది
ఎదుగు బొదుగూ ఎప్పుడో ఆగిపోయిన
వృద్ధ గోమాతలా
ఎవరూ పట్టించుకోని జాలిగొలిపే దృశ్యం!

ముసల్ది తన నెరసిన వెంట్రుకలతోటి
అశ్వత్థం తను రోజూ చిగిర్చే ఆకులతోటి
ప్రతి సంవత్సరం బడిలోంచి వెళ్ళే పిల్లల్ని
బడిలోకి వచ్చే పిల్లల్ని లెఖ్ఖిస్తాయి!

బడిలోంచి బయటకు వెళ్ళిన పిల్లలు సంవత్సరం నెక్కి
యౌవనపు సువిశాలమైన డాబామీద పిల్లిమొగ్గ లేస్తారు
అమ్మ ఒడి బయటి నుండి బడిలోకి వచ్చిన పిల్లలు
పై క్లాసుల శిష్టాల శిఖరాలకు ఎగబ్రాకుతారు!

కాని బడిలోంచి పిల్లల సామూహిక పఠనాల రొద
ఆగకుండా నిరంతరం వీస్తూనే ఉంటుంది
నిటారుగా ఎదిగిన అశ్వత్థం మరింత నిటారుగ ఎదిగి
మరిన్ని శాఖలతో మరింతగా విస్తరిస్తుంది
అశ్వత్థం క్రింద ముసల్ది మాత్రం

అప్పుడప్పుడు నెత్తిమీద పడిన ఎండిన ఆకుల్ని
దులుపుకుంటూ
జీళ్ళమీద మామిడి తాండ్రమీద వాలిన
ఈగలను తోలుకుంటూ
మరణంలేని బడిగంటలా అలాగే ఉంటుంది!

[కవీ, తాత్త్వికుడు, రచయిత, మేధావి
శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారికి]

# భ్రమర విలాసము

'సామాన్యశ్రీ'

## వన వర్ణనము :

శా॥ మాలా పాతము నిండనందు విరిసెన్ మందార పుష్పంబులున్
మాలల్ జందము బొందవిచ్చె సగమున్ మల్లెల్ గడున్ సొంపుగా
శీలంబున్ విడిపోక నవ్వి ముకుళించెన్ గొన్ని పుష్పంబులున్
కాలంబున్ గడచున్; మనంబు బడయున్ గానంగ సంతోషమున్॥

మ॥ అహహా! యివ్వన మేమి భాగ్యమున లానందెన్ గడున్ జందముల్
ఇహమందున్ మరియొక్కటేది సరిరాదిద్దాని సౌందర్యమున్
సహనంబున్ నశియింప నీర్ష్యపడెగా సఖ్యంపు లోటల్ గడున్
అహమున్ గల్గగ నొప్పుచుండె వనమద్దచ్చోట రమ్యంబుగన్॥

చ॥ ఇరవుగ బారుచుండె సెలయేరులు కొండల నుండి దూరమున్
గరళ గళుండు వల్ల తను కాలము దీర సతేడ్చు నట్లుగా
సరసులు మెచ్చుదాని నతి సంతసమందగ; నెగ్రేబా
పురములు శబ్దమున్ వినగ పోవగ ధైర్యము నాకసంబుకున్॥

## విలాసములు :

తే॥ గీ॥ భ్రమర మొక్కటి మకరంద వాంఛ జేత
పలు సుమములతో నొప్పెడు వనములోన
తీపి దేనియఁ గ్రోలుచుఁ దృప్తి దీర
యిచ్చ వచ్చినటుల విహరింపఁ జొచ్చె॥

తే॥ గీ॥ తేటి పయనంబు పవనుండుఁ దెల్పినంత
పూలు రాలుచుఁ గొన్నియు పులకరించె
తేటికిన్ స్వాగతమ్మనుఁ దెల్పనెంచి
గౌరవమ్ముల్లో రెమ్మలు కదలసాగె॥

తే॥ గీ॥ ప్రక్కనున్న మావిచిగురు వదిలిపెట్టి
ఝుమ్మనుచువ్రాలె మల్లెపూరెమ్మపైన
పూవులోన దేనెన్ గ్రోల పోయెనంత
వేశ్య ననుభవింపంబోవు విటుని పగిది॥

కం॥ ఒక యీగ పోయెన తట
చకచకమని వేస చిగురు చవి చూచుటకున్
ఏకపకమని నవ్వ చెలులు
ముకుళించిన మోముతోడ ముందుకు బోయెన్॥

కం॥ ఎడిలెను పుష్పము లన్నియు
గడ గడ మని పారమంత కాయము జేతన్
గుడిచిన మధుకర మంతట
వెడంగఁ దన కోర్కెదీర విజయము దోడన్॥

మ॥ అరవిందానన సోయగంబు గని తానానందమున్ బొందియున్
లరవిందంబను భ్రాంతి నొంది భ్రమరంబాసక్తితో దానితో
సరసం బాడగ జేరె ఝుమ్మనుచుఁ దాఁ జారత్వమున్ జూపగన్
కరుణన్ లేకయు వీచగాలి వదిలెన్ గాంచన్ గడున్ బాధతో॥

కం॥ మధువులు గ్రోలుట కొరకై
మధు పంబేతెంచి వ్రాలె మందారముపై
విధి చిత్రమదేమి చెపుదు
మధువున్ మును ద్రావియుండె మధుకర మొకటిన్॥

మ॥ పరమేశున్ సతిఁ గోరుచుండె గిరిపై భర్తందు సాంగత్యమున్
పరమేశుండును దాని తెల్సికొనగన్ పంపింప వార్తన్ గడున్
సరసంబున్ దను నెంచె తేటి నిలలో సద్వార్త వాహుండుగా
వరమివ్వన్ సతి నైక్యమందె వనితన్ బ్రార్థింపగా దేటినిన్॥

కం॥ అతనుండు బాధ వెట్టగ
రలి సల్పెను పుష్పములతొ భ్రమరము దోటన్
అతి చిత్రము కామ సుఖము
సలి యొక్కతె సోలిపోయె సతిపతు లందున్॥

మ॥ నయనానందము గల్గగా వనములో నైపుణ్య మొప్పారగన్
లయ బద్ధంబుగ తేనెటీగలు సముల్లాసంబుతో గానమున్
నియమంబున్ జెడకుండ జేసెనవియున్ నేర్పున్ గడింపంగనే
భయమున్ లేకయు సంచరించె నవియున్ భక్షింప నాహారమున్॥

ఉ॥ నాసిక గుచ్చె నొక భ్రమణంబును భ్రాంతియు చెంది వేగమా
కాసము మబ్బులందు గడుకారగుఁ జీకటి కల్గియుండగా
వేసము వేసియుండ నరవిందము వంటి ముఖంపు నింతియున్
పూసల శబ్దముల్వినగ పుష్పాడి యన్కని యామె యేడ్వగా॥

శా॥ గ్రోలన్ దేనెను తిర్గుచుండె వనమున్ కోలాహలంబౌ ధ్వనిన్
సోలంగన్ కుసుమాలు దేటి కడుపున్ స్థూలంబునౌ దేహమున్

శాలన్ బాననజేసి మత్తుగల యజ్ఞానుండు భంగిన్ గడున్
కాలంబున్ మితిమీరి పోవ తిరిగెన్ కామంబు లందున్ దనున్॥

ఆ॥ వె॥ ముద్దు కృష్ణుడూదు మురళి నాదమువోలె
వాణి చేతనున్న వీణ వోలె
మధుకర స్వనంబు మదికి హాయిగొలిపి
చేర్చె మమ్ము దివికి సేదదీర॥

## మ ర ణ ము :

చం॥ అరుణపు వర్ణమండగను నాకము నెంతయొ సుందరంబుగా
వరలుచు సూర్యుడంతటను పశ్చిమ దిక్కుకు తాను నేగగా
శరము లం దాల్చు మన్మథుడు చంద్రుదు వచ్చెను కుల్కులొలదన
ప్సరల రతింప దేవతలు పొన్నును జేరగ జీకటంతటన్॥

కం॥ చేరెను మధుకర మంతట
సారింపక దృష్టి గగన సాదృశ మందున్
ఊరించు దేనె గ్రోలగ
'రా రా!' యని పిల్చు తామరలొత్తా దూరెన్॥

ఉ॥ తామరరేడు నిష్క్రమణ దాల్చగ నాకసమందు నప్పుడున్
తామర మూసి పోగమలి తప్పియు బంధనమందె దేటియుం
దామరరేడు రాగ మరునాడును పోవదలంచె నద్దియున్
తామర పీకి త్రొక్కెనతి దారుణ హింసతొ యేనుగొక్కటిన్॥

## ము గి ం పు :

కం॥ గమనము లేకనె నిర్వృతి
మమితంబుగ కలుగ మాకు నాశ్చర్యంబున్,
భ్రమణ భ్రమణము మిక్కిలి
రమణీయత కల్గియుండె రంజిలు దోటన్॥



# మానవతా రాగంతో

## శ్రీ మాదిరాజు రంగారావు

ఎదురుగా నిలచి ఉంది చైతన్యశిఖ
 వెనుకనే దాగి ఉంది రాత్రి,
దూర దూరం విస్తరించిన భయంతో
ఒదిగి ఒదిగి ఉంది నీల గగనం.

ఈ క్షణాలు వికసించేను
శుచియై అనురాగ మయమై
పరిమళిస్తూ మనసులో
సంస్కార మృదు రూపంతో

ముసుగు తొలగి, వికృతి వీడి
ప్రకాశిస్తోంది రోదసి,
పల్లవించి హ్లాదింతో
ముఖం ఎత్తి తేజంతో.

కాలం కదులుతోంది మెల్లగా
ఆద మరచి ఊగే తీగెల్ని
సవరిస్తూ కిటికీ ప్రక్కగా
స్పృశిస్తూ లే నుదురు గోముగా.

నా చుట్టూ గుంపులుగా పిట్టలు
కలకలమని ఉదయం కాగానే
తెలివిగా ఎగిరి అంతలో తిరిగి
వస్తాయి తిండి వేళకొకటొకటీ.

అతృప్తి అశాంతి ముద్రలలో దూరంగా
మంచు పొరలు కరగించే అనల ముఖాంతో
ఆకులు కప్పుకొని శిరస్త్రాణాలపై
గొరిల్లాలవలె చెట్లతో చిన్నగిరులు.

వెలుగు రెక్కలతో ఎగసి
యుద్ధవిమానం వలె సూర్యుడు
వెదకుతున్నాడు అందని నీడల్ని
ఒక్కొక్కవైపున ఒక్కొక్క పూట.

ప్రకృతిలోని ప్రతి దృశ్యం
తలపిస్తూ ఏదో ఘటన
కదలేను కాలం
బింబిస్తూ మానవ వర్తనం.

చెట్ల బుజాలపై నిల్చిన ఆకాశం
మనిషి కోర్కెలపై వెలసిన భవిష్యత్తు,
ఒకదానికన్నా మరోటి ఒక్కొకచోట
అంతమైనట్లు తోచేను అనంతమై.

నిశ్శబ్దం వ్రేలాడే ముఖాలతో
నా వైపే చూస్తాయి దిక్కులు,
మంచు కరగిన కళ్ళతో
వెలుగు నిండిన గుండెతో.

క్షణాల ఘర్షణలో ఉద్గమించి
ఒక స్ఫులింగం దహిస్తుంది బ్రతుకును,
క్షణాల యోగంలో నిర్గమించి
ఒక కిరణం వెలిగిస్తుంది బ్రతుకును

ఏదో గుహలో గడిపే మనస్సుకు
సోకనీ మనిషి గాలి వెలుగూ
స్వేచ్ఛా జీవితంలో ప్రతిక్షణం
చిత్రానికి రేఖాగలి బిందువు.

తనలో ఒక ప్రపంచంతో
మెలకువలో జీవిత నౌక
నిదుర ను డి లంగరెత్తితే
సాగ వలసిందే ప్రయాణం!

ఎంతలోతైతేనేం? ఎంత పొడవుంటేనేం?
ఒక్క నావహలు చేరడానికి తీరం,
సూర్యుడెంత తీవ్రకిరణుడైతేనేం?
మబ్బు ముక్కచాలు మాపు నివ్వడానికి.

పగలు వచ్చిన ఎదురుదారినే
వస్తుంది నిశ తప్పని సరిగా
జారిన నిదుర వెనుక నుండే
వస్తాయి లోబొమ్మలు కలగా

రాత్రి సమీపించిందో ? లేదా ?
రవి దగ్ధమైనాడన్న వార్త,
ఉదయం పొడసూపిందో లేదో
బ్రతికే ఉన్నాడన్న గాథ

చిత్రం ఏమంటే భాయీ !
రెండు బరువుల్నీ మోసేది
ఒకే గాలి మనిషి పాపం !
నిలిస్తేగా ఒకచోట నిలకడగా.

నడుం వంచి ఎత్తే వరకే
సగం పైనుండి దాటేను రోజు
పదం ఎత్తి వేసేవరకే
సగం నీడ సాగేను సనసన్నగా

జీవితాన్ని మరలిస్తూ
పగటి నిదుర కలనుండీ
వాస్తవాన్ని చిత్రిద్దాం
వెలుగులతో మెలకువతో.

మన అడుగుల చిహ్నాలే మనకు
దూరమవుతాయి ప్రయాణంలో
నిల్చి దారికి ఆభరణాలై
సాగే వారికి సంకేతాలై

ఇంత దుమ్ము ఎగజిమ్మే కళ్ళలో
తప్పుకొని పోయే సాయంసంధ్య.
ఇంతలో ఉంటుంది నా చూపులో
ఒదిగి జీరాడే కేశధునితో.

ధమనుల్లో ఉగ్రశక్తి నర్తనంతో
పొలాల్లో శ్రమాగారాల్లో గనుల్లో
కర్షకులు, కార్మికులు బ్రతుకు వాలకాయ
శిశిరంలో చిటారున కొమ్మల్లో చుక్కలు !

కళ్ళు పైకి ఎత్తితే మెరపులు
ఒక మూల మినుకుమనే ఊహలు.
కళ్ళు దించితే క్రిందికి శిఖలు
చీకటిలో తలెత్తిన ఊహలు.

అజ్ఞానం ! దారిద్ర్యం ! మౌఢ్యం !
గోడలు ఎత్తైనవి ఎదురుగా !

బ్రతుకు చుట్టూ సాగి శ్రేణులుగా
తెలీదావల ఏముందీ, లేందీ !

ఏ అణుస్ఫుటనిక్ చిహ్నాలతో
ఎగసినా సంస్కృతీ కేతనం
నాగరి కొదువలి పలుగూపార !
యుగాలుగా అదేస్థితి ఇక్కడ !

బండలు తొలిచి సౌందర్యం సృజించి
రాతి వలెనే పడి ఉన్నాడు మనిషి
అడవులు కొట్టి నాగరకత నిర్మించి
లడవివలె పెరిగే ఉంది మనస్సు.

స్వేచ్ఛ దొరకని మానవులతో
సంకెళ్ళు విడని ఊహలతో
అందం కోల్పోయేను నాగరకత
బ్రతుకుపై వ్రేలాడుతూ నీడలు !

పెరిగిన కొద్దీ అనుభవ ప్రపంచం
దూర దూరం పోయేను పొలిమేరలు
కదలిన కొద్దీ అనుభవ తీరాన
సాగుతూ వచ్చేను నీటి అలలు.

ఈ మనిషి చేతులూ కాళ్ళూ
అలవాటుపడి సంకెళ్ళకు
ఈ మనిషి ఊహలూ చేష్టలూ
అలవాటుపడి దాస్యానికి
ఉన్నచోటునే భ్రమిస్తూంటే
సంతతి సంతతికీ అదే ! చరిత్ర.

సంక్రాంతి రంగవల్లులవలె
ప్రతి బిందువునూ కలుపుతూ
చిత్రమైన సంఘటనలతో
సాగిపోయే బ్రతుకులో
బిందువు నిల్వడంతో స్థితిరూపం !
రేఖ కదలడంతో చిత్ర విశేషం !

ప్రతి వ్యక్తిలోని సృజనశక్తి
ఉద్గమిస్తూ స్వేచ్ఛాగతితో
బ్రతుకులో ఉదయ కళారూపం
రావాలి మానవతారాగంతో.



శ్రీ తిరుమల రామచంద్ర

# ప్రాకృత వాఙ్మయంలో రామకథ

ప్రాకృత సాహిత్యంలో రామకథ మూడు పాయలై పారింది. దీనిలో మొదటి పాయ బౌద్ధ సంప్రదాయానుసారి; రెండవది జైన సంప్రదాయానుగామి, మూడవది వాల్మీకి సంప్రదాయానువర్తి. ఈ మూడింటినీ సంగ్రహంగా నివేదిస్తున్నాను :[1]

ఏ దైవ దుర్విపాకమో, ఏ బుద్ధి జాడ్య జనితోన్మాదమో గాని, బౌద్ధ జైన సాహిత్యాలు వాల్మీకి రామాయణ సుధా స్వాదన వంచితాలయ్యాయనే దుఃఖంతో ఈ వ్యాసం ప్రారంభిస్తున్నందుకు మీ మన్నన వేడుతున్నాను. దైవ దుర్విలసితం కాకపోతే బౌద్ధులు, జైనులు వాల్మీకి రామాయణాన్ని అమూలకంగా, అనపేక్షితంగా మార్చవలసిన అవసరంలేదు. రామకథతో తమ మతంవారు ఆకృష్టులవుతారనే భయంతో ఈ మార్పులు చేశారా ? —అనే సందేహమూ కలుగుతుంది. కాని, రామాయణ భారతాల వంటి మహోన్నత వస్తువులను విడనాడడానికి వారి మనస్సు ఒప్పలేదు; వాటిని స్వాయత్తం చేసుకోవాలనే ఉత్కంఠ పరోక్ష వైపు. కనుకనే దానికి మార్పులు, చేర్పులు కూర్చి స్వాయత్తం చేసుకొన్నారు; కాని తాము వాస్తవ రసా స్వాదన వంచితులయ్యారు; తదనంత ప్రజలను వంచితులను చేశారు.

## బౌద్ధ రామ కథలు

ప్రాకృత సాహిత్యంలో మనకు లభించే అతి ప్రాచీన రామకథ బుద్ధ జాతక కథలలోనిది. జాతక కథలు బుద్ధ భగవానుని పూర్వ జన్మ గాథలు. ఇవి బుద్ధభగవానుడు ఆయా సందర్భాలలో అనుయాయులకు చేసిన ఉపదేశాలకు ఉదాహరణగా చెప్పినవని బౌద్ధుల సంప్రదాయం. ఈ జాతక కథలు మొత్తం 550. వీటిలో రామకథకు సంబంధించిన మూడు కథలు మనకు పూర్తిగా లభిస్తున్నవి. మరి కొన్నిటిలో రామకథా ప్రస్తావన కనిపిస్తుంది. జాతక కథల నిర్వహణ పచ్చుప్పన్నవత్థు, అతీతవత్థు, సమోధానం రూపంలో ఉంటుంది. పచ్చుప్పన్నవత్థు — ప్రత్యుత్పన్న వస్తువు — వర్తమాన కథ. అతీతవత్థు — అతీతవస్తువు — అతీత కథ. సమోధానం. సమాధానం — జాతక కథకు వర్తమాన కథతో సామంజస్యం.

## దశరథ జాతకం

పైన పేర్కొన్న మూడు జాతక కథలలో మొదటిది దశరథ జాతకం. ఇది 'జాతకట్ఠ వణ్ణన'లో ఉన్నది. దీని సారాంశం ఇది :

ఈ కథను బుద్ధభగవానుడు జేతవనంలో విహరిస్తున్నప్పుడు, తండ్రి మరణించిన ఒక గృహస్థును ఉద్దేశించి చెప్పినది. ఈ గృహస్థు పితృ శోకంతో వెర్రివాడయి తన పనులన్నిటినీ విడనాడుతాడు. ఈ సంగతి తెలిసి శాస్త ఆ గృహస్థు ఇంటికివెళ్లి అతనితో "ఉపాసక, పౌరాణిక పండితులు — పూర్వం పండితులు తండ్రి మరణించినా దుఃఖించలేదు, లేశమాత్రమయినా" అంటాడు. తర్వాత, ఆ గృహస్థు అనురోధంతో పూర్వజన్మ కథ వివరిస్తాడు భగవానుడు. ఇది వర్తమాన కథ.

## అతీత కథ ఇది :

పూర్వం వారణాసిలో దశరథుడు ధర్మప్రకారం రాజ్యం చేస్తుంటాడు. ఆయనకు 16 వేల మంది భార్యలు. వారిలో పట్టపురాణికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె జన్మించారు. పెద్ద కుమారుని పేరు రామ పండితుడు; రెండవ వాని పేరు లక్ష్మణ కుమారుడు; కుమార్తె పేరు సీతాదేవి. కొంతకాలానికి పట్టపుదేవి కాలధర్మం చెందింది. ఆమె పోయిన తర్వాత రాజు చాల సేపటి వరకు శోకాభిభూతుడై వుంటాడు. అమాత్యులు బోధించిన మీదట రాజు తెలివి తెచ్చుకొని అపర కర్మలు చేయించి, మరొకతెను పట్టపురాణిగా అగ్రమహిషి స్థానంలో చేసుకొంటాడు. ఆమెరాజుకు ఇష్టురాలు, మనోరంజకురాలు అయింది. ఆమెకు ఒక కుమారుడు కలుగుతాడు. అతని పేరు భరతుడు. పుత్ర వాత్సల్యంతో రాజు "భద్రే నీకు ఒక వరమిస్తాను. కోరుకో" అంటాడు. ఆమె వరం తీసుకుని, కుమారునికి ఏడు సంవత్సరాలు వచ్చేటప్పటికి రాజసన్నిధికి వచ్చి, తన కుమారుని కిచ్చిన వరం జ్ఞాపక పరచి, "పుత్రునికి రాజ్యము దయచేయుము" అని కోరింది.

రాజుకు చాల కోపం వచ్చింది. "దుర్మార్గురాలా, నీవు నశిస్తావు. నా కుమారులిద్దరు అగ్నిస్కంధాలవలె ప్రకాశిస్తున్నారు. వారిని వధించి నీ కుమారునికి రాజ్యం యాచిస్తున్నావా ?" అని బెదరిస్తాడు. రాణి మనసు చెదరి శయనాగారం చేరి తలుపు బిడాయించుకుంటుంది. తర్వాత ఆమె తరచు తన కుమారునికి రాజ్యమిమ్మని రాజును వేధిస్తూనే వుంటుంది.

---

[సత్యసాయి విద్యా సంస్థవారు 1977 మే 19 నుంచి 25 వరకు వైట్ ఫీల్డ్‌లోని శ్రీ సత్యసాయి కళాశాలలో ఏర్పాటు చేసిన రామాయణ సుధాలహరి సదస్సులో పఠించిన వ్యాసం]

రాజు ఆమెకు వరమివ్వక ''స్త్రీలకు కృతజ్ఞత లేదు. వాళ్ళు ద్రోహం తలపెడుతారు. ఈమె మోసంతో రాజముద్రిక వేసి నా కుమారులిద్దరిని సంహరిస్తుందేమో ! అలాటిది జరుగరాదు'' అనుకొని, రామపండితుని, లక్ష్మణ కుమారుని పిలిపించి, మీరిక్కడ వుంటే అపాయం సంభవించవచ్చు. కనుక ఏదో సామంత రాజ్యంలోగాని, అడవిలోగాని నివసించండి. నా అనంతరం వంశ పరంపరాగత మయిన రాజ్యం గ్రహించండి'' అని చెప్పి, జ్యోతిష్కులను పిలిపించి, తన ఆయుః ప్రమాణం గురించి అడుగుతాడు. పన్నెండు సంవత్సరాలని వారు విన్నవిస్తారు. పిదప రాజు ''నాయన లారా, మీరు నేటినుండి పన్నెండు సంవత్సరాలు ఎక్కడయినా వుండి, తర్వాత తిరిగివచ్చి ఛత్రధారణచేయండి'' అని చెప్పతాడు. అప్పటికి రాముని తల్లి గతించింది.

వారు సరేనని తండ్రికి నమస్కారం చేసి రాజభవనంలోని వారు కన్నీరు కార్చుతుండగా ప్రవాసానికి ఉద్యుక్తులవుతారు. సీతకూడ తండ్రి అనుమతితో వారివెంట బయలుదేర తుంది. వారు తమ వెంటవచ్చే పరిజనాన్ని వెనక్కు మళ్ళించి హిమాలయాలకు వెళ్లుతారు. అక్కడ జలాలు, ఫలాలు మొదలయినవి సులభంగా దొరికేచోట వారు ఆశ్రమం నిర్మించుకొని కందమూల ఫలాలలో జీవనం గడుపుతారు. లక్ష్మణకుమారుడు, సీతాదేవి రామపండితునితో ''నీవు మాకు పితృస్థానీయుడివి. కనుక నీవు ఆశ్రమంలో వుండు. మేము కందమూల ఫలాలు తెచ్చి నిన్ను పోషిస్తాము''అంటారు. రామపండితుడు ఆశ్రమంలోనే ఉంటాడు. వారిద్దరూ అతనికి సేవచేస్తారు.

అక్కడ వారణాసిలో దశరథుడు పుత్రశోకంతో జ్యోతిష్కులు చెప్పిన పన్నెండేళ్ళు దాటకముందే తొమ్మిదవ ఏటే మరణిస్తాడు. అపరకర్మల పిదప భరతకుమారుని అభిషేకానికి అమాత్యులు అడ్డంకులు పెడుతారు. ''రాజ్యచ్ఛత్రాధిపతి అరణ్యంలో నివసిస్తున్నాడు'' అనీ అంటారు. ఆ మాటలకు భరతుడు ''రామపండితుణ్ని వనంనుంచి పిలుచుకొని వచ్చి ఛత్రధారణం చేయిస్తాను'' అని యోచించి, పంచ రాజలాంఛనాలతో, చతురంగ బలంతో బయలుదెడలి, రామపండితుని ఆశ్రమం తెలుసుకొని, దానికి కొంతదూరంలో సైన్య శిబిరం ఏర్పాటు చేసుకొని, లక్ష్మణుడు, సీత కందమూలఫలాలకోసం వెళ్ళిన సమయంలో రామపండితుని ఆశ్రమంచేరి, సుప్రతిష్ఠితమైన సువర్ణ విగ్రహంవలె నిశ్చింతగా ఉపవిష్టుడైన రామపండితుని చూచాడు. పిదప అతని సన్నిధికి పోయి, ప్రణామంచేసి ఒక ప్రక్కన నిలిచి రాజు మరణవృత్తాంతం తెలిపి అమాత్యులతోసహా రాముని పాదాలకడ వాలి రోదనం చేయసాగినాడు. రామపండితుడు చింతించలేదు, రోదనం చేయలేదు. ఆయన ఆకృతిలో వికారం తోపలేదు. రామపండితో నేవసోచి, నరోది

సందెవేళకు సీతా లక్ష్మణులు కందమూల ఫలాలతో తిరిగి వస్తారు. రాముడు తనలో ''ఇతడు చిన్నవాడు. నాకు ఉన్నంత దృఢిమ కలవాడు కాడు. తండ్రి మరణవార్త నూటిగా తెలిపితే శోకావేశంతో గుండెలు ఆగిపోవచ్చు. కనుక వీరిని జలాశయానికి పంపి, ఈ వృత్తాంతం తెలుపుతాను'' అని భావించి, ఎదుటఉన్న నీటిపట్టు చూపి, ''మీరు ఆలస్యంగా వచ్చినారు. నీటిలో దిగి స్నానం చేయండి''.

''ఏథ లక్ఖణ సీతాచ ఉభో పితరథోదకం,
ఏవాయం భరతో ఆహ రాజా దశరథోమతో.''

దశరథ మహారాజు మరణించారని భరతుడు చెబుతున్నాడు అన్నాడు. తండ్రి మరణవార్త విని వారిద్దరూ తెలివి కోల్పోయారు. ఇలా మూడుసార్లు వారు మూర్ఛపోతారు. అమాత్యులు వారిని నీటిలోనుంచి ఇవతలకి తెస్తారు. రాముడు ఏమాత్రమూ శోకించ నందుకు భరతునికి ఆశ్చర్యం కలుగుతుంది. ఆయన శోక రహితుడై వుండడానికి కారణమేమిటో అడుగదలచాడు, అడిగాడు. రాముడు అనిత్యతా స్వరూపం వివరించాడు.

కేన రామా ప్పభావేన సోచితబ్బం న సోచసి,
పితరం కాలకతం సుత్వా న తంపసహతే దుఃఖం ?

అని భరతుడు ప్రశ్నిస్తాడు.

యం న సక్కాపాలేతుం పోసేన లపతం బహుం,
సకిస్స విఞ్ఞూ మేధావీ అత్తానం ఉపతాపయే.
దహరాచహి వుద్ధాచ యేబాలా యే చపండితా,
అడ్డా చైవ దలిద్దా చ సబ్బే మచ్చు పరాయనా-
షలానమివ పక్కానం నిచ్చం పపతనా భయం,
ఏవం జాతానం మచ్చానం నిచ్చం మరణతో భయం.
సాయమేకే న దిస్సంతి పాతోదిట్ఠా బహూజ్జనా,
పాతోఏకేన దిస్సంతినాయం దిట్ఠా బహూజ్జనా
పరిదేవయ మానోచే కంచిదత్థం ఉపబ్బహే
సమ్మూళ్హో హింసమత్తానం క ఇరచేనం విచక్ఖణో.
కిసో వివణ్ణో భవతి హింస మత్తా న మత్తనో,
న తేన పేతా పాలేంతి నిరత్థాపరి దేవనా.
యథా సరణ మాదిత్తం వారినా పరినిబ్బయే
ఏవమపి ధీరో సుతవా మేధవీ పండితో నరో.
ఖిప్పముప్పతితం సోకం వాతో తూలం వధంసయే
ఏ కోవ మచ్చో అచ్చేతి ఏకోవ జాయతేకులే,
సంయోగ పరమాత్వేవ సంభోగా సబ్బపాణినం
తస్మా హి ధీరస్స బహుస్సుతస్స
సంపస్సతో లోకమిమం పరంచ,
అఞ్ఞాయధమ్మం హృదయం మానంచ
సోకా మహంతాపి న తాప యంతి,
సోహం దస్సంచ భోక్కంచ
భరిస్సామిత నాతకే

సేసం సంపాలయిస్సామి
కచ్ఛమేవం విధానతో.

అర్థాత్ —

ఎంత విలపించినగూడ నెవని జీవి
తమ్ము నిలువదో వానికై తనకుదాను
బుద్ధిమంతుః పీడలు పొందనేల !
పడుచువారలు వృద్ధులు పండితులును
నిండు మూర్ఖులు, ధనికులు, నిర్ధనులును
అందరును మృత్యువొందుదు రనుట నిజము.
అవనిజమునుండి పడిపోదునను భయంబు
ఫలమునకునుండు నిత్యము: ప్రభవమొందు
మనుజునకు నిత్యముండును మరణభయము.
ఉదయమున చాల గనబడుచుంద్రు జనులు
సందెవేళకు నుండరు కొందరంగు,
సందెవేళను గనబడు జనమునందు
ఒక్కడుం గూడ గనబడ డుదయవేళ —
మూఢులగువార లేడ్చుచు మొత్తుకొనుచు
కష్టపడ లాభవేశము కలుగునేని
ఉత్తములుగూడ నేడ్చుచు మొత్తుకొంద్రు.
తనకుదా హింసించుకొనుచు నెంతయును
దుఃఖించు వాతండు దుర్వర్ణుడగుచు
పొగులుచు నున్నచో పోషణం బగునె
మృతునకు? ఏడుపు వితథమ్ము సుమ్ము!—
ముట్టుకొన్నంతనే గృహమునకు నిప్పు
సలిలముల నార్పివేసెడి చందమునను
దూది పింజను వాయువు తోలునట్లు
తోడనే జ్ఞాని దుఃఖమున్ దోలవలయు—
ప్రాణి ఏకాకిగా ప్రభవించుచుండు
ఒకడు కుటుంబాన నుదయించుచుండు
సంయోగ పరములు సర్వభోగములు—
ఇహపర లోకాల నెవడు ధ్యానించు
అష్టజగద్ధర్మ మవగత మెవనికి
ఆ బహుశ్రుతుధీరు నధిక శోకంబు
సైతము బాధింప జాలదుసుమ్ము—
యోగ్యులౌ వారల నొసగుచునుందు
భోగవైభవములన్; పోషించుచుందు
బంధువులన్; పెదవారి పాలింతు
కరణీయమిదె బోధ కల్గువారలకు—

(శివశంకరస్వామి అనువాదం)

అని రామపండితుడు అనిత్యతా ప్రకాశనం చేసి ధర్మోపదేశం చేస్తాడు. అక్కడ ఉన్నవారంతా అది విని శోక విరహితులవుతారు. అప్పుడు భరత కుమారుడు రామపండితునికి ప్రణామంచేసి, ''వారాణసీ రాజ్య పరిపాలనం నిర్వహించండి'' అని వేడుకొంటాడు.

రాముడు భరతునితో ''లక్ష్మణ కుమారుని, సీతాదేవిని పిలుచుకొని పోయి రాజ్యపాలనం చేయి. పన్నెండు సంవత్సరాల తర్వాత రాజ్యంచేయవలసిందని నాతో నాయనగారన్నారు. నేనిప్పుడే అక్కడికి వస్తే జనకాజ్ఞా పరిపాలనంకాదు. మిగిలిన మూడు సంవత్సరాలూ గడచిన పిదప నేను వస్తాను'' అని దృఢంగా చెబుతాడు.

భరతుడు ససేమిరా పరిపాలనకు అంగీకరించడు. బలవంతం చేస్తాడు, రాముణ్ని రమ్మని. అప్పుడు రామపండితుడు ''నేను రానంతవరకు ఈ పాదుకలు రాజ్యం గడుపుతాయి'' అని తన తృణ పాదుకలు తీసి ఇస్తాడు. అప్పుడు భరతుడు, సీత, లక్ష్మణుడు పాదుకలను తీసుకొని రామపండితునికి ప్రణామంచేసి, సపరివారంగా వారాణసి చేరుతారు. మూడు సంవత్సరాలకాలం పాదుకలను ప్రతినిధిగా ఉంచి రాజ్య పరిపాలనం జరుపుతాడు భరతుడు.

అమాత్యులు ఈ తృణ పాదుకలను సింహాసనంపై పెట్టి అభియోగాలకు తీర్పు చెప్పేవారు. తీర్పు సరిగా లేకపోతే పాదుకలు పరస్పరం కొట్టుకుంటాయి. (పరిహణంతి); నిర్ణయం సరిగా జరిగితే, ప్రశాంతంగా ఉండేవి.

రామపండితుడు మూడు సంవత్సరాల తర్వాత అరణ్యవాసం చాలించుకొని వారణాసి చేసి ఒక ఉద్యానవనంలో ప్రవేశించాడు. ఆయన రాక తెలుసుకొని భరతుడు అమాత్యులతోపాటు వచ్చి, స్వాగతం చెప్పి రాజ్యం అప్పగిస్తాడు. రాముడు సీతను పట్టపు రాణిని చేసి, పట్టాభిషిక్తుడై, అలంకృతమైన రథమెక్కి నగర ప్రదక్షిణంచేసి, సుచంద్ర ప్రాసాదం పై అంతస్థుచేరి 16 వేల సంవత్సరాలపాటు ధర్మానుసారంగా రాజ్యంచేసి, చివరకు స్వర్గగామి అయినాడు.

దశవస్స సహస్సాని సట్ఠి వస్స సతానిచ
కంబుగీవ మహాబాహు రామోరజ్జమకారయి.

## సమాధానం:

బుద్ధభగవానుడు ఈ ధర్మోపదేశం చేసి జాతకాలు రెండింటినీ—జన్మలు రెండింటిని—సరిపోల్చాడు—''ఆ కాలంలో మహారాజు శుద్ధోదనుడు దశరథుడు; మహామాయ రామపండితుని తల్లి; రాహులుని తల్లి సీత; ఆనందుడు భరతుడు, సారిపుత్రుడు లక్ష్మణుడు; పరివారం బుద్ధపరిషత్తు; నేనే రామపండితుడిని'' అని.

ఈ కథ విన్న తరువాత గృహస్థుకు స్రోతాపత్తి ఫలంపొంది దుఃఖ దూరుడవుతాడు. (461)

ఈ దశరథ జాతకం రామకథా మూలస్వరూపమని పలువురు విద్వాంసుల భావించడంవల్ల, దీనిపై వాద వివాదాలు చాల చెలరేగాయి. ఈ జాతకకథ లిఖిస్తున్న 'జాతకట్ఠవణ్ణనా' అనే గ్రంథం

క్రీస్తుశకం 5వ శతాబ్దపు సింహళీయ గ్రంథానికి పాలీ అనువాదం. ఈ సింహళీయ గ్రంథం ప్రాచీన పాలీ గాథల టీక. పై పేర్కొన్న రామపండితుని ఉపదేశంలోని గాథల వంటివి భగవద్గీతలో కానవస్తాయి.

జాతస్యహి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ,
తస్మాద పరిహార్యేర్థే నత్వం శోచితు మర్హసి. (2–27)

ఈ జాతక కథలోని "ఫలా నామివ పక్కానం" అనే గాథ రామాయణంలోని

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పత నాద్భయం,
ఏవం నరాణాం జాతానాం నాన్యత్ర మరణాద్భయం·
(2–107–17)

శ్లోకంతో పోలుతున్నది. ఈ కథలోని జలక్రియ గాథతో రామాయణంలోని జలక్రియతో సంబంధం ఉన్నదని స్పష్టం. రామాయణంలో రాముడు లక్ష్మణునితో ఇలా అంటాడు:

"భరతో దుఃఖ మాచష్టే స్వర్గతిం పృథివీ పతేః,
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మ నః,
సీతా పురస్తాత్ వ్రజతు త్వమేనా మభితో వ్రజ,
అహం పశ్చాద్గ మిష్యామి గతిర్హ్యేషా సుదారుణా. ·21"

లక్ష్మణా, రాజు మరణించాడనే దుఃఖ వార్తను భరతుడు చెబుతున్నాడు. తండ్రికి నీళ్ల వదలడానికి వెళ్తాను. సీత మొదట వెళ్లనీ. నీవు ఆమెకు ముందుగా వెళ్ళు. నేను వెంటవస్తాను–అని–

"యదేకో జాయతే జంతు రేకేనచ వినశ్యతి", అనే రామాయణ శ్లోకంతో

"ఏకోవ మచ్చో అచ్చేతి ఏకోవ జాయతే కులే" అనే గాథ పూర్తిగా పోలుతున్నది.

"ఒక దసవస్స సహస్సాని" అనే గాథ రామాయణంలోని

"దశ వర్ష సహస్రాణి దశవర్ష శతానిచ
భ్రాతృభి స్సహిత శ్రీమాన్ రామోరాజ్య మకారయత్
(6–131–106)

మహా భారతంలోని రామోపాఖ్యానంలోను

దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ
రాజ్యం కారితవాన్ రామః తతస్తు త్రి దివంగతః
(3–147–38)

శ్యామో యువా లోహితాక్షో మత్తవారణ విక్రమః
దశవర్ష సహస్రాణి రామోరాజ్య మకారయత్.
(12–29–54)

హరి వంశంలోను

"దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ
అయోధ్యాధిపతి ర్భూత్వా రామోరాజ్య మకారయత్.
(1–41–151)

ఈ పోలికలను బట్టి వాల్మీకి రామాయణ ప్రభావం దశరథ జాతక కథపై వుందనడం స్పష్టం

## అనామక జాతకం

రామ కథ లభించే రెండవ జాతకం అనామక జాతకం. ఈ జాతక కథను క్రీస్తుశకం మూడవశతాబ్దిలో కాంగ్–సేంగ్–హుఈ అనే చీనా పండితుడు చీన భాషలోనికి అనువదించాడు. దీని మూల భారతీయ పాఠం లభించలేదు. చీన భాష నుంచి మరల ప్రాకృతానికి అనూదితమైంది.

ఈ జాతకకథలో రామాయణ పాత్రల ఉల్లేఖమేమీ లేదు. కాని, సీతారాముల వనవాసం, సీతాపహరణం, జటాయువృత్తాంతం, వాలి సుగ్రీవుల యుద్ధం, సేతుబంధం, సీత అగ్నిపరీక్ష వీటన్నిటి ప్రతీకలూ ఉన్నాయి. ఈ కథలోని విశిష్టాంశ మేమిటంటే, రాముని సవతితల్లి వరంపై తండ్రి అరణ్యానికి పంపడు. రాముడు తన మేనమామ దండెత్తి వస్తాడని విని రాజ్యం వదలి అడవికి వెళ్లుతాడు. రాముని ధనుష్టంకారం విన్నంతనే వాలి భయపడి పరుగెత్తిపోతాడు. బోధిసత్త్వుడు వాలిని వధించాడని చెప్పడం బౌద్ధులకు ఇష్టంలేదు.

ఈ జాతక కథ సారాంశమిది :

ఒక జన్మలో బోధిసత్త్వుడు గొప్పరాజు. అతడు నాలుగు ఉత్తమ గుణాలు -- దానం, ప్రియవచనం, న్యాయం, సమదర్శిత కలవాడు సమస్త జీవులను రక్షించేవాడు. అతని మేనమామకూడ రాజు. అతడు లజ్జాహీనుడు, లోభి, నిర్దయి, దుష్టుడు. బోధిసత్త్వుని రాజ్యం అపహరించడానికి అతడొక పెద్ద సైన్యం సిద్ధం చేశాడు.

బోధిసత్త్వుని రాజ్యసంచాలకులు కూడ పెద్ద సైన్యం సిద్ధపరచారు. బోధిసత్త్వుడు ఆ సైన్యాన్ని పరిశీలిస్తూ కేవలం నా స్వార్థం కోసం ఇంతమంది ప్రాణాలు తీయడం ఎందుకు ? నేను రాజ్యం వదలి వెళ్లిపోతే సమస్త దేశమూ రక్షితమవుతుంది అని వారితో అన్నాడు. పిదప అతడు మంత్రులకు రాజ్యం అప్పగించి, రాణితోపాటు అడవులకు వెళ్లాడు. అతని మేనమామ బోధిసత్త్వుని రాజ్యంలో ప్రవేశించి, ఆక్రమించుకొన్నాడు. ప్రజలకు చాల కష్టం కలిగింది.

బోధిసత్త్వుడు ఒక కొండమీది వనంలో నివాసం ఏర్పరచుకొన్నాడు. సముద్రంలో దుష్టుడైన నాగరాజు ఉన్నాడు. వాడు ఛద్మబుషి వేషం ధరించి, రాజు కందమూల ఫలాలు తేవడానికి వెళ్లినప్పుడు ఆశ్రమానికి వచ్చి రాణిని అపహరిస్తాడు. సముద్రానికి దారి రెండు కనుమల మధ్యన ఇరుకుగా వుంది. కొండమీద ఒక పెద్ద పక్షి వాలివుంది. అది తన రెక్కలు విప్పుకొని నాగరాజు దారిని అడ్డగించింది నాగరాజు ఆ పక్షి కుడిరెక్కను తెంపరికి, దానిని కూలవేస్తాడు. సముద్రంలోని ఒక ద్వీపానికి వెళ్లుతాడు. సీతను చెరలో పెడతాడు.

కందమూల ఫలాలతో తిరిగివచ్చిన రాజు ఆశ్రమంలో రాణి లేకుండడం చూచి చాల దుఃఖపడుతాడు. ధనుర్బాణాలు ధరించి రాణి అన్వేషణ కోసం పర్వతాలు గాలిస్తాడు. అప్పుడు ఒక నదీ తీరంలో అతనికి ఒక పెద్ద కోతి కనబడుతుంది; అది చాల వ్యాకులంలో ఉన్నది. తానొక రాజునని, తన పినతండ్రి రాజ్యం గుంజుకొని తనను తరిమివేశాడని, తనకెవ్వరూ మిత్రులు లేరని, రాజు అడిగినమీదట ఆ కోతి చెబుతుంది. రాజు ఆ కోతికి తన కష్టాలు తెలుపుతాడు. వారిద్దరు పరస్పర సహాయం కోసం వాగ్దానా చేసుకుంటారు. తర్వాత రాజు ధనుస్సు ఆల్లెత్రాడును మీటాడు. బాణం సంధించాడు. ఆ టంకారం వినగానే కోతి పినతండ్రి భయకంపితుడై రాజ్యం వదలి పారిపోయాడు.

కోతి రాణిని వెదకడానికి తన స్నేహితులను పంపింది. కోతులు అన్ని దిక్కులకూ వెళ్ళాయి, వెదకడానికి. వెదుకుతుండగా, వారికి ఒకదెబ్బతిని కూలిపోయిన పక్షి కనబడుతుంది. ఒక నాగరాజు రాణిని ఎత్తుకొని పోయాడని ఆ పక్షి చెబుతుంది. సముద్రం దాటడం ఎల్లాగని కపిరాజుకు సందేహం కలిగింది. అప్పుడు ఇంద్రుడు చిన్న కోతిరూపంతో వచ్చి, ''ప్రతి కోతి ఒక్కొక్క గుండు మోసుకొని వచ్చి, సముద్రంలో పడవేయాలని ఉత్తర్వు చేయండి. దానితో సముద్రంలో ఒక దారి ఏర్పడుతుంది. మీరు సుఖంగా నాగరాజు ద్వీపం చేరుకోవచ్చు'' అని సలహా చెబుతుంది.

కోతులు ఆ విధంగానే వారధి కట్టి, సముద్రం దాటి నాగ ద్వీపం చుట్టుముట్టారు. నాగరాజు విషమయమైన పొగమంచును ఉత్పన్నం చేస్తాడు. దానితో కపులంతా భూమిపై ఒరిగిపోయారు. చిన్న కోతి (ఇంద్రుడు) ఒక దివ్యౌషధిని కోతులకు వాసన చూపాడు. వారు మూర్ఛతేరి ఆరోగ్యవంతులయారు. అప్పుడు నాగరాజు పెద్ద తుఫానును కల్పించి కారుమేఘాలతో సూర్యుణ్ని కప్పివేశాడు. ఉరుములు, మెరుపులు. మెరుస్తున్న మెరుపే నాగరాజని చిన్నకోతి (ఇంద్రుడు) కపిరాజుకు తెలియజేస్తాడు. అప్పుడు రాజు ఒక బాణంతో నాగరాజును చంపివేస్తాడు.

తర్వాత చిన్నకోతి రాణిని చెరనుంచి విడిపిస్తాడు. ఇంతలో రాజు మేనమామ మరణించినట్టు వర్తమానం చేరుతుంది. స్వరాజ్యానికి తిరిగి వెళ్తాడు. రాణి రాజును వదలి చాలకాలం పర పురుషుని ఇంట్లో వుందని జనం ఆడిపోసుకుంటారు. అది విని రాజు ''నీవు పరగృహంలో చాలాకాలం వున్నందున నీ ప్రవర్తన గురించి జనం సందేహ పడుతున్నారు. నిన్ను స్వీకరించడం వంశమర్యాదను, సంప్రదాయాన్ని బట్టి ఎంతవరకు ఉచితం'' అని రాణిని ప్రశ్నిస్తాడు. ''నేను ఒక నీచుని అధీనంలో ఒక గుహలో వున్నాను. కాని, బురదలో పంకజంలాగ ఉన్నాను. నాలో సతీత్వం వుంటే, భూమి పగిలిపోవుగాక!'' అని రాణి అంటుంది. ఆ ప్రకారమే భూమి నెర్రలు వారింది. ''చూచారా, నా సతీత్వం ప్రమాణితమైనది'' అని రాణి నిరూపిస్తుంది. రాజు, రాణి ధర్మనిష్ఠులు గనుక, రాజ్యంలోని అన్ని వర్గాలు తమ ధర్మాన్ని ఆచరిస్తూ వుండేవి.

ఈ అతీత కథ చెప్పిన పిదప బుద్ధభగవానుడు భిక్షువులతో ఇలా అన్నాడు:—''ఆ రాజును నేనే రాణి గోప. మేనమామ దేవదత్తుడు. ఇంద్రుడు మైత్రేయుడు. బోధిసత్త్వుని ఆచరణ శాంతి పారమిత ఎల్లలు లేనిది.''

ఈ జాతక కథ రామాయణ పాత్రలను చెప్పకపోయినా, పూర్తిగా వాల్మీకి రామాయణ కథకు అనుకరణమేనని వేరుగా చెప్పనక్కరలేదు.

## మూడవది దశరథ కథానకం :

చీనా భాషలోని త్రిపిటికాలలో 'త్సా-పౌ-త్సంగ్-కింగ్' పేరుతో 121 అవదానాల సంకలన మొకటి వుంది. ఇది క్రీస్తుశకం 472లో చీనీ భాషలోకి అనూదితమైంది. దీని పాలీమూలం లభించడంలేదు. ఈ అవదాన సంగ్రహంలో కనిష్కుని ప్రసక్తి అనేక కథలలో ప్రధానంగా వుండడంవల్ల ఈ అవదాన కథలు క్రీస్తుశకం రెండవ శతాబ్దంలో రచితమై వుంటాయని పండితుల ఊహ. ఈ అవధానాలలో 'దశరథ కథానకం' ఒక్కటి. ఈ కథలో సీతగాని, మరే రాజకుమారిగాని లేకపోవడం విశిష్టత. కథావస్తువు ఇది :—

పూర్వం ఒకప్పుడు మానవుల ఆయుస్సు పదివేలేండ్లు ఉండేది. ఆ కాలంలో జంబూద్వీపంలో దశరథుడనే రాజు రాజ్యం చేసేవాడు. ఆయన పట్టమహిషికి రాముడనే పుత్రుడు కలిగాడు. రెండవ భార్యకు ఒక కుమారుడు. అతని పేరు రామణుడు. (లోమన-లక్ష్మణ)...రామునిలో నారాయణ శక్తి వుండేది. మూడవ రాణికి భరతుడు, నాల్గవరాణికి శత్రుఘ్నుడు పుట్టారు.

మూడవ రాణిమీద రాజుకు చాల ప్రేమ వుండేది. ఒకనాడు రాజు ఆమెతో ''నీవు ఏమైనా కోరుకో. నేను నా సంపద, పూర్తిగా బొక్కసం ఇవ్వడానికి సిద్ధంగా వున్నాను'' అన్నాడు. రాణి తనకేమి అవసరంలేదని అప్పుడు అన్నది. రాజు రోగగ్రస్తుడయాడు. తాను బ్రతకనని నిశ్చయించుకొని రాజు రామునికి పట్టంకట్టాడు. రాముడు సింహాసనంపై ఆసీనుడు కావడం చిన్నరాణికి కన్ను కుట్టింది. ''రాజా, నీవు నాకు పూర్వం ఇచ్చినవరం ఇప్పుడివ్వండి. రాముణ్ని గద్దెనుంచి దింపి, నా కుమారుడైన భరతునికి పట్టాభిషేకం చేయండి. ఇది నా కోరిక'' అని రాజుతో అన్నది. ఇది విని రాజు చాల దుఃఖపడ్డాడు. రాజధర్మానుసారం అతడు తన మాట తప్ప దలచలేదు. అప్పుడు రామణుడు (లక్ష్మణుడు) రామునితో తన నారాయణ శక్తిని చూపమని, సవతి తల్లికి విశ్వాసం కలుగుతుందని ప్రార్థిస్తాడు. ''తన తండ్రి ఆజ్ఞకు భంగం కలిగించే పుత్రుడు పితృభక్తుడనిపించుకోడు'' అని రాముడు సమాధానమిచ్చి మిన్నకుంటాడు.

తన వరానికి కట్టుబడిన దశరథుడు తన కుమారు లిద్దరికీ పన్నెండు సంవత్సరాల వనవాసం విధించి, తర్వాత స్వదేశానికి రమ్మంటాడు. అప్పుడు భరతుడు విదేశాలలో వున్నాడు. దశరథుని

మరణానంతరం భరతుడు స్వదేశానికి మరలి వస్తాడు; తల్లిచేసిన పనికి కటకట పడుతాడు. సేనతోపాటు రామలక్ష్మణులున్న పర్వతానికి తరలివెళ్లి, రాజధానికి మరలివచ్చి, రాజ్యపరిపాలన కొనసాగించవలసిందని రాముణ్ని ప్రార్థిస్తాడు. ''వనవాసంకోసం తండ్రి ఆజ్ఞాపించారు. దానికి భంగం కలిగిస్తే నేను పితృాజ్ఞా పరిపాలకుడని అనిపించుకోను'' అని రాముడు సమాధానం చెప్పి, తిరిగి వెళ్లడానికి నిరాకరిస్తాడు.

అప్పుడు భరతుడు రాముని చర్మపాదుకలు (చమ్మపాదుక) కోరుతాడు. వాటిని తీసుకొని అయోధ్యకు తిరిగి వస్తాడు. పిదప చర్మపాదుకలను సింహాసనంమీద పెట్టి రాజ్యకార్యం నిర్వహిస్తాడు. ప్రతిదినం ఉదయ సాయంకాలాలలో పాదుకలకు పూజచేసి, దాని నుంచి ఆజ్ఞ తీసుకొనేవాడు.

క్రమంగా రాముని వనవాసం గడువు పూర్తయింది. రాముడు వనవాసం ముగించుకొని స్వదేశానికి తిరిగి వస్తాడు. భరతుడు రాజ్యభారం స్వీకరించవలసిందిగా రాముని ప్రార్థిస్తాడు. రాముడు మొదట నిరాకరించాడు, కాని, భరతుడు తీవ్రంగా అనురోధం చేయడం వలన స్వీకరించాడు. రాముని రాజ్యంలో అందరూ తమ తమ ధర్మాలు పాలించేవారు. శాంతి, సమృద్ధులు విరాజిల్లాయి.

దశరథ జాతకాన్ని, తక్కిన రెండిటిని - అనామకాన్ని దశరథ కథానకంను—పరిశీలించగా, వీటిలోని రామకథ వాల్మీకి రామాయణంతో చాలవరకు పోలుతున్నది. 'దశరథ జాతకం'లో రామవనవాసానికి, సీతానుగమనానికి తగిన ఆధారాలు లభించవు. వాల్మీకి రామాయణ కథలో సీత భర్తవెంట వెళ్లడం ఉచితమయినట్టు 'దశరథ జాతకం'లో చెల్లెలయిన సీతరామలక్ష్మణులవెంట వెళ్లడం ఉచితంగా తోచదు. చెల్లెలిని వివాహమాడడం కూడ విడ్డూరంగా ఉంది. ఇంతకుముందు పేర్కొన్న గాథలకు రామాయణంతో పోలికలను బట్టి కూడ ఈ జాతక కథలన్నీ వాల్మీకీయ రామకథకు వికృత రూపంగా కనిపిస్తున్నాయి.

## పిటకాలలో

ఈ జాతక కథలు గాక పాలీత్రిపిటకాలలో రామకథకు సంబంధించిన కొంత సామగ్రి—గాథలు ఉన్నాయి. వాటిని ఉల్లేఖిస్తాను. వీటిలో సీతా రాముల ప్రస్తావం ఉన్నందున త్రిపిటిక సంకలన కర్తలు వాల్మీకీయ రామకథతో బాగా పరిచయమున్న వారనే స్పష్టమవుతుంది.

## జయద్దిస జాతకం

ఇది పాలీ జాతకద్దివణ్ణనలో 513 వ జాతకం. దీనిలో 17వ గాదనుబట్టి రాముని వనవాసం హిమాలయాలలో గాక, దండకారణ్యంలో జరిగినట్టు వర్ణితమయింది. ఒక తల్లి తన కుమారునితో ఇలా అంటుంది:—

''యందండ కారణ్ణ గతస్స మాతా
రామస్సకా సోత్థానం సుగత్తా
తంతే అహం సోత్థానం కరోమి''

''దండకారణ్యావాసి అయిన రామునికి ''సుగాత్రి (సుందరి) అయిన తల్లి ఎలాటి స్వస్త్యయనం – మంగళం చేసిందో నేనూ నీకు అలాటి స్వస్త్యయనమే చేస్తున్నాను.'' దశరథ జాతకం ప్రకారం రాముని వనవాస కాలానికి అతని తల్లిలేదు. అక్కడ వనవాసం హిమాలయంలో.

## వేస్సంతర జాతకం :-

ఇది 547 వ జాతకం. వేసంతరుని భార్య మద్దీ తన భర్తతో ఇలా అంటుంది:

''అవరుద్దస్సహం భరియా రాజపుత్తస్స సిరీమతో!
తంచాహం నాతిమఞ్ఞామి రాముని సీతా మనుబ్బతా.''
(గాథ 541)

నేను శ్రీమంతుడైన, నిర్వాసితుడైన రాజపుత్రుని భార్యను. రాముణ్ని అనుసరించిన సీత, ఏ విధంగా తన భర్తను ఆదరించిందో నేనూ ఆ విధంగానే ఆదరిస్తాను. దీనినిబట్టి అరణ్యావాసంతో సీతారాముల సంబంధం పతిపత్నీ సంబంధమే కాని సోదరీ సోదర సంబంధం కాదని ధ్వనిస్తుంది.

ఈ ప్రాసంగిక గాథలేకాక రామాయణ ఉపకథల పోలికలున్న జాతకాలు కూడ ఉన్నవి.

## సామ జాతకం :-

ఇది 540 వ జాతకథ. ఇది రామాయణంలోని అంధముని సూతుడు శ్రవణ కుమారుని దశరథుడు శబ్దవేధి బాణంతో చంపిన కథకు రూపాంతరం. ఈ జాతక కథ అమరావతీ సాంచీ, స్తూపాలలో గండరించబడడాన్ని బట్టి దీని జనప్రియత తెలుస్తుంది. సామజాతక కథ సారాంశమిది :

నిషాదకులంలో పుట్టిన దుకూలుడు, పారిక హిమాలయంలో ఒక ఆశ్రమంలో ఋషి జీవితం గడుపుతూ వుంటారు. వారికి బోధిసత్త్వుడు అలౌకిక రీతిలో పుత్రుడవుతాడు. వాని పేరు సాముడు. సామునికి 16 సంవత్సరాల వయస్సు వచ్చేవేళకు ఒక పాము కాటుతో తలిదండ్రులు అంధులైపోతారు. అప్పటినుంచి సాముడు తలిదండ్రులకు సేవచేస్తూ వుంటాడు.

ఒకనాడు సాముడు నీళ్లకోసం ఏటికి పోతాడు. అక్కడ కాశీరాజు బలియకుడు వదలిన విషదిగ్ధమయిన బాణం తగిలి మరణిస్తాడు. రాజు వెదుక్కుంటూ వచ్చి, జరిగిన సంగతిని సాముని తలిదండ్రులకు తెలుపుతాడు. సాముడు మరణ సమయంలో తన బాధకన్నా, తలిదండ్రుల దయనీయస్థితిని గురించి విలపిస్తాడు. తలిదండ్రుల కోరికపై వారిని సాముని కళేబరం వద్దకు రాజు చేర్చుతాడు. అప్పుడు పారిక ''నా పుత్రుడు తలిదండ్రులకు నిజ

మైన భిక్షుణియైతే, విషంలుప్త మవుతుంది'' అని శపథం - సచ్చక్రియ చేస్తుంది. దుకూలకుడూ అలాటి సచ్చక్రియ చేస్తాడు. మదేవకూడ శపథం చేస్తుంది. సాముడు నిద్రనుంచి లేచి కూర్చున్నట్లు లేచి కూర్చుంటాడు. రాజుకు స్వాగతం చెప్పి, ''నాకు మూర్ఛ వచ్చింది. తల్లిదండ్రుల సేవచేసేవారు ఉభయ లోకాలలోను సుఖపడతారు'' అని అంటాడు. పిదప పిలియక మహారాజుకు రాజధర్మం ఉపదేశిస్తాడు.

రామాయణంలోని మునికుమారుని తల్లిదండ్రులు, ముని కుమారుడు చాల ఉత్తేజితులవుతారు. చివరకు మునికుమారుడు పునరుజ్జీవితుడు కాడు. కాని ఈ రెండు కథలలోను పోలిక మాత్రమేకాక గాథలలోను, రామాయణ శ్లోకాలలోను శబ్దసామ్యం కూడ కనిపిస్తుంది.

అయం ఏకపదీ రాజా (గాథ 19)
ఇయమేకపదీరాజన్ (రామా 2-63-44)
అదూసక పితాపుత్తా తయో సికూసు నాహరా (గాథ 39)
వృద్ధౌచమాతా పితరా అహంచేకేషుణా హతః.
(రామా 2-63-32)

వృద్ధపిత దుకూలకుని విలాపంలోని ఒక గాథ రామాయణంలోని ఒక శ్లోకంతో పూర్తిగా పోలుతుంది.

కోదాని భుంజఇస్సతి వనమూల ఫలానిచ,
సామో అయం కాలకతో అంధానం పరిచారకో. (గా 85)

కందమూల ఫలం హృత్వాయోమాం ప్రియమి వాతథిమ్,
భోజయి ష్యత్యకర్మణ్యం అప్రగ్రహమనాయకమ్.
(రామా. 1-64-34)

ఈ రెండింటికీ మూలం ఒక్కటేమో ! రామాయణమె ఈ సామజాతకానికి మూలమని నా అభిప్రాయం

వేస్సంతర జాతకంలో చెప్పుకోదగ్గ రామాయణంతో పోలికలు కనిపిస్తాయి.

వేస్సంతరుడు దానవీరుడు. అడిగింది ఇవ్వటం అతని ప్రతిజ్ఞ. ఒకసారి దేశక్షేమం కొరకు మంగళహస్తిని దాన మిస్తాడు. దీనికోసం అతనికి రాజు దేశబహిష్కార శిక్ష విధిస్తాడు. అతని ధర్మపత్ని మద్రి, ఇద్దరు కుమారులు వెంట రాగా అడవులకు, నాలుగు గుర్రాలు కట్టిన రథంలో బయలుదేరు తారు. దారిలో ఒక బ్రాహ్మణుడు రథం కోరగా ఇచ్చివేస్తాడు అడవిలో వారు నలుగురు ఒక కుటీరంలో నివసిస్తారు. అప్పుడు శక్రుడు (ఇంద్రుడు) కురూప బ్రాహ్మణ వేషంతో వచ్చి, వేస్సంతరుని ఇద్దరు కుమారులను, భార్యను దానమిమ్మని కోరి, పొందుతాడు. తర్వాత ఆ బ్రాహ్మణుడు నిజస్వరూపం చెప్పి, వేస్సంతరుని దానశీలాన్ని ప్రశంసిస్తాడు. కథ సుఖాంతమవుతుంది.

ఈ జాతక కథలో వేస్సంతరుని వన వాసం, వనవాసానికి ముందు దానమివ్వడం, కౌశల్యలాగ వేస్సంతరుని తల్లి రోదించడం, కుటీర వర్ణనం, శక్రుని వేషం లోభి బ్రాహ్మణునికి ఇచ్చి వేయడం చూపడం మొదలయిన పోలికలు సామాన్య దృష్టికే కనిపిస్తాయి. సీత అడవికి పిలుచుకొని పోకపోతే నీళ్లల్లోనో, నిప్పులోనో పడి, విషం పుచ్చుకొని మరణిస్తానంటుంది. మద్రీ కూడా అలాగే అంటుంది.

అగ్గిం నిజ్జాలయిత్వాన ఏక జాలం సమాహితమ్,
తత్థమే మరణం సెయ్యో యంచే జీనేతయువినా.
(గా 73)

యదిమందుఃఖితా మేవం వనంనేతుం నచేచ్ఛసి,
విషమగ్నిం జలం వాహం ఆస్థాస్యే మృత్యు కారణాత్.
(రామా 2-29-21)

దీనిని బట్టి వేస్సంతర జాతక రచయితకు రామాయణం బాగా తెలును ననడానికి సందేహం లేదు.

## సంబులా జాతకం -

ఇది 519 వ జాతకకథ. దీనిలో పతి భక్తురాలయిన సంబులం వృత్తాంతం వుంది. ఈమె భర్త రాజకుమార సొత్థి సేనుడు; కుష్ఠురోగి. ఈమె అతనితో పాటు వనంలో నివసిస్తూ, అతనికి సేవచేస్తూ జీవితం గడుపుతుంది. ఒకనాడు ఒక దాన వుడు సంబులను చూచి భార్యగా చేసుకొనడానికి బలవంత పెడు తాడు. కాని, సంబుల అంగీకరించదు. సక్కుడు (శక్రుడు) ఆమెను దానవుని బారినుండి రక్షిస్తాడు. సొత్థిసేనుడు తన పత్ని సతీత్వాన్ని శంకిస్తాడు. ఆమె ఒక సచ్చకిరియం-సత్యక్రియ-చేసి, శపథం చేసి - తన భర్త కుష్ఠురోగాన్ని పోగొడుతుంది - నేను నా భర్తనూ తప్ప పరపురుషుణ్ణి చూడనట్లయితే భర్త వ్యాధి శమించనీ - అనేది సత్యక్రియ.

తర్వాత ఇద్దరూ రాజధానికి తిరిగి వస్తారు. కృతఘ్నుడైన సొత్థిసేనుడు అన్య స్త్రీలను మరిగి సంబులకు కష్టాలు కలిగి స్తాడు. కాని, చివరకు తండ్రి మాటవిని సంబులను క్షమాపణ కోరుతాడు. పిదప ఇద్దరి జీవితం సుఖమయంగా నడుస్తుంది

సంబుల సీతలాగే పతి సపర్య చేస్తుంది. ఆమె సత్యక్రియ సీత అగ్నిపరీక్షా శపథం లాంటిది. దానవుడు రావణుడు మాటల లోను సమానులు. నీవు నా మహిషి కావడానికి ఇష్టపడకపోతే, నిన్ను నేను నా ప్రాతఃకాల హారంలో తినేస్తాను అని దానవుడు రావణుడు సీతను బెదరించినట్టే బెదరిస్తాడు :

నోచే తువం మహేసెయ్యం సంబులే కారయిస్ససి,
అలంత్వం పాతరాసాయ మఞ్ఞే భక్ఖా భవిస్ససి.
(గాథ-10)

ద్వాభ్యా మూర్ధ్వంతు మా సాభ్యాం భర్తారం మా మని చ్ఛతీం,
మమత్వాం ప్రాతరాశార్థే సూదాశ్ఛేత్స్యంతి ఖండశః.
(రామా 5-22 9)

(మిగతా 26 వ పేజీలో)

# మధ్యతరగతి మందహాసం

శ్రీమతి యం. ఐ. లక్ష్మీదేవి

ఛందోరహిత స్వభాషలో
మందహాసం చేసే కవిని నేను
మధ్యతరగతి మనస్వినులకు
మాయని ప్రతీకను నేను —
"నాపేరు మధ్యవర్గం—నేనున్నది అపర స్వర్గం"

ఒకప్పుడు— తండ్రి తాతల కీర్తినదిలో
చివరి బిందువును నేను
ఆశయాల అఖండ దీపంలో
అయిపోయిన చమురును నేను.

నిజాయితీ అన్వేషణకై
నిర్మించిన వంతెన నేను —
కాలకన్య మెత్తని ఒడిలో
కళ్ళు మూసుకు పడుకున్నాను.

సంతోషపు రామచిలుకను।
ఆకలి రాబందుల కిచ్చేసాను
నా కూలిపోయిన హృదయ సదనం
గబ్బిలాలకు స్థిరనివాసం"

అంకెల్లో శూన్యాన్ని నేను
బ్రతుకు జైల్లో బందీని నేను
యుగ యుగాల అసమానత రూపాన్ని నేను
తరతరాల అశక్త దేహం నాది — నాడు — నేను —
అనుభవాల డిగ్రీతో దగాపడ్డ ఉన్మాదిని.

ఆనాడు —

ఆకలి నా ఆహారం
బాధలు నా ఆహార్యం
యశస్సు నా కండూతి
తమస్సు నా సదనం

మంచితనం నా ధ్యేయం
భ్రమపడడం జన్మహక్కు

చరిత్రలో పి. హెచ్ .డి. ని
చరిత్రకు నేను తెలియను

పూర్వం —
నేను—నమ్మకం చెడ్డవాడిని
దౌర్భాగ్యపు వదరుబోతును
అధోదృష్టిని—దుఃఖ జీవిని
కలలు చెదిరిన శప్తమూర్తిని

అయితే— ఈనాడు— నేను—

విజయశోభను—వైద్య రత్నను
ప్రజాకోటిని — శబ్దధాటిని
సౌఖ్య గీతిని — సర్వ శాంతిని
అమర జీవిని — దేవగురువును.

నేను —

స్వర్ణ విహంగాన్ని —
సుప్త భుజంగాన్ని —
రణిత మృదంగాన్ని
నాదవాణీ వీణతీగెను.

శాంతి నిర్మిత కుసుమ తుల్యపు మహానగరం —
గగన చుంబిత భవన శిఖరపు రత్నకాంతులు
విష్ణు హస్తపు దీర్ఘరేఖల సందుగొందులు
ప్రమోద్యానపు పుష్పరాగం—గగనకుసుమపు తేనెచూకలు
నావే! నావే!! నావే!!!

నేడు నేను —

అనంత విహాయసంలో భాసిస్తున్న భానుడను
అమరావతీ పురవనంలో నర్తిస్తున్న నటుడను
అమిత ప్రౌఢిమతో ప్రజ్వలిస్తున్న పండితుడను
జనత ప్రభుతకు అమితకీర్తిని ఆపాదించే అమరజీవిని

నా పేరు మధ్యవర్గం—నేనున్నది—అసలు స్వర్గం.

శ్రీ ఎమ్. పార్థసారథి

# కౌగిలి

*(గత సంచిక తరువాయి)*

## డ్యూటీ ఫస్ట్

కంపెనీవాళ్ళు తమ స్టెనోగ్రాఫర్లకు రెఫ్రెషర్స్‌కోర్స్ ఒకటి నిర్వహించటానికి నిశ్చయించారు. కోర్సు కలకత్తాలో జరుగుతుంది. పెద్ద సెంటర్ల నుండి యిద్దరు మనుష్యులు వెడితే చిన్న సెంటర్ల నుండి కనీసం ఒకరైనా వెళ్ళొచ్చు. తను కలకత్తా వెళ్ళేటట్టు మేనేజ్ చేసుకోవటం బాలాకు కష్టమేమీ కాలేదు. కోర్స్ తర్వాత స్టడీటూర్ వుంది. పదిహేను రోజులు కోర్స్, పదిహేను రోజులు టూర్. జీతంగాక హాల్టింగ్ అలవెన్స్, కన్వేయన్ అలవెన్స్ మొదలైనవన్నీ వుంటాయి. ఇవిగాక పార్టీలు. జీతం మిగుల్తుంది, ఊళ్ళు చూసివచ్చినట్టూ వుంటుంది.

"వెళ్ళక తప్పదా?" అంది మనోరమ.

"ఏం చెయ్యను మనూ, తప్పదు. మా యిబ్బందులు వాళ్ళకేం తెలుసు. వెళ్ళాల్సిందే."

"మరి నా గతేమిటి?"

"ఇంటేముంది. ఇక్కడో, మీ అమ్మ వాళ్ళింట్లోనో వుండాల్సిందే."

"బాగుంది. వాళ్ళు పిలిచినప్పుడు వెళితే అందంగాని — యిలా మన అవసరానికి పోతే ఏం బాగుంటుంది! ఇలాగే లోకువైపోతాం" అంది మనోరమ.

"మరి ఇక్కడ ఒక్కదానివి వుండగలవా? లేదా మీ అమ్మ నిచ్చి పంపాలా — అదేనా?"

"సరేలే. నా చావేదో నేను చస్తాను. నువ్వేలే కంపెనీ ఖర్చుతో జల్సా చేసిరా" అంది మనోరమ.

"నేను ప్రతిరోజు రాస్తుంటాను. మరి నువ్వు కూడా రాయాలి" అన్నట్టు - లెటర్స్ ఇంటికే రాస్తాను. ఆఫీసుకురాస్తే ఎదర వెధవలు తీసి చూస్తారు" అన్నాడు బాలూ.

"వీడితో నేను ఎన్నాళ్ళు ఆఫీసుకు వెళ్ళగలనో ఏమిటో?"

"నీకేం తెమ్మంటావో చెప్పు."

"నేనొకదాన్ని యిక్కడ వున్నానని జ్ఞాపకం పెట్టుకొంటే అంతేచాలు. చూడూ, నీకు అక్కడ ఖర్చు. నాకు యిక్కడ ఖర్చు. నేను మా వాళ్ళింటికెళ్ళినా పనిమనిషిని తీసెయ్యలేం—దానికి జీతం దండగ. ఎందుకొచ్చిన ప్రయాణం" అంది మనోరమ.

"అలా కాదు డబ్బొక్కటే ముఖ్యం కాదు. మనం పెండింగ్‌గా వున్న కోర్సులూ, ట్రెయినింగ్‌లు అన్నీ పూర్తి చేసుకున్నామన్న తృప్తి వుంటుంది." పోనీ, నేను వెళ్ళిన తర్వాత చెక్ రాస్తాను. నువ్వూ వచ్చెయ్యి.

"అమ్మో, వీడితో నేనెక్కడ ప్రయాణం చేస్తాను. వద్దు బాబూ, ఇప్పుడున్న సుఖం చాలు" అంది మనోరమ.

"అయాం సారీ డార్లింగ్ నీ కింత యిబ్బందిగా వుంటుందనుకోలేదు. కాని మిగతా వాళ్ళంతా ఎలా కాపరాలు చేస్తున్నారోయ్?" అన్నాడు బాలూ.

"ఎలాగంటే,- ఇలాగే ఏడుస్తూ, మొత్తుకుంటూ, మూల్గుతూ. ఎవరు మాత్రం ఏమంత సుఖంగావున్నారని. మనమైనా కొన్నాళ్ళు హాయిగా వుండామంటే, నీకేమో అంత తొందరాయె."

"ఇప్పుడు వీడు బాగ లేడా?"

"పిల్లలెందుకు కానందరు, కాని వాళ్ళ వెంట ఎన్ని బాధ్యతలు, ఎంత విసుగు, ఎన్ని త్యాగాలు!"

## ఆఫీసులో ఒక రోజు

పొద్దున్నే ఒక్కుదుటి లేవటం, బస్సుకోసమూ, బస్సులోనూ నుంచుని అలవాటు తప్పిన ప్రయాణంచేసి హడావిడిగా ఆఫీసుకు వెళ్ళింది మనోరమ. టేబిలు మీద వరుసగా పెట్టిన ఫైళ్ళున్నా, వచ్చినప్పుడు కూడా ఒక్కటి కూర్చుని పనిచేయని పోవటంవల్ల ఆఫీసర్లకు కోపంగా వుంది. ఆ రోజు సెక్షన్ ఇన్‌చార్జి పిలిచి, "బాగా, పెళ్ళైన, పిల్లల్తో వని అసలు పనిచేయటం లేదు. అర్జెంటు పేపర్సయినా అటెండ్ కాకపోతే ఎలాగండీ, అక్కడికి ఎక్స్‌ట్రా సీట్లు వాళ్ళనడిగి పని చేయించుకుంటున్నాను మా యిబ్బందులు కూడా చూడాలి మరి' అన్నాడు.

"ఏం చెయ్యనండీ, ఏన్నేం చెయ్యమంటారు. మా ఇంట్లో పరిస్థితులు అలా వున్నాయి" అంది మనోరమ.

ఆరోజు ఆమె సీటు నుండి కదల్లేదు. ఆమె స్నేహితులేవచ్చి పక్కన కూర్చున్నారు కబుర్లకోసం. నాకైతే నెలరోజులు సెలవు లొచ్చినట్టే వుంది'' అన్నాడు రాధాకృష్ణ లేదా సుబ్బారావు లేదా జానకిరాం —

''ఇదిగో, మీరిలా కబుర్లు చెప్తే నన్ను పనిచేసుకోనివ్వరు. ఈసారి ఆఫీసరు నన్ను తిడితే ఆ పాపం మీదే'' అంది మనోరమ.

''కాఫీ కూడా తాగకుండా పనిచెయ్యమని చెప్పాడా ఏం, అడగమంటారా ? మన యూనియన్ సెక్రెటరీని అడిగొస్తాం, ఆగండి, వర్కింగ్ కండిషన్స్ ఎప్పటి నుండి మారాయో—'' అన్నాడు

మనోరమ మాట్లాడలేదు

''మీ అబ్బాయి ఎలా వున్నాడు ?''

ఈసారి ఆమెకు జవాబు చెప్పక తప్పలేదు.

''పాపం, మీ హస్బెండ్ మిమ్మల్నలా వొదిలి వెళ్ళకపోతేనేం, వాడు, ఆ శేషాచారిగాడు ఆర్నెలల నుంచీ కలలు కంటుంటే, చివరి క్షణంలో ట్రంపు కార్డువేసి ఆ ఛాన్సు కాస్తా తన్నేశాడు మీ శ్రీశ్రీవారు.''

''వెళ్లక తప్పదన్నాడే'' అని నాలిక్కరచుకొంది మనోరమ— అలాటి విషయాలు బైటికి తేవొద్దనుకుంటూ.

''పాపం,చిక్కిపోయారు, రాత్రంతా నిద్రలేదనుకుంటాను.''

''ఇద్దరు పిల్లల మధ్యన నలిగి పోతున్నది''

మనోరమ కోపం తెచ్చుకోవలసిందల్లా కిసుక్కున నవ్వింది.

''మీ అబ్బాయి పేరేమిటి ?''

''నా మొహం — అదిగో ఆఫీసరుగాడి మొహం చూసి మాట్లాడు. గుడ్లగూబలా నా వైపే చూస్తున్నాడు.''

''అవునవును. వాడు మీ హస్బెండ్ చవ్వా. మీ మీద స్పైయింగ్ చేసేది వాడే. ఏం, మీరు మాట్లాడితేనే అంత కోప మొస్తే ఎలాగ, ఇదివరకు బాలూ సంగతి ఎవరికి తెలియదని? మన టి. ఒ. నడగండి, చెబుతుంది. లేదా వీణ్ణడగండి. — ఒకప్పుడు ఆమె వీళ్లిద్దర్నీ ఫిఫ్టీ — ఫిఫ్టీ సంతోషపెట్టేది.''

ఆ సాయంత్రం ఆమెతో బస్సు ప్రయాణం చేసి, మొహమాట పెట్టి కాఫీ తాగించి, యింటి గుమ్మందాకా ఎస్కార్ట్ యిచ్చి వెళ్లారు ఆమె స్నేహితులు.

''నో. నో. హి ఈజ్ వెరీ నైస్ అతడి గురించి మీరలా చెడ్డగా మాట్లాడకండి'' అంది మనోరమ. తనెంత మాట్లాడినా తన గొంతులో సీరియస్‌నెస్ రాకపోవటం ఆమెకే విచిత్రంగా తోచింది.

## ఒక ప్రేమ లేఖ

డియర్ మనూ,

రోజూ రాయాలనుకుంటూనే అప్పుడే వారం రోజులు గడిచిపోయాయి. ఇక్కడ మా ప్రోగ్రాం చాల టైట్ షెడ్యూల్‌లో సాగుతున్నది. మోడర్న్ కంపెనీ అడ్మినిస్ట్రేషన్ యొక్క అన్ని యాస్పెక్ట్సునూ క్షుణ్ణంగా చెబుతారు. సాయంత్రం గేమ్స్‌కూడా కంపల్సరీ. ఇది రెసిడెన్షల్ ట్రెయినింగ్ కావటంతో మా లెక్చరర్స్ అంటే — మా ఆఫీసర్లూ, మేమూ కలిసి ఒకే కుటుంబంలాగా వుంటున్నాం. అలా ఆఫీసర్లను మేం బాగా తెలుసుకోవటానికీ, వాళ్లతో పరిచయాలు పెంచుకోవటానికి కూడా యిది మంచి అవకాశం.

ఇదివరకైతే నేను ఏ రకమైన భోజనమైనా చెయ్యగలిగే వాణ్ణి గాని పెళ్లి తర్వాత నీ వంట అలవాటుకావటంతో నాకు భోజనం యిబ్బందిగా వున్నది.

బుజ్జిగాడు ఎలావున్నాడు ?

రోజంతా బిజీగా గడిపి, సాయంత్రం భోజనం చేసి, పక్క మీద వాలగానే జ్ఞాపకం వస్తావు నువ్వు. ఈ జీవితంలో ఒక నెలరోజులైనా నీనుంచి దూరంగా వుండవలసిరావటం ఎంత దురదృష్టం ! కాని ఏమైనా కొన్ని త్యాగాలవల్లనే సాధిస్తాం ప్రతిదానికీ ఒక ఖరీదు చెల్లించాల్సిందే.

ఇంతవరకు సైట్‌సీయింగ్‌కు ఎక్కడికీ వెళ్లలేదు

ఈ కోర్సు ప్రత్యేకత ఏమిటంటే, మా ఇంటర్నేషనల్ హెడ్ క్వార్టర్స్‌లో వుండే మా డిప్యూటీ ఛెయిర్మన్ (ఆపరేషన్స్) కూడా వచ్చి ఒక రోజు మాట్లాడి వెళ్లాడు. మిగతా సెంటర్సు నుండి వచ్చినవాళ్లతో కలిసి పనిచెయ్యటంవల్ల మన కెపాసిటీ కూడా పెంచుకోవచ్చు. ఎక్కడైనా ఆల్ఇండియా ఇంటర్వ్యూలు జరిగితే మనం వాళ్లతో సరిగా తయారుకావచ్చు. క్వాలిఫికేషన్స్ వరకైతే నేనెవరికీ తీసిపోను కాని యింక 'పుల్లింగ్' వ్యవహారం అంటావా — ఏదో యథాశక్తి ప్రయత్నించాలి మరి.

నెక్స్టు ఇయర్ మన బొంబాయి ఆఫీసులో నాలుగు స్టెనోగ్రాఫర్స్ (సెలక్షన్ గ్రేడ్) పోస్టులు వస్తున్నాయి. అంటే ఆ హోదాలో మనం కంపెనీ డైరెక్టర్స్ వద్ద పనిచెయ్యొచ్చన్నమాట. బహుశా — అదొక్కటి సాధిస్తే నేను ఈ జీవితంలో అంతా సాదించినట్టే అనుకుంటాను ఎలాగో కిందామీదా పడి ఐనా సాధిస్తాను అందుకు ఇక్కడి పరిచయాలు 'బేస్'గా నైనా పనికొస్తాయి.

మీ పేరెంట్స్‌నూ, చెల్లెళ్లనీ, తమ్ముణ్ణీ అడిగానని చెప్పు.

నేను మన జాయింట్ అక్కౌంట్‌లో వెయ్యటానికి మూడు వందల రూపాయల చెక్కు పంపిస్తున్నాను. అది ఎన్‌కాష్ చేసుకొని అందులోనుండి నూట యాభై రూపాయలు గోవిందజోషీ చిట్‌లో కట్టాలి.

ఇప్పటికింతే సంగతులు.

నీవు త్వరగా వుత్తరం రాస్తావని ఎదురుచూస్తూ,

నీ భర్త

బి. వి. బి.

## ఆటవిడుపు

మళ్లీ ఈరోజెందుకే సెలవు ?'' అంది మనోరమ తల్లి.

''వాళ్లాయన రాకముందే సినిమాలన్నీ చూడనీయవే'' అంది నీరజ

మనోరమ పెళ్లైన తర్వాత ఒక్కనెలలో ఇన్ని సినిమాలు చూడటం ఇదే మొదటిసారి. ఈ పదిహేను రోజుల్లో పన్నెండు సినిమాలు చూసింది. కొని సార్లు ఆఫీసులో పర్మిషన్ తీసుకుని, కొన్నిసార్లు సెలవుపెట్టి, ఏ ఆదివారమూ వొదలకుండా.

''మీ ఆయనొస్తే ఇంక నీ సినిమాలు తగ్గిపోతాయ్'' అంది నీరజ.

''వస్తే భయమా ఏమిటి, ఏదో వూరికే నసుగుతుంటా డనిగాని. పైగా యిప్పుడు వీడుకూడా వచ్చిపడ్డాడు. వీణ్ణి తీసుకొని పోవాలన్నా యిబ్బందే'' అంది మనోరమ. ''ప్చ్'' సినిమా లంటారుగాని అదిగూడా కాదే. ఇంట్లో ఎంత బోర్ కొడుతుందో తెలుసా ! కొన్నాళ్ళు మీరక్కడ వుంటేగాని తెలియదు. సరదాగా కబుర్లు చెప్పడం, ఇద్దరం కలిసి ఎక్కడికన్నా వెళ్లడం అలాంటి వేమీ తెలియవు ఆయనకు. ఇంటి కొచ్చాడంటే భోజనం, పడకా, నిద్రా. అంతే. ఉదయం లేవగానే హడావడి. ఒకటే దైవభక్తి — అదేమిటో — రోజూ అరగంటసేపు పూజచేసుకొనేవాళ్లను నేనెక్కడా చూడలేదు సెలవొస్తే నిద్ర. లేకపోతే తన స్నేహితులకు ఉత్తరాలు రాసుకోవటం. ఇంట్లో యిలా బోర్‌కొట్టి వుంటానా, ఆఫీసులో మాట్లాడితే అనుమానం. కాఫీ తాగితే అనుమానం తను సినిమాలకు రానివ్వడు నన్ను పోనివ్వడు. ఎంతసేపూ డబ్బు జమచేద్దాం, షేర్స్ కొందాం అనే యావ. నా బొంద; ఏమిటే కొనేది. సరదాగా ఎంజాయ్ చెయ్యక. పెళ్లికి ముందర ఎలా మాట్లాడేవాడనుకున్నావు, నేనిన్నాళ్ళు ఆగింది నీ కోసమే. నువ్వులేకపోతే నేను బతకలేను'' అంటూ—కానీ నిజానికి రనక్కావలసింది ప్రమోషన్లు, బాంక్ బాలెన్స్...రనేం మాట్లాడినా పరవాలేదు గాని నేను మాట్లాడితేనే జెలసీ మళ్లీ.''

''అయ్యో, పాపం అమాయకురాలివి'' అంది నీరజ.

''ఏమిటే, ఏం చేశాను, తెలిస్తే చెప్పు'' అంది మనోరమ కోపంగా.

''ఆఁ. సరేలే. వెడితే వెళ్లండి లేకపోతే లేదు. ఏమిటా తగాదాలు'' అంది తల్లి.

సడెన్‌గా మారిపోయి, ''నువ్వు కూడా రావమ్మా, ముగ్గురం వెడదాం'' అంది మనోరమ.

''అదికాదమ్మా, ఈ వేదాంతం పిచ్చి ఏమిటే, నాకర్థం కాదు. ఈ వయసులో వేదాంతం చదువుకోవటమేమిటే—ఉద్యోగం, వేదాంతం, ఇన్వెస్టుమెంట్సు -- ఒకే బుర్రలో యివన్నీ ఎలా యిముడుతాయో !''

''అదే వచ్చిన చిక్కు. వేదాంతి మొగుడికి సినిమా షోకుల పెళ్లాం దొరికింది'' అంది నీరజ.

## డ్రెస్సింగ్ ప్రాబ్లం - 1.

'ట్రెయినింగ్ నుండి తిరిగి వచ్చిన బాలూలో మార్పొచ్చింది.' అనుకుంది మనోరమ. ఆరని నెల రోజుల ఆత్మీత రెండు రోజుల ఆప్యాయతలో ఏరిసోయింది. ఒకనాడు ఉదయం ఆఫీసుకు తయారవుతున్నప్పుడు—

'నువ్వు చాలా అందంగా వున్నావు, మనూ'' అన్నాడు. మనోరమ మాట్లాడలేదు.

'ముఖ్యంగా ఆ చీర, కళ్లకు రాసుకున్న కాటుకా, తలలోని పువ్వులూ, నెయిల్ పాలిష్—''

''ఏమిటీ గొడవ ?'' అంది మనోరమ చిరాకుగా.

''అదే నేనూ అడుగుతున్నాను ఏమిటీ గొడవ అని. ఆఫీసు కెళ్లేటప్పుడు పడగ్గదిలోకి వెళ్లినట్టుగా వెళ్ళటమేమిటని ?''

''అబ్బబ్బ. ఈ రోజు కొత్తగా ఏం చేశాను ? ఇవాళే ఎందుకడుగుతున్నావు ? నీలో ఏదో అనుమానం తెలుస్తున్నది. ఆ పురుగు పోతే తప్ప నీ బుద్ధి మారదు'' అంది మనోరమ.

''నువ్వు ఎప్పుడూ యిలాగే పోతావని తెలుసు. కాని ఈ రోజు అడగాలనిపించింది. సింపుల్‌గా డ్రెస్ చేసుకుని ఎందుకు పోవు ? నీ అందం అందరికీ చూపించుకోవాలని, అందరూ నిన్ను చూసి అడ్మైర్ చెయ్యాలని కాకపోతే ఎందుకీ అలంకారాలు ? రెస్పెక్టబుల్‌గా వుండాలనుకున్నవాళ్లెవ్వరూ ఇలా ఆఫీసుకు రారు.''

''సరేగాని ఇప్పుడు నాకు టైంలేదు. రేపటి నుండి మాసిన చీర కట్టుకొని, జుట్టులేపుకొని దయ్యంలాగా వస్తానులే'' అంది మనోరమ.

''ఓహో పడగ్గది అలంకరణకూ, మాసిన చీరకూ మధ్యన సింపుల్‌గా, సాదాగా అలంకరించుకొనే పద్ధతే లేదన్నమాట.''

''ఏమిటీ గొడవ ? ఆఫీసుకెవరూ పట్టు చీరలు కట్టుకొని రావటం లేదా ? ఎవరూ పూలు పెట్టుకొని రావటం లేదా ?''

''అదే నేనూ అడుగుతున్నాను. అందరూ అలంకరించుకొంటారు. కాని నువ్వు అలంకరించుకుంటే మాత్రం అది చాల ఇన్వైటింగ్‌గా వుంటుంది ఎందుకని ?''

''అసలు రహస్యం డ్రెస్‌లో లేదు. నీ బుద్ధిలో వుంది. నాకు నేనేమీ అందగత్తెనని అనుకోవడం లేదు, స్పెషల్‌గా డ్రెస్ చేసుకొన్నాననీ అనుకోవడం లేదు. నువ్వు పుత్తలనుమానం మనిషిలాగ తయారైనావు. ఏం, నీకేం తక్కువైందని ? టక్ చేసిన షర్టు, మెరిసే బూట్లు, ఏమ్బెలెస్ కళ్లద్దాలు— నవమన్మథుడిలాగున్నావు. ఆఫీసులో ఆడవాళ్లందరూ నీ కోసమే ఆత్మహత్యలు చేసుకుంటారు.''

''మనూ, అలా మాక్ చెయ్యడం మంచిదిగాదు. ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకో'' అన్నాడు బాలూ. నిస్సందేహంగా అతడు గాయపడ్డాడు.

''నువ్వన్న మాటలన్నీ నేనూ అనొచ్చు. ఊరికే అలా నోరుపారేసుకోకు. ఐనా నీ కేది బాగుంది గనక ? నా చీర బాగుండదు. డ్రెస్ బాగుండదు. మాట బాగుండదు, అంతా జెలసీ. ముసల్దానిలా మూలకూర్చుంటే నీకు బాగుంటుంది. కాని నీ కోసం నేనలా వుండను'' అంది మనోరమ.

## డ్రెస్సింగ్ ప్రాబ్లం - 2.

''ఈ చీర ఎలా వుంది ?''

''బావుంది.''

''బావుంది కాదు. వెకిలిగా వుందా ?''

''ఛీఛీ అదేం మాట.''

''ఈ గొలుసు ఎలా వుంది ?''

''ఏమైందోయ్ అలా అడుగుతున్నావు, రోజూ వేసుకునేదేగా.''

''పువ్వులు పెట్టుకోవటం తప్పా ?''

''ఎవరన్నారు ?''

''పువ్వులు పడగ్గదిలో తప్ప యింకెక్కడా పెట్టుకో కూడాదా?''

''నీకు పిచ్చెక్కినట్టుంది. ఉదయం భోం చేశావా?''

''నెయిల్ పాలిష్ వేసుకో గూడదా? కాళ్ళకు గజ్జెలు వేసుకో గూడదా? కళ్లకాటుక పెట్టుకో గూడదా?''

నవ్వు...నవ్వు.

''అదేమికాదు. నేనిలా వుండకూడదు. బొట్టు పెట్టుకుంటే మెరుపుండకూడదు. పౌడరేసుకో కూడదు–వాసనొస్తుంది.''

''ఎందుకోయ్, అలా మాట్లాడుతున్నావు?''

''అవును. నైలెక్సు, షిఫాన్స్ కట్టుకో కూడదు–ఒళ్ళు కనిపిస్తుంది. సిల్కు కట్టుకుంటే మెరుస్తుంది. పౌడరు వాసనొస్తుంది అలా చేస్తే నేను అందర్నీ ఆకర్షించిన దాన్నవుతాను. ముతక ఖద్దరు చీరలు కట్టుకోవాలి. ఛీ ఛీ. నిజంగానే నాకు పిచ్చెక్కుతోంది. నేనెవర్తోనూ మాట్లాడకూడదు. రాయిలాగా కూర్చోవాలి. మాచింగ్ గాజులు వేసుకోగూడదు — అసలు యింటినుంచి బైటికి కదల్తేనే అనుమానమైతే ఎలా వచ్చేదీ! అసలు అతడి వుద్దేశంలో నేను వుద్యోగం మానేసి యింట్లో కూర్చోవాలి. ఇప్పుడు మాటల్లో సాధిస్తున్నాడు బాధపడుతున్నాడు. లోలోపలే ఏడుస్తున్నాడు. ఇంక ఇప్పుడు వావదన్నడని హామీ ఏమిటి?''

ఏమి చేసింది? ఇదంతా ప్రేమ వివాహపు పర్యవసానమా?''

''నా మొహం ప్రేమ వివాహం'' అప్పుడు ఏమి చూసి నన్ను చేసుకున్నాడో, ఇప్పుడు అది చూసే ఈర్ష్య పడుతున్నాడు. అతడింకా ఏ ఏ ఆజ్ఞలు జారీ చెయ్యబోతాడోనని నాకు భయంగానే వుంది. తన అవసరాలకోసం నేను అందంగావుంటే బాగానే వుంటుంది కాని నా సరదాకోసం నేను అందంగా వుండకూడదు. తనక్కావల్సినప్పుడు నేను అందంగా తయారుకావాలి

అక్కర్లేనప్పుడు ముసలమ్మలాగా వుండాలి

మనోరమ ఏడుపు ఆపుకోలేకపోయింది.

''అతడికందం సరదాకాదు వ్యాపారం అసలతని జీవితంలో సరదాయేలేదు–వ్యాపారం తప్ప. ఆఫీసర్ల దగ్గర తన కవసరమైనప్పుడు సోషల్‌గా వుండాలి. కాని యింకెరితోనూ కబుర్లు చెప్పకూడదు. ఇదిక్కడితో పోదులే. ఏదో అవుతుంది అతనలా వూరుకునే మనిషికాదు నన్ను తన ప్రయోజనాలకోసం వాడుకోవటమే అతడి లక్ష్యం.''

## ఆమె నన్ను వాడుకుంటున్నది

ముప్పై రెండేళ్ల బ్రహ్మచర్యంతో తనకు స్త్రీ శరీరం మీద విపరీతమైన వ్యామోహం ఏర్పడింది ముఖ్యంగా ఒంటరి జీవితం–తను పంచుకోలేని వుత్సాహాలు, స్నేహం–తన కోరికలు, ఉద్రేకాలు చల్లార్చే ఒక స్త్రీ కావలసి వచ్చింది ఎన్ని సంబంధాలు వచ్చాయో! కాని ముక్కూ మొహం తెలియని వాళ్ళను ఎలా చేసుకోవటం అనుకున్నాడు. తను రోజూ చూసే కొలీగ్‌ను చేసుకుంటే బాగుంటుందనిపించింది. సన్నగా, బలహీనంగా వుండే మనోరమ–తన నెవరో రక్షించాలి అన్నట్టుగా దీనంగా చూసే ఆ కళ్ళు, ఆ బెరుకుదనం–అదే ఆనాటి ఆ మూర్ఖపు నిర్ణయ ఫలమే ఈనాటి ఈ సంసారం. తనను పొగడించుకోవాలనే కోరిక ఆమెకింతగా వుందని, యింత తలబిరుసు. ఆమె వైఖరి సంసార జీవితానికింత వ్యతిరేకంగా వుందని, పెళ్లి తర్వాత కూడా బాచిలర్ గర్ల్‌గా వుండాలనే దుర్బుద్ధి ఆమెకుందని తనకేం తెలుసు! ఎలా బయటపడటం? ఇప్పుడామె అందం తనకోసంకాదు — కాని ఒకరకంగా తనకోసమే–తనను అవమానించటానికి, నవ్వులపాలు చెయ్యటానికి, ఆఫీసులో అందరి ముందరా తనను చవట వెధవగా నిరూపించటానికి. ఆమె గయ్యాళి ఐతే, కేవలం దుబారాకోరు మాత్రమే ఐతే, తన విపరీతపు కోర్కెలన్నింటినీ కేవలం తన దగ్గిరమాత్రమే ప్రదర్శించేదైతే ఆమె ఏం చేసినా, ఎంత నీలిగినా, విశృంఖలంగా వున్నా ఫరవాలేకపోయేది. కాని యితర్లతో, అందరితోనూ ఆమె తన సరదాలను పంచుకుంటున్నప్పుడు, ఎవరైనా ఆమె నోదార్చగలిగినప్పుడు, కొలీగ్స్ ఆమె అందాన్ని, ఆమె మంచి మానెర్‌జమ్స్‌ను, సోషల్ బిహేవియర్‌ను అప్రిషియేట్ చేసినప్పుడు తన పరువేం? తన పురుషత్వమేది? తన గౌరవం, హోదా ఏది? తెగదెంపులు చేసుకుంటే బాగుంటుంది. కాని అదీ అవమానమే. ఆ లిటిగేషన్ రొంపిలోకి తను దిగలేడు. తను పెట్టిన ఖర్చు, ఖర్చుచేసిన కాలం అంతా వృధా. తనను ఆమె వాడుకుని తనతో తనివి తీరాక...ఛీ ఛీ. ఆ పనే తనూ చెయ్యగలడు. ఆమెకు తనపట్ల వున్న దృక్పథమే తనూ ఆమెపట్ల అలవరచుకోవాలి. తనకు మామూలైన ఆకర్షణ

ఉమెలో యింకా చెక్కుచెదరలేదు. రూపవతి ఐన భార్య శర్వుణేమీ కాదుగాని, తను రూపవతినని పొగిడించుకునేతనం తను జీవితానికి చెదుపు చేస్తోంది. పిల్లాడిమీద శ్రద్ధలేదు. వంటపనిమీద శ్రద్ధ లేదు. సంసారమంటే పిక్‌నిక్‌లా వుండాలానికదు. ఈను బాధించి ఆమె సుఖపడగలదా?

# ఆరాధనా, ఆ తర్వాత

'మనూ'

''ఊఁ''

''ఇదిగో, మాట.''

''ఊఁ''.

''నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?''

నిద్రపోతున్నట్టుగా పడుకున్న మనోరమ కళ్ళు తెరచి మళ్ళీ మూసుకుంది.

''నేను ప్రేమించటం లేదని నీకెందుకనిపిస్తోంది?''

''కొన్నిసార్లు నువ్వు మాట్లాడే పద్ధతిచూస్తే నాకు భయమేస్తుంది నామీద నీ కిష్టంలేదేమోననిపిస్తుంది.''

''పోట్లాడితే, కేకలేసుకుంటే ప్రేమ చచ్చిపోయినట్టా?''

''ఏమో, తెలియదు. నీకు పిల్లలంటే యిష్టంవుందా, లేదా?''

''ఇష్టంలేదని నేను చెప్పానా? కాని పిల్లలున్న యింట్లో ఎవరన్నా పెద్దదిక్కుంటే కాస్త బావుంటుంది. ఒళ్ళు పాడవుతుందని నాకు భయంలేదు. పిల్లల్ని కన్న తర్వాతే సమస్యలన్నీ వచ్చి పడతాయి. మన పేషెన్స్ తినేస్తారు. అందువల్లే మరింత విసుగు, కోపం, అసహనం. ఒకసారి కోపం వచ్చిన తర్వాత ఏం మాట్లాడతామన్నది ముఖ్యంకాదు.''

''కాని ఏమిటో నాకప్పుడే మధ్యవయస్సు వచ్చేస్తోంది. నువ్వు కూడా చిన్న పిల్లవేమీకాదు. ఈ పిల్లలగొడవ ముగించుకోవాలి.''

''ఎలాగ? ఒకడితోనే ఫుల్‌స్టాప్ పెట్టేద్దామా?''

''అమ్మో, అప్పుడేనా, కనీసం మరొక్కరు. వీలైతే మరిద్దరు.''

''మరో రెండేళ్ళదాకా పిల్లల సంగతి మాట్లాడకు.''

''అంటే అప్పటికి నాకు ముప్పై ఏదు నీకు...''

''అబ్బబ్బ. ఏళ్ళు లెక్క పెడుతూ కూర్చోకు వూరికే. చివరికి యిక్కడ కూడా నీ లెక్కలబుద్ధి పోనిచ్చుకోలేదు''.

''సరేలెద్దూ, ఏదో నా అభిప్రాయం అది. పాతికేళ్ళు స్వతంత్రంగా బ్రతికిన నీకు వేరే అభిప్రాయాలున్నాయని నాకు తెలుసు. అప్పుడప్పుడైనా మనం రాజీకి రాకపోతేఎలా. సరే, రేపు ఆదివారం గదా, వీణ్ణి యింట్లో వుంచేసి మనం మళ్ళీ యిద్దరమే అలా రోజంతా షికారు చేసివద్దాం. ఇంట్లో వండొద్దు. ఏమంటావు, తరచుగా యిలాంటి ఔటింగ్స్ లేకపోయినా బోరు కొడుతుంది కదూ!''

అలా వాళ్ళు ఆ ఆదివారమే కాదు, చాలా ఆదివారాలు, సెలవు రోజులు, సాయంత్రాలు, మధ్యాహ్నాలు షికార్లలో, విస్తల విడి వినోదంలో, సరదా కబుర్లలో తిరిగారు. కోపంలో మనుషుల మీద అసహ్యం కలగటం ఎంత సహజమో, సంతోషంలో మనుషులు మంచివాళ్ళుగా కనిపించటమూ అంతే సహజం. పైగా, పోట్లాడుకోని దంపతులెవరు?

ఇద్దరూ కలిసి జాయింటుగా పనిపిల్లమీద విరుచుకు పడేవారు. బాలూ కొడుకు నెత్తుకుంటే మనోరమ వంట చేసేది. మనోరమ ఆఫీసుకు తయారవుతుంటే బాలూ వెనక బ్లౌజు హుక్స్ పెట్టేవాడు. ఉదయం వంటకు తీరికుండదని మధ్యాహ్నం ఏ హోటల్లోనో టిఫిన్‌చేసేవారు. ఐనా వుదయం చేసిన, చల్లారిన టిఫిన్ తినటంకన్నా హోటల్లో వేడివేడి టిఫిన్ తినడం బావుండదూ!

తమకు వుమ్మడిగా నచ్చని విషయాలు మరచి, యిద్దరూ యిష్టపడే పనులు మాత్రమే చేయాలని నిర్ణయం.

''మనమిప్పట్నించీ పోట్లాడుకోగూడదు, డార్లింగ్'' అంది మనోరమ.

వేసవి ప్రవేశిస్తోంది. ఫాన్ నెమ్మదిగా తిరుగుతోంది ఆమె వొంటికున్న పౌడర్‌వాసన మత్తుగా వుంది.

''ఇలాంటిచోట, ఇలాంటి సమయాల్లో తప్ప'' అన్నాడు బాలూ.

''ఎందుకూ నన్ను హింసిస్తావు. కాసేపు నిద్రపోనీ'' అంది మనోరమ. అతని ఛాతీమీద తలపెట్టుకుని.

ఆ నెల చివరన ఆమెకు సూచనగా తెలిసింది తను గర్భవతినని.

గైనకాలజిస్టు ఆ అనుమానం కాస్త రూఢిచేసింది.

''పిల్లాడిందాకా నీకు మళ్ళీ రాణివాసం శాంక్షన్ చేశాను, పో'' అన్నాడు బాలూ. డాక్టరు రాసిచ్చిన టానిక్కులు, పళ్ళు, పాలు — ''క్విక్ డెలివరీన్‌తో నీ ఆరోగ్యం పాడుగాకుండా చూసే బాధ్యత నాది.''

''నాకు భయంగా వున్నది.''

''అదే వద్దన్నది. నువ్వు భయపడితే పుట్టే పిల్లలుకూడా భయస్తులుగా పుడతారు'' అన్నాడు బాలూ.

''నువ్వు మరీ యింత కుటుంబరావులాగ తయారవుతావను కోలేదు'' అంది మనోరమ.

''నోనో, నేచెప్పానుగా, త్వరగా పిల్లల గొడవ ముగించేసు

కోవాలి. ఒక నాలుగైదేళ్ళు మువ్విలా కష్టపడితే తరవాత మనం ప్రేమ పక్షుల్లా తిరగొచ్చు.''

''సరే, నీమాటే నెగ్గనీ'' అంది మనోరమ.

''చూడు. ఇప్పుడు మనవాడికి ఏడు నెలలు. నీకేమో ఇంకా ఆర్నెల్లకుగాని మళ్లీ డెలివరీరాదు. అంటే అప్పుడు మన వాడికి...''

''మహాప్రభో ! నీకూ, నీ లెక్కలకూ ఓ నమస్కారం.. ఇంక ఆపు'' అంది మనోరమ.

''ఓకే ఓకే. ఇప్పుడు గనక ఆడపిల్లపుడితే ఇప్పుడే కట్. లేకపోతే మరో ఛాన్స్. దట్సాల్. నథింగ్‌మోర్.''

''నేనేం మెషీన్ను కాదోయ్. ఈ నెలలన్నీ కే మంగా గడ వాలి. నీళ్లాడాలి. కోలుకోవాలి. అప్పుడుమళ్లీ. నువ్వేమో అన్నీ లెక్కలకిందికి మార్చేస్తావు. పిల్లలంటే అంకెలుకాదు'' అంది మనోరమ.

''సరే. సరే.''

''అదికాదోయ్, నీకు సడెన్‌గా ఈ పిల్లలమీద ప్రేమ ఎక్కడినుంచి పుట్టుకొచ్చిందో నాకర్థం కావడంలేదు. పిల్లల్ని కనడమంటే నువ్వునాకు నెలతప్పించినంత సులభంకాదు.''

''అబ్బా, నువ్విక వుమెన్స్ లబ్బర్‌లా మాట్లాడక. ఐనో'' అన్నాడు బాలూ.

''ఏం, పిల్లల్ని కనడం గురించి నీకేం తెలుసు ?'' అంటూ రెట్టించింది మనోరమ.

బాలూ వెంటనే ఆమెను గట్టిగా కౌగిలించుకొని, ''అదేమిటి మనూ, నీ బాధ నా బాధ కాదూ'' అన్నాడు.

''లేదులే. మీ మగాళ్లకంతా చులకన. ఏమంటే దేశంలో ంతమంది కనటంలేదా అంటూ తీసిపారేస్తారు. పురిటి నొప్పులు అనుభవిస్తే తప్ప ఎలా తెలుస్తుంది ?'' అంది మనోరమ.

''తెలియదు. కాని అందుకు సమానమైన బాధ ఏదన్నా వుంటే శిక్షగా విధించు అనుభవిస్తాను'' అన్నాడు బాలూ.

''ఏమో, నాకు నీ అంత తెలివితేటలెక్కడివీ, యిలా మాట్లాడ్డానికి... అది సరేగాని, ఇదిగో, రెండోవాడు వచ్చిన తర్వాత పెద్దాడి బాధ్యత నువ్వు తీసుకోవాలి. ఇప్పట్లాగా అంటక ముట్టక వుంటానంటే సరిపోదు.''

''అలాగే, అదికూడా చెప్పాలా'' అన్నాడు బాలూ.

''ఇప్పుడే డబ్బులు సరిపోవటంలేదంటున్నావు. చిట్స్, ఇన్సూరెన్సు, సి టి డి లాంటి సేవింగ్సంతా పోతే నీకు సగంకన్నా తక్కువ జీతం వస్తుంది. నా అప్పులూ, ఇదివరకే పాడిన చిట్స్ బకాయిలూ అన్నీ పోతే నాకు నీ జీతంలో సగంకూడా రాదు...''

''ఓహ్, డోంట్ వర్రీ డార్లింగ్, అవన్నీ నేను చూసు కుంటాను. నువ్వు మాత్రం యికమీద కొత్త అప్పులేమీ చెయ్యి'' అన్నాడు బాలూ.

మరో రెండు నెలలకు, మనోరమ పుట్టింటికెళ్లిన మర్నాడు ఆమె తమ్ముడు ఫోన్‌చేసి చెప్పాడు మనోరమకు అబార్షన్ అయిందని.

## ఎత్తుకు పైఎత్తు

చేసింది'' అనుకున్నాడు బాలూ. తనను మోసం చేసింది. ఫూల్‌ని చేసింది రాజీ కుదిరిన తర్వాత మనసు మార్చుకుంది. ఇంతకన్నా రుజువింకేం కావాలి? తనకు పిల్లలక్కర్లేదు. సంసారమే లంపటం. దానిక్కావలసింది ఒంటరి జీవితం. జల్సాబతుకు. ఇంత స్పష్టంగా, నీచంగా ధిక్కరించిన తర్వాత ఇంక తనకేం గౌరవం మిగిలింది ? తను మొగుడా, బానిసా ? అసలు తనకూ ఆమెకూ ఏమిటి సంబంధం ? ఎలాంటి సంబంధం ?

పదిహేను రోజులదాకా ఆమె ఆఫీసుకు రాలేదు. అతడు మారేడ్‌పల్లివైపు పోలేదు. ఈలోగా ఆమె తండ్రి ఓసారి ఫోన్ చేశాడు. తమ్ముడు ఆఫీసుకొచ్చాడు, అక్క నిన్నొక్కసారి రమ్మంటోందంటూ.

బాలూ మర్యాద పాటించి అతడిక్కాఫీ యిచ్చి పంపించేశాడు. కాని తను వెళ్లలేదు.

మనోరమ ఆఫీసుకొచ్చింది కాని అతణ్ణి పలకరించలేదు. మనిషి బలహీనంగా వుంది. జబ్బుగావున్నట్టుగా వుంది. అందం కొంత తగ్గింది. ఓసారుగా నడవలేదు. రెండు మూడుసార్లు కారిడర్స్‌లో ఎదురుపడ్డారు, కాని పలకరించుకోలేదు. ఆమెనేం చెయ్యాలో, ఎలా శిక్షించాలో ఎలా ఆమె పొగరణచాలో ఒతనికర్థం కాలేదు.

ఒకనాడామె అతడికి ఫోన్ చేసింది.

ఇతడు 'నేనే' అనగానే మొదలెట్టింది.

''నీకేమన్నా సిగ్గుందాలేదా ? నువ్వు మనిషివా, పశువ్వా, రాక్షసుడవా ?'' అంది.

''నువ్వు నాతో ఏమీ చెప్పక్కర్లేదు'' అన్నాడు బాలూ.

''నువ్వు చేసిన ఘనకార్యానికి యింకా కోసం కూడానా ? ఏం, ఏమీకాకుండా చూస్తానని హామీ యిచ్చిన మహాశయుడివి యిప్పుడు చావటానికి దగ్గిరైతే చూడటానికికూడా రాలేదేం ? అంది.

''నాకు పిల్లల్నిచ్చి, అబార్షన్లిచ్చి, నన్ను అప్పులపాలు చేసి, నా లీవులు నువ్వుచేసిన ఘనకార్యాలకు ఖర్చుచేసుకుంటే, నాప్రాణం మీదికి తెచ్చుకుంటే నువ్వేమో అక్కడ రాజ్యమేలుతున్నావా రాజ కుమారా ?'' అంది.

ఐనా ఆవిడ నేరుగా తన మీదికే నింద రాసెయ్యటం అతను భరించలేక పోయాడు.

"నువ్వు మాట్లాడినంత పౌరుషంగా, అన్ని బూతులు నేను మాట్లాడలేకపోవచ్చు. నీ సంస్కారం వేరు, నా సంస్కారం వేరు. ఇష్టంలేకపోతే ముందే చెప్పాలి కనటం యిష్టం లేదని. రాజీకి వచ్చిన తర్వాత అలా మోసం చెయ్యకూడదు. అది మర్యాదస్తుల లక్షణం కాదు" అన్నాడు బాలూ.

"ఆహాహా, ఏం తెలివైన కారణం వూహించావు, లవర్. ఇంకా నయం, నా కడుపుక్కారణం కూడా నువ్వు కావని ప్రచారం చేస్తాననుకున్నాను. ఫరవాలేదు ఇంకా అంతదాకా దిగజారలేదా, లేక దారిలో వున్నావా ? మర్యాదగా సాయంత్రం వచ్చి నన్ను తీసుకొచ్చెయ్. లేకపోతే నీకు చాతనైనన్ని ట్రిక్స్ నాకూ చాతవును. ఒకే లవర్" అంటూ ఫోన్ పెట్టేసింది మనోరమ.

## అసంతృప్తి అంటే...

బాలూ ఆమె బెదిరింపులకు భయపడ్డాడో లేక నిజంగా తనే అబార్షన్ చేయించుకుంటే తనను బ్లేమ్ చేసేంత ధైర్యం రాదు గనుక బహుశా అది సహజంగానే జరిగి వుంటుంది అనుకొన్నాడో, లేక ఏది నిజమైనా, పాపం, ఆమె ఆరోగ్యం కొంత పాడైంది; ఎంత చెడ్డా ఆమె నా భార్య అని సానుభూతి పడ్డాడో గాని సాయంత్రం వెళ్ళి మనోరమను తీసుకొచ్చాడు. అతను తప్పకుండా వస్తాడని తెలిసినట్టుగా ఆమె రెడీగా వుంది యింట్లో. ఏమీ పలుకూ, మర్యాదా లేకుండా వెంటనే వచ్చేసింది. రాగానే వంట చేసింది. మౌనంగా భోంచేశారు. ఆమె వెంట ఏవో మందు సీసాలూ, బిళ్లలూ తెచ్చుకుందని గమనించాడు.

"ఇప్పుడారోగ్యం ఎలా వుంది ?" అని అడిగాడు. ఆమె మాట్లాడలేదు. రాత్రి కొంత సేపు లేచి తిరిగి పచ్చింది. అతను ఓదార్చలేదు. ఇప్పుడు కుర్రాణ్ణి అతడికివ్వలేదు. వాడి అవసరాలన్నీ తానే చూసింది. మనుషుల్లో కక్ష, కార్పణ్యాలు ఎంత పేరుకుపోయినా, వాళ్లు కష్టపడేప్పుడు కొంత సానుభూతి కలక్కపోదు. అలా, ఆమె అర్ధరాత్రి పిల్లాడేడిస్తే అప్పుడు నీళ్లు వేడిచేసి, పాలు కలిపి తాగించి పడుకోబెట్టినప్పుడు అతడికలాంటి భావమే కలిగేది. కాని ఆ తరవాత రోజుల్లో ఇళ్లు మళ్లీ ఒకే స్కూటర్ మీద ఆఫీసుకు వెళుతుంటే, 'ఎట్లాగైనా బాలూ చాలా బ్రాడ్ మైండెడ్‌ఫెల్లో' అనీ 'పిల్లాడి మీద మమకారం మరి' అనీ, 'మంచో, చెడో ఏదో అవసరాలు తీరుతున్నాయి, హి ఈజ్ వెరీ ప్రాక్టికల్, లేకపోతే ఎందుకూరుకుంటాడు' అని కొలీగ్స్ అంటే వినీ విననట్టుగా వూరుకున్నాడు.

ఒకనాడు మనోరమ తన సీటుకు నాలుగు టేబుల్లవతల వున్న సాలరీ సెక్షన్‌కు వెళ్ళి అక్కడి గుమస్తాలతో అరగంట సేపటిదాకా ఏమిటేమిటో కబుర్లు చెప్పి, తన ఎంత జీతం వస్తుందో, ఏమేమి 'డిడక్షన్స్' వున్నాయో, ఇంకా ఏయే అడ్వాన్సులు తీసుకోవచ్చో కనుక్కొని వెళ్ళింది గాని తనను పలకరించలేదు. అవునైనా కన్నా చూడలేదు.

ఇంటి నుండి టిఫిన్ తెచ్చుకోవడం మానేశారు. మధ్యాహ్నం మనోరమా, మరో అమ్మాయీ కలిసి ఆఫీసుకెదురుగా వున్న ఒక హోటల్ కెడతారు. పొరపాటునో, అలవాటునో మరి కొంతమంది మగ కొలీగ్స్ కూడా వెళ్ళి వీళ్ల టేబుల్స్ పక్కనే కూర్చుంటారు. రెండు సార్లు ఈ దృశ్యాల్ని చూసిన బాలూ ఆ హోటల్ కెళ్లటం మానుకున్నాడు.

చాలా రోజులు సంసారంలోని చాలా యిబ్బందుల్ని తట్టుకుని, మనస్థైర్యాన్ని, బాలెన్స్ నిలబెట్టుకోగలిగిన బాలూ ఇప్పుడీ టెన్షన్ తట్టుకోలేక పోయాడు. ఏం చెయ్యాలో అసలు పాలుపోలేదు. కొడతాడా ? తన బుద్ధి తక్కువ కాకపోతే, ఆమె దానిమీద మరింత కాపిటలైజ్ చేస్తుంది ఇప్పుడామె మీద తనకు కోపం రావటమే లేదు — తన మీద తనకు కోపం రావటమో, అసహ్యం కలగటమో తప్ప. తీర్చుకోలేని కోపాన్ని, అసహ్యాన్ని హద్దులో పెట్టుకోలేక మస్థిమితం తప్పేట్టుగా కనపడింది. అందుకు మొదటి సూచనగా — అతడు ఆఫీసులో పనిచేయలేక పోయాడు. ఓ పుదయం రాగానే, ఆర్ ఎం చూసి,

"ఏమైంది బాలూ, అలాగున్నావు ?" అంటూ అడిగాడు. టైపింగ్‌లో తప్పులు పోతున్నాయి. ఫైళ్ల నంబర్లు, రెఫరెన్సులు మరచిపోతున్నాడు. అశాంతిని భరించలేక రోజంతా కాఫీ తాగుతున్నాడు. ఇంటి కెళ్లాలంటే అసహ్యంగా, భయంగా కూడా వుంటోంది. కాని వెళ్లకపోతే ఏంకేమంటుందో, ఏం చేస్తుందో నని భయం. రాత్రి నిద్రపట్టడు. ఆమె కూడా నిద్రపోవటంలేదని తనకు తెలుసు. కాని మాట్లాడలేదు. ఇప్పుడు తామిద్దర్నీ కలిపే ఒకే ఒక బంధం — కుర్రాడు. ఇలాంటి వాతావరణంలో పెరిగితే వీడేమవుతాడు ? అనుకున్నాడు.

## సలహాలు - సోషల్ ఇమేజ్

"మిస్టర్ బాలూ, పెళ్లి రెండు రకాల వుంటుంది. ఒకటి: చేసుకుంటే, ఇంట్లో నీ అడుగుజాడల్లో పడివుండి, ఇంటికెళ్లగానే నీకోసం వండిపెట్టి, నీకు సేవలు చేసేదన్నా కావాలి. లేదా నీతో పాటు పనిచేసి, డబ్బులు సంపాదించి, యిద్దరూ లక్జరియస్‌గా గడిపేటట్లైనా వుండాలి. కాని ఇదేం కేసు బాలూ, అదీలేదు, ఇదీలేదు ఇంకా అనుమానమా, ఆమెకు ఖర్చులకు తన జీతం సరిపోదు. అందుకోసం నీ జీతం కావాలి. ఆ తర్వాత, పెళ్లి అవగానే ఎలాంటి వాళ్లకైనా ఓ రెస్పెక్టబిలిటీ వస్తుంది. ఆమె ఇప్పుడు చేసిన పనులే పెళ్లికాక ముందర చేసివుంటే జన్మలో పెళ్లయ్యేది కాదు. నువ్వు బాగా దొరికావు గూరూ, సీనియర్ ఎంప్లాయీవి. అది కూడా పి.ఎ.వి. ఒంటరిగాడివి. ఆఫీసులో కీ పోస్ట్‌లో వున్నవాడివి. పొదుపరివి. తల్లీ, దండ్రి, అక్క చెల్లెళ్ళెవ్వరూ, ఏ చెడదా లేనివాడివి. ఇంకేం, భలే పట్టేసింది. అన్నీ ఆమెకు కలిసొచ్చేవే. అరచేతిలో వైకుంఠం చూపించిందా? ఇప్పుడు అట్టడుక్కు నెట్టేసిందా ? చివరికి, పిల్లాడికోసమైనా నువ్వామెను వదిలిపెట్టలేవు. అదేనయ్యా బాబూ, సంసార బంధం. ఎవరు

చాలా జాగ్రత్తలు తెలుసు. నువ్వెక్కడా ఏ పొరబాటులోనూ ఆమెను పట్టుకోలేవు. కోర్టులో నీ కేసు వీగిపోతుంది – తెలిసిన వాళ్లకు తప్ప ఎవరితో చెప్పినా వాళ్లు నిన్నే తిట్టిపోస్తారు.

బాలూ ట్రాన్స్‌ఫర్ కోసం ఒక లెటరు టైపు చేసి తీసి కెళ్లి ఆర్. ఎం. టేబుల్ మీద పెట్టాడు.

"ఇండియాలో ఎక్కడికైనా సరేనన్ను ట్రాన్స్‌ఫర్ చెయ్యండి. ఐ షల్ బీ ఎవర్ గ్రేట్‌ఫుల్ టు యూ ఫర్ దిస్" అన్నాడు.

ఆర్ ఎం కాసేపు ఆలోచించి,

"నేను విన్న రూమర్లు నిజమే ఐతే నీ ఫామిలీ లైఫ్ కొంచెం ట్రాక్ తప్పే వుండాలి. కాని దాన్ని సరిచేసే పద్ధతి యిది కాదనుకుంటాను. బిలీవ్ మి. నువ్వెక్కడికీ పారిపోలేవు. స్నేహితుడిగా నువ్వు నా సలహా పాటించదలుస్తే, ఈ ఉత్తరం వాపసు తీసుకో. నీకు ఎప్పుడు ఎలాంటి ఎమర్జన్సీ అవసరమొచ్చినా నువ్వు నా దగ్గరకు రా. నేను నీకు సహాయం చేస్తాను. కాని ఈ విషయంలో మాత్రం లెటస్ వెయిట్ అండ్ సీ" అన్నాడు ఆర్ ఎం.

తలొంచుకొని నిలుచున్న బాలూ,

"మీ యిష్టమండీ" అన్నాడు.

"నోనో అలా అనకు. అఫీషియల్‌గా నేను నీ దారిలో అడ్డు పడను. నీ యిష్టం వచ్చిన చోటికి నువ్వు వెళ్లొచ్చు. నీ రిక్వెస్ట్ ఫర్వార్డ్ చెయ్యటానికి నాకేమీ అభ్యంతరం లేదు. నాది కేవలం సలహా మాత్రమే" అన్నాడు ఆర్ ఎం

"అదికాదండీ, నా యిబ్బందులకు యితర్లను బ్లేమ్ చేసే మనస్తత్వం కాదు నాది. బహుశా పొరపాట్లన్నీ నావేనేమో !" అన్నాడు బాలూ.

ఇంకా వుంది

# ప్రాకృత వాఙ్మయంలో రామకథ

(17 వ పేజీ తరువాయి)

## మహా సుతసోమ జాతకం-

ఇది 537 వ జాతకం. దీనిలో మహాసత్తుడు (బోధి సత్త్వుడు) ఒక పోరినాదుణ్ణి (పురుషాదుని) నిందించే గాథ వుంది. ఇది రామాయణం కిష్కింధా కాండలోని ఒక శ్లోకాన్ని పోలి వుంది. రామాయణంలో ఈ శ్లోకం వాలివధ ఘట్టంలో వుంది. వాలి రామునితో "రామా నీవు నన్ను చంపడం అన్యాయం నేను తినదగిన వాడినికాను. క్షత్రియులు ఐదు పంచనఖ జంతువులనే తినవచ్చు" అంటాడు.

పంచ పంచ నఖాభక్ష్య బ్రహ్మ క్షత్రేణం రాఘవ

(రామా 4–17–39, మనుస్మృతి 5–17)

మహాసుత సోమ జాతకంలోని ఈ కింది గాథ రామాయణ శ్లోకానికి అనుకరణలాగ కనిపిస్తుంది.

పంచ పంచనఖా భక్కా ఖత్తియేన పజానతా
అభక్ఖం రాజా భక్కేసి తస్మా అధమ్మికో తువ.

(గాథ 58)

ఆదిచ్చు పట్టాణ జాతకం (175) లో ఒక వానరుని ప్రస్తావన వుంది. కానీ దీని రూపాంతరం మహా భారత రామాయణంలో లభించదు. ఈ గాథ రామ కథకు సంబంధించింది అవునో కాదో చెప్పలేము.

వజ్జేసు కిర భూతేసు సంతి సీల సమాపాతా,
పస్స సాఖామిగం జమ్మం ఆదిచ్చం ఉపతిట్ఠతి.

మహా భాష్యంలో ఈ గాథకు సంస్కృత రూపాంతరం ఉపామంత్రకరణే (1–3–25) సూత్ర చర్యలో కనిపిస్తుంది. ఉప అనే ఉపసర్గ చేరిన స్థాధాతును ఉభయ పదులలోను వుప్పదన డానికీ ఉదాహరణం ఈ గాథ రూపాంతరంగా కనిపిస్తుంది.

బహునా మవ్వ చిత్తానా మేకో భవతి చిత్తవాన్
పశ్య వానర సైన్యేస్మిన్ యదర్కముపతిష్ఠతే.
మైవం మంస్థాః సదిత్తో యమేషో పిహి యథావయం,
ఏ తదప్యస్య కాపేయం యదర్కముపతిష్ఠతి.

జాతక కథలలోని సామగ్రితో వాల్మీకి తన రామాయణ మహా కావ్యం రచించి వుండవచ్చునని శ్రీ దినేశ్ చంద్రసేన్ మున్నగు విద్వాంసులు అనుమానిస్తున్నారు. గాని, దానిలోని అత్యల్ప సామగ్రి ఆధారంగా జాతక కథలలో రామాయణానికి మొదళ్లు వెదకడం వ్యర్థమని నా అభిప్రాయం.

త్రి పిటకాలు క్రీస్తు పూర్వం నాలుగవ శతాబ్దంలో సంగ్రథితలు. వానిలో రామాయణ గాథకు సంబంధించిన సామగ్రి చాల తక్కువ కనిపిస్తున్నది. అంతేకాక, త్రిపిటకాలలోని 547 గాథలలో యక్ష, దానవ, నాగ, రక్కస, వానర – ఆది అసంఖ్యాక పశు పక్షులకు సంబంధించిన కథలు ఉన్నాయికాని, రావణుని, హనుమంతుని, ఇదితర కపుల ప్రస్తావన రాలేదు గనుక వాల్మీకి రామాయణం అప్పటికి ప్రచారం పొందినట్టు లేదని బహుశా వాల్మీకీయం రచితం కాలేదేమోనని కొందరి అభిప్రాయం

కాని, రామాయణం బౌద్ధుల పిటక కాలానికే ప్రచారంలో వుందని, బౌద్ధుల రామాయణ భారతాలు విని వాటి ప్రభావానికి లోనవుతారని భయపడిన బౌద్ధాచార్యులు అలాటి ఆఖ్యానకాలను వినడం నిషేధించారని, అందువల్ల అగతికంగా తప్ప రామాయణ భారతాల ప్రసక్తి జాతక కథలలో రాలేదని, అది వచ్చినా వికృత రూపంలో వర్ణితమయిందని చెప్పడానికి ఆధారాలున్నాయి.

బుద్ధ ఘోషుడు – భారత యుద్ధ సీతాహరణాదులు నిరర్ధక కథలని, వాటిని వినగూడదని దీర్ఘనికాయం వ్యాఖ్యలో హెచ్చరించాడు : అక్ఖానంతి భారత రామాయణాది కథా. తం యస్మిం ఠానే కథ యతితత్థ గంతుం న వట్టతి. (దీ. ని. అ. 1–84)

"భారతయుద్ధ సీతాహరణాది నిరత్థకకథా." (దీ.ని.అ. 1–86)

(ఇంకా వుంది)

# పేద వర్గాలకు పెద్ద సహాయం

బలహీన వర్గాలకు చెందిన ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరచడానికి అనేక పథకాలు అమలు జరపబడుతున్నాయి. ఫలితంగా పేద వర్గాలవారు అన్ని రంగాలలోను ముందంజ వేస్తున్నారు.

షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, వెనుకబడ్డ వర్గాల వారికి ఆర్థిక సహాయ పథకాలు ప్రారంభించే నిమిత్తం ఆర్థిక సహాయ సంస్థలను నెలకొల్పిన కొద్ది రాష్ట్రాలలో ఆంధ్ర ప్రదేశ్ ఒకటి.

గత మూడేళ్లుగా పనిచేస్తున్న షెడ్యూల్డు కులాల సహకార ఆర్థిక సహాయ సంస్థ, వెనుకబడ్డ తరగతుల సహకార ఆర్థిక సహాయ సంస్థ, షెడ్యూల్డు తెగల సహకార ఆర్థిక సహాయ సంస్థ బలహీన వర్గాల వారికి ఎన్నో విధాల తోడ్పడుతున్నాయి. **1978-79** వార్షిక ప్రణాళికలో బలహీన వర్గాల సంక్షేమానికి **8.32** కోట్ల రూపాయలు కేటాయించారు.

*డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*
6/78-79



# ఆకలి

అన్నానికై
ఒక ఆకలి
ఆనందానికై
మరో ఆకలి
అర్థానికై
ఒక ఆకలి
ఆత్మకూ
మరో ఆకలి
కామానికై
ఒక ఆకలి
కాంతా కాంచన పరిత్యాగమూ
ఒక ఆకలే!

పదార్థానికై
ఒకడి ఆకలి
పదార్థానికై
మరొకడి ఆకలి
పరమార్థానికై
ఇంకొకడి ఆకలి
ఆకలి ఒక నిత్యం
అందులో
అంతస్థులు మాత్రం సత్యం
ఆకలి లేదనడం

మిథ్యావాదం
ఆకలిని పరిష్కరించేందుకు
పొట్టనే కోయడం
క్షణిక వాదం
క్రింద ఆ కళ్ళ
మాత్రమే
సత్యమనడం
భౌతికవాదం
ఆకలిని నియమితంచేస్తూ
ఆనందానికి
ఎదగడం
అరవిందం!!

# కోయిల పాత పాట పాడదు

పాడమని నన్నడగకు నేస్తం
పాతపాట
పాడి పాడి అలసి పోయాను నేను
ఇదే నోట
వసంతం కుసుమించినప్పుడూ
హసంతులు వికసించి నప్పుడూ
మందానిలం రెక్కలు విప్పినప్పుడూ
చంద్రకాంతులు చెయ్యెత్తి పిలిచినప్పుడూ
మైకంతో పరవశించి
పంచమ స్వరంతో
మళ్ళీ మళ్ళీ పాడాను నేను
ఒకే పాట
మాతృత్వం మరచి
కేవల కచ కుచాల మోహంతో
మదంతో ముదంతో
కామగీతం పాడాను ఇదే నోట
గ్రీష్మం గొంతెత్తగానే
ఊష్మం తల కెక్కగానే
నిప్పులు చెరిగే ఇసుకలో
తలదూర్చిన ఉష్ట్రపక్షిలా
నిజాన్ని చూడలేక
చీకటిలో మగ్గిన గబ్బిలంలా
ఇంత తియ్యటి నా గొంతూ
ఎంత వికృతంగా మారింది!
ఇలా లే జిగురాకులు తిన్న కంఠం
ఇరమ్మదాలను పుక్కిలించింది!!

ఆషాఢం రంకె వేయగానే
ఆకాశం నెమలి పురిలా
ముడుచుకోగానే
జల్లను మేఘం కార్చిన నెత్తురుగ
వడగళ్ళు వానదేవుని శ్లేష్మంలా
వింత వింత కలలు కని
విచిత్ర ప్రయోగాలు చేశాను
సరళీ స్వరాలు పలికే నా
గొంతునిండా
చీము పాటలూ
చేదు మాటలూ

కాలం మారింది
గవేషణ ముగిసింది
నవరాత్రాలు మొదలైనాయి
ధవిత్రాలు
హసన రాగాలు విసురుతున్నాయి
శరత్తు ఆయుధపూజను చేస్తున్నది
జగత్తు కొత్త గొంతుకై నిరీక్షిస్తున్నది
శర్వాణిముందు నా
చారువాణి పలకాలి నేడిక
శక్తి వర్ణాలతో
స్నేహ పల్లవితో
జ్యోతిర్మయ గీతం
విన్పించాలి నేనిక!!

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

nikhileśvar

నిఖిలేశ్వర్

# నల్లవాని చైతన్యం: ఆఫ్రికాలో పెల్లుబికిన ప్రజాసాహిత్యం

ఒకనాటి చీకటి ఖండం నల్లని సంకెళ్ళను తెంచుకుని తన మనుగడ కోసం పోరాటాన్ని ఏనాడో ప్రారంభించింది. ఆ పోరాటాల్లో జాతీయతను సుస్థిరం చేసుకునే లక్షణం నుంచి ప్రజారాజ్యాల కోసం తపనపడే విముక్తిపోరాటాలే దానికి సంకేతం. అయినా ఈనాటికీ ఆఫ్రికా ఖండంలోని కొన్ని దేశాల్లో జాతీయంగా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్న తర్వాత—వలసాధిపతులైన తెల్ల దొరల స్థానంలో జాతీయాధిపతిగా ఒకవైపు విచిత్రమైన నియంతగా ఈదీ అమీన్ ఉగాండాను పెద్దపులిగా పాలిస్తున్నాడు. మరోవైపు మధ్య ఆఫ్రికాలో ఒకనాటి సైనికాధికారులు యూరోపియన్ వలసాధిపతుల దగ్గర కొలువులు ముగించుకొని ఈనాడు రాజులై తమ ప్రజలను,దేశాలను సొంత ఆస్తులుగా పాలిస్తున్నారు, అనుభవిస్తున్నారు. ఇంకో వైపు దక్షిణ ఆఫ్రికాలో చివరితెల్లవాని అధికార మదాంధతకు గోరీకట్టే ప్రయత్నాలు జరుగుతున్నాయి. దక్షిణ ఆఫ్రికన్ జైళ్లల్లో యువస్వాతంత్ర్యయోధుల హత్యలు, జింబాబ్వేలో గెరిల్లా పోరాటాలు దక్షిణ ప్రాంతాన్ని ఒక అగ్ని పర్వతంగా రూపొందించాయి.

విముక్తి పోరాటాల్లో అనేకదశల్లో వున్న మూడో ప్రపంచపు దేశాల్లో ఆఫ్రికా ఖండం నల్లని వజ్రం లాంటిది. అది దోపిడి సామ్రాజ్యాలను నిలువునా చీల్చగలదు ఆ ఖండ స్వరూపం రాక్షసి బొగ్గులా కనబడినా ఆరని విముక్తి పోరాటాల నిప్పురగల్చగలదు, ఎర్రని రక్తాన్ని ఉరక లెత్తించి భూమికి విముక్తి ప్రసాదించగలదు. అందుకే 'అమాదు ముస్తాఫా వేద్'అనే ఆఫ్రికన్ కవి ఆత్మవిశ్వాసంతో ఎలుగెత్తుతున్నాడు.

> "నీగ్రోసుందరంపై గురిచూసి
> అదిగో వస్తున్నారు నాగరికతను నేర్పించాలని
> సిరంగులతో—బైబిల్ గ్రంథాలతో ;
> దేశం యావత్తు రక్తపాతంతో నిండింది,
> ఇక్కడి బిడ్డలు
> ఉదయాన్ని రక్షించాలని
> ఉవ్వెత్తున లేచినిలుచున్నారు."

శతాబ్దాల పొడువునా అజ్ఞానానికి, అటవీతనానికి బలై, తెల్లవాని వలసపాలనకు ఎరయై నికృష్టఖండంగా మిగిలిపోయిన ఆఫ్రికాఖండం ఒక నల్లని విరాట్ స్వరూపం. ఆ శక్తిమంతమైన ఆకారాన్ని ఇంకా బంధించి పెట్టాలని తెల్లవాని వలసాధిపత్యం ఇంకా కుట్రలు పన్నుతూనేవుంది. నల్లవాడి బలమైన కాలికి సంకెళ్లువేసి, రెండో కాలికింద నిలబడ్డ తెల్లదొర రేపోమాపో ఆ కాలికిందే నామ రూపాలు లేకుండా నమసిపోతాడు

ఆఫ్రికాతో తెలుగువాడికి సన్నిహిత సంబంధం వుంది. గాంధీ అక్కడ నడిపిన సత్యాగ్రహాల తర్వాత ఇప్పుడు చెలరేగిన విరుగుబాటు ఉద్యమాల్లో తెలుగువాళ్లుకూడా పాల్గొంటున్నారు. 1920లో విట్‌వాట్స్‌టాండ్‌లో 70వేల మంది గని కార్మికులు చారిత్రకమైన సమ్మెను నిర్వహించారు. ఆ తర్వాత 1922లో మరికొన్ని ఉధృతమైన సమ్మెలు జరిగాయి. కాని అందులోంచి ప్రజాసాహిత్యం ఏదీ వచ్చినట్టు కనపడదు. అయితే కొందరు యూరోపియన్ రచయితలు ముఖ్యంగా ఫ్రెంచి, పోర్చుగీస్ ఇంగ్లీషు రచయితలు ఆఫ్రికన్ నల్లప్రజల ఇతివృత్తాలతో నవలలు వ్రాసారు. అమెరికన్ నవలా రచయిత హెర్నెస్ట్ హెమింగ్వే ఆఫ్రికన్ అడవులు, జంతువులు, కొండలనుచూసి మురిసిపోయి, తన అనుభూతులను వ్యక్తంచేసాడు తప్ప, అక్కడి ప్రజలను పట్టించుకోలేదు.

భౌగోళికంగా జాంబేజినదికి ఉత్తరాన వున్న వలసదేశాలన్నీ విముక్తిపొందాయి. దక్షిణానవున్న నామిబియా, ద ఆఫ్రికా, రొడీషియాల్లో విముక్తిపోరాటాలు రగులుతున్నాయి. అంగోలా, మొజాంబిక్ గినీబిసావులు సాయుధపోరాటాలు జరిపి విముక్తి పొందాయి.

సహారాఎడారికి ఉత్తరానవున్న దేశాలు ఈజిప్టు, లిబియా, అల్జీరియా. ఈ దేశాల్లో అరేబియన్ సంస్కృతి నెలకొనివుంది. ఎడారికి కిందవున్న దేశాల్లో ఆఫ్రికన్ ఆదిమ సంస్కృతుల నల్లవాడి జీవితంతో పెనవేసుకొని వుంది. నీగ్రోజాతిలోని అనేక తెగలతోబాటు అనేకరంగుల జాతులు ఈ దేశాల్లో జీవిస్తున్నాయి. సెనేగల్, అంగోలా, నైజీరియా, ఘానా, కీన్యా, కాంగో, ద. ఆఫ్రికా తదితర దేశాల్లోని నీగ్రోప్రజలు మొదట్లోఆదిమశక్తులనుపూజిస్తూ, తెగలుగా పల్లెలను పాలించుకుంటూ ప్రపంచనాగరికతకు దూరంగా వున్నారు. వలస రాజ్యాలస్థాపనతోబాటు క్రైస్తవ, ఇస్లాం మతాలు ప్రవేశించాయి. ముఖ్యంగా బానిసల, వ్యాపారంక్రైస్తవ మతప్రాబల్యం,

వలసలస్థాపన ఆఫ్రికన్ చరిత్రలో ప్రముఖఘట్టాలు. అప్పుడే క్రమంగా ఈ సర్లనిఖండం మలుపుతిరిగింది.

వ్యక్తి, కుటుంబం, సమూహం ఇవ్వన్నీ కలిసి తెగలుగా ఏడి పోయి— 'తెగల జీవిత విధానాన్ని' అలవాటు చేసుకొన్నారు ఇక్కడి ప్రజలు. ఫలితంగా ఆయా తెగల నాయకులే పాలకులుగా వుండే వాళ్ళు. ఆదిమసంస్కృతిలోనిఅజ్ఞానంతోబాటు మంత్ర–తంత్రాలు వాళ్ళను ఆకట్టుకున్నాయి. ప్రతితెగకు ఒకచిహ్నం 'టో టె మ్' పేరుతో శిల్పకళలో అభివ్యక్తి పొందింది. అవే విభిన్నరూపాల్లో నిలిచిపోయాయి. ఈ 'టోటెమ్'ను ప్రతీకగా తీసుకుని సెనెగల్ కవి లియోపాల్డ్ సింఘోర్ తన జాతి మౌలికతను సంరక్షింపు కోవాలని తపన పడతాడు.

''నా లోపలి స్నాయువుల్లో
ఆ టోటెమ్‌ను దాచుకోవాలి
ఉరుములు – మెరుపులతో
నా పూర్వీకుల ఉద్రిక్తచర్మం
మిరమిట్లు గొలుపుతోంది
నా పశువులను రక్షించేవాణ్ణి
నేను దాచుకోవాలి
నా నగ్నమైన గర్వాన్ని
నా నుంచి కాపాడుకుంటూ
అదృష్టాన్ని పండించుకున్న
జాతుల ఈసడింపులనుంచి
రక్షించుకోవాలి''.

యూరోప్‌నుంచి ఫ్రెంచి, పోర్చుగీస్, ఇంగ్లీషు ప్ర జ ల రకతో 15వ శతాబ్దంలో ఆఫ్రికన్‌ప్రజలు రోమన్ లిపిని నేర్చు కున్నారు. ఆనాటినుంచి అక్షరరూపంలో ఆఫ్రికన్ సాహిత్యం వెలుగు చూడటం ప్రారంభించింది. అంతకుపూర్వం అనామకు లైన అనేకమంది జానపద గాయకులు తెగజీవితాన్ని, మానవ సంబంధాలను, ప్రకృతి వైపరీత్యాలను గానం చేస్తుండేవాళ్ళు.

క్రమంగా ఆఫ్రికన్ సాహిత్యం క్రైస్తవమత ప్రాబల్యం నుంచి, వలసపాలకుల సంస్కృతి కౌగిలిలోంచి విడిపడింది. విస్తృత మైన అరణ్యాలను, ప్రకృతి శోభనుదాటి ప్రజల జీవితాలను వ్యక్తం చేయడం మొదలు పెట్టింది. అప్పుడే సెనెగల్ అధ్యక్షుడు లియోపాల్డ్ సెంఘోర్ 'నెగ్రిట్యూడ్' (Negritude) అని నీగ్రో వాదాన్ని రూపొందించాడు. యూరోపియన్ సాహితీ–సంస్కృతుల ప్రాబల్యంలోపల–మేల్కొని,నీగ్రో జాతి మనుగడ ఆ ఆఫ్రికన్ దేశాల ప్రజల జీవితాల్లో,సమస్యల్లో వుందని గమనించారు. చారిత్రకంగా, సాంస్కృతికంగా, సాంఘికంగా ఆఫ్రికన్ సమూహజీవితాన్ని ప్రతి బింబించేది ''నెగ్రిట్యూడ్''. ఈ జాతీయచైతన్యంలోంచి ప్రజా సాహిత్యం పెల్లుబికింది. అందులోంచి విప్లవవాంఛ చెలరేగింది. క్రమేణ విప్లవ పోరాటాలు మార్క్సిస్టు అవగాహనతో నీగ్రోల జాతివిముక్తి పోరాటాలుగా పరిణమించాయి. 1959 లోనే రోమ్‌లో జరిగిన రెండో 'Black writers and artists' మహా సభలో సెకోటోరే ఈ అవగాహనను ఇలా వెల్లడించాడు – ''ఏదో విప్లవగీతం రచిస్తే సరిపోదు. ప్రజలతో బాటుగా విప్లవాన్ని తీర్చిదిద్దాలి. ప్రజలలో విప్లవాన్ని తీర్చిదిద్దినపుడే – ఆ గీతాలు వాటంతట అవే తమవిగా వెలువడుతాయి.''

తెల్లవాడి దౌర్జన్యానికి, అహంభావానికి వ్యతిరేకంగా వచ్చిన నీగ్రోవాదం ప్రజల భావాలలో, ఆవేశాలతో నిండివుంది. యూరోపియన్ సంస్కృతిని ఎదిరించే నిర్ద్వంద్వమైన ఆఫ్రికన్ సంస్కృతి విజయవంతంగా తన ఉనికిని నిరూపించు కుంది. అణచి పెట్టేతత్వాన్ని తలదన్ని ప్రకృతిలోంచి, యువ ఆఫ్రికన్ కోరికల్లోంచి, రాగలయల్లోంచి నీగ్రోవాదం ముందంజ వేసింది. ఆడంబరాలు, అనుమానాలు వుండే యూరోపియన్ సంస్కృతికి విలోమగమాటమైన, సజీవమైన స్వేచ్ఛతో కూడిన నీగ్రోసంస్కృతి, ఆఫ్రికన్ జీవితంలోని ఆదిమప్రతీకలతో వ్యక్త మైందని అల్జీరియన్ మనోశాస్త్రవేత్త నీగ్రో పోరాటాలకు వివేచనను, తత్వాన్ని సమకూర్చిన రచయిత ఫ్రాంజ్ ఫెనన్ తన ''The wretched of the Earth'' అనే గ్రంథంలో నిస్సంశ యంగా ప్రకటిస్తాడు.

అయితే ఈ నీగ్రోవాదాన్ని నైజీరియన్‌కవి వోల్ సోయింకా అంగీకరించడం లేదు. ఎలాంటి ముద్రలు లేకుండా స్వచ్ఛందంగా వ్రాయాలని ఆయన వాదన. దీనిని అధిక సంఖ్యాకులైన నీగ్రో రచయితలు, మేధావులు వ్యతిరేకించారు.

'నెగ్రిట్యూడ్' వాదాన్ని ముందుకు తీసుకెళ్ళిన ప్రముఖ ఆఫ్రికన్‌కవి సెంఘోర్. ఈయన సెనెగల్ పాలకుడిగా అటు రాజ కీయాల్లో, ఇటు సాహితీ – సాంస్కృతిక రంగాల్లో ప్రధాన పాత్ర వహించాడు. ప్యారిస్‌లో చదువుకున్న సెంఘోర్‌కు ఫ్రెంచి భాషలో వున్న ప్రవేశం, మక్కువ సొంతభాషపై లేదని ఒక ఆ రో ప ణ. ఆయన ఫ్రెంచిలోనే రచనలు చేయడం మూలానా యూరోప్‌లోని దేశాల్లో విస్తృతప్రచారం పొందాడు. గొప్పశిల్పాన్ని, అంతర్ మధనాన్ని, తనజాతి మౌలికవాంఛలను ఎంతో మనోజ్ఞంగా వ్యక్తంచేసాడు సెంఘోర్. ఏన్నో రాజకీయాలతో కూడుకున్న నోబెల్ సాహితి బహుమానాన్ని గత సంవత్సరం సెంఘోర్‌కు ఇవ్వా లనుకోడం అందులో ప్రధానంగా ఆయన కవితాశక్తిని గుర్తించి నందువల్లనే జరిగింది. (అయితే 1977 నోబెల్ బ హు మ తి ని స్పానిష్ కవికి ఇస్తున్నట్టు ప్రకటించారు.)

సెంఘోర్ ఆఫ్రికన్ రచయితలకున్న ఒక ఇబ్బందిని లేడ దానినే ఆయన సౌలభ్యమని అంటూ ఇలా అంటారు: ''ఆఫ్రికన్ భాషల్లో కవితాలయ వున్నప్పటికి ఫ్రెంచిభాషలోనే వ్రాయడం ఆఫ్రికన్ రచయితలకు స్వేచ్ఛతో కూడుకున్నపని.'' అ యి తే సెంఘోర్ ఫ్రెంచి – భాషాప్రభావం అస్తిత్వవాద పోకడలవల్ల నీగ్రోవాదం నుంచి క్రమంగా దూరమై ఫ్రెంచి మేధావిగా పేరు తెచ్చుకున్నాడనే విమర్శ ఒకటి వుంది.

సెంఘోర్ కవిత "The dead" చదివినప్పుడు ఆయన కళాశక్తి అవగతమవుతుంది.

"స్వాధీనమైన రోడ్లపక్క
ప్రమాదాల రోడ్లవెంట
వాళ్లంతా మృతులుగా చెల్లాచెదరుగా
మంచి దేవుళ్లలాగా బంగారు ముసుగులు వేసుకొని
అందమైన విగ్రహాల్లా పడివున్నారు.
ఫ్రాన్స్ మట్టిపై నల్లగా వొరిగిపోయిన
సెనేగల్ ఖైదీలు,
నీ నవ్వును
నీ మాంసంలోని నల్లని పుష్పాలను
తుంచివేయాలనే విష్పవయత్నం
నవ్వు వర్ణం లేని పువ్వులమధ్య
ప్రథమ సౌందర్యంలోని పుష్పానివి
గంభీరపు నవ్వుతో వున్న నల్లనిపువ్వు
తరతరాలయుగాల వజ్రానివి
హరిత వసంతంలోని విశ్వశక్తివి
ఆదిమ దంపతుల దేహానివి
అగ్ని — మెరుపులపై దాడిచేసిన విజేతవి
యంత్రాలని, ఫిరంగులను

మహత్తరమైన నీ రక్తగానం వోడిస్తుంది."

ప్రజలెక్కాని ఆయుధాలను ఎత్తడంతప్ప మరోమార్గం లేదని, తిరుగుబాటు కవిత్వం సమర సాహిత్యంగా, విప్లవసాహిత్యం జాతీయ సాహిత్యం మారాలని ఫ్రాంక్ ఫెనన్ చెబుతూ ఆఫ్రికన్ జాతీయరచయితల వికాసం మూడుస్థాయిలలో వుంటుందని వివరిస్తాడు.

మొదటిస్థాయి — అధికారాన్ని హస్తగతం చేసుకున్న పాలకుల (వలస) సంస్కృతిని అవగతం చేసుకోడం. రెండోస్థాయి — తానేమిటో గుర్తుంచుకుని ప్రజల బాహ్య జీవిత గమనాన్ని వర్ణించి తృప్తిపడిపోతాడు. అరువు తెచ్చుకున్న విమర్శతో తన జాతీయ జీవితాన్ని వివేచిస్తాడు.

ఇదంతా సమరానికి ముందువుండే స్థాయి.

మూడోస్థాయి—ఇది పోరాటస్థాయి. రచయిత ప్రజలనుకదిలిస్తూ, తాను ప్రజలను జాగృతం చేసే సాధనంగా మారుతూ, క్రమంగా పోరాటసాహిత్యం నుంచి విప్లవసాహిత్యంలోకి అడుగుపెడతాడు.

ఇదే సందర్భంలో ఆఫ్రికన్ సంస్కృతికి వ్యాఖ్యానాన్ని సమకూర్చిన అమిల్కార్ కబరాల్‌ను కూడా జ్ఞాపకం చేసుకోవాలి. 'గినీ బిసావు' విముక్తి పోరాటాల్లో ప్రముఖ పాత్రవహించినమేధావి, రాజకీయ నాయకుడు కబ్రాల్‌ను పోర్చుగీస్ వలస పాలకులు 1973లో హత్య చేసారు. విముక్తిపోరాటాల్లోవున్న కార్యకర్తలు, మేధావులు తమ దేశ సాంఘిక— ఆర్థిక— రాజకీయ పరిస్థితులను అవగాహన చేసుకొని ఆ జాతి సంస్కృతి మౌలిక స్వరూపాన్ని, దాని లోతుపాతులను అర్థం చేసుకున్నప్పుడే విముక్తి పోరాటాలకు సంస్కృతి మూలాధారమవుతుందని కబ్రాల్ అభిప్రాయం.

తమ జాతిజీవన సంస్కృతిని ఆకలింపు చేసుకొని, తమ కాళ్ళకింది భూమిని, వేళ్లను నిరంతరం తడుముతూ వివిధ ప్రక్రియల్లో అనేకమంది ఆఫ్రికన్ రచయితలు రచనలు చేస్తున్నారు.

## ఆఫ్రికన్ కవులు :

"నెగ్రిట్యూడ్" భావాన్ని వ్యాపింప చేసిన సెంఘోర్‌తర్వాత మరో దేశాధిపతి కూడా జా పోరాటాల్లోంచి కవిగా, నాయకుడిగా ముందుకు వచ్చాడు ఆయన అంగోలా అధ్యక్షుడు అగస్తినోనేటో. పోర్చుగీస్ వలస పాలనలో యాతనలు అనుభవించిన అంగోలా ప్రజల దీనస్థితిని నేటో ఇలా వర్ణిస్తాడు:

## అంజగీతి :

| | |
|---|---|
| చింకిరేకుల గూళ్లు | అర్థాంతరమ్ముగా |
| చీకటికి పుట్టిల్లు | వార్ధక్యమొచ్చేసి |
| చెత్తా చెదారాల | వూతకర్రను తెచ్చి |
| చెలువారు మాయిళ్లు | చేతికందిస్తుంది |
| కడలేని కడగండ్ల | ఆకలిని కష్టాల |
| వడగండ్ల వానలో | నన్నిటిని మరిపించి |
| చంద్రనిప్పులు గక్కు | చిరునిద్రలో ముంచి |
| మండు టెండల్లోన | స్థిర శాంతిసమకూర్చు |
| గండ శిలలను తుంచి | శిశిరఋతువుకు మటుకు |
| బండలను పెకలించి | చెయెత్తి మొక్కాలి |
| రేబవలు బానిసల | (నేటో గీతానికి తెలుగు సేత |
| రీగి పని చేస్తాను | 'సీచిక'నుంచి కృతజ్ఞతంతో) |

దక్షిణ ఆఫ్రికన్ కవి ఫూనారా తనదేశంలో తన ప్రజల దైన్యాన్ని, నిస్సహాయత్వాన్ని ఎంతో ఆధునిక రీతిలో ఈ విధంగా వ్యక్తం చేస్తాడు :

"నా జీవితమొక శాశ్వతమైన కల,
చెల్లించని బిల్లులపై
చుట్టుకున్న రబ్బర్ బ్యాండ్
నా జీవితమొక చెల్లించని బిల్లు
విస్తరించిన ఒక కల."

ఆఫ్రికన్ కవితారంగంలో పేరు తెచ్చుకొన్న మరి కొంత మంది కవులు—అలెగ్జ్‌గూమా. ఇతను దక్షిణ ఆఫ్రికన్ శ్వేతజాతి ప్రభుత్వంలో ఎన్నో సంవత్సరాలు కారాగార శిక్షకు, గృహనిర్బం

ధానికి చివరికి ప్రవాసజీవితానికి గురై రచనలు చేస్తున్నారు. క్లేం ఒకోఫర్ (జాంబియా), కులుంగోన్ (మోజాంబిక్), డెన్నిస్ బ్రూటస్ (ద. ఆఫ్రికా), ఎమాన్యూల్ అబిచైన్ (నైజీరియా), పార్కేస్ (ఘానా), వోనిసిమో సిల్వేరియా (కేప్‌వెర్డె) తదితరులు మరికొంత మంది ముఖ్యమైన ఆఫ్రికన్ కవులు.

## కథా- నవల- నాటక రచయితలు :

ఆఫ్రికన్ ప్రజల వాస్తవ జీవితాన్ని చిత్రించిన కథా రచయితల్లో అలెగ్సిగూమా (ద. ఆఫ్రికా), సెంబెనేజౌస్‌మనే (సెనెగల్), ఘువారా, మేరీబెన్‌సన్ మొదలైనవారున్నా . అలెగ్సిగూమా "The tank" అనేకథలో నిరాశ్రయులైన దంపతుల జీవితాన్ని గుండెను తాకేవిధంగా చూపాడు. జోనాస్ పేదకూలి. అతని భార్య కోరా గర్భవతి. చెట్లకింద జీవితం గడుపుతుంటారు. వచ్చే వానాకాలంనాటికి ఏదో ఆశ్రయం సంపాదించుకోవాలని జోనాస్ తలదాచుకునేందుకు చోటు వెతుకుతాడు. చివరికి ఒక కొండపక్కనున్న కాలువ దగ్గర పనికిరానినీటిట్యాంక్ కనపడుతుంది. ఆ ట్యాంక్‌పై తెరకప్పి ఇల్లుగా మార్చుకుంటాడు. కొంతకాలం అతను, అతని గర్భవతిభార్య నిశ్చింతగా ఆ ట్యాంక్‌లో రాత్రులు గడుపుతూ — పనిలేని రోజుల్లో కొండపై కూచుని కాలం గడుపుతారు. ఒకరోజు అకస్మాత్తుగా పోలీసులు వచ్చి " 'నల్లకుక్కలకోసం' కాదురా! ఈ ఖాళీ చోటు" అని ఆ ట్యాంక్ ఇంటిని ధ్వంసం చేస్తారు . జోనాస్‌లో విషాదం, కోపం ప్రజ్వరిల్లుతుంది. కాని ఏమీ చేయలేడు. ఇది క్లుప్తంగా కథా ఇతివృత్తం. అలెగ్సిగుమా ఈ కథద్వారా ద. ఆఫ్రికాలో పెద్ద ఎత్తున నల్లజాతి ప్రజల తిరుగుబాటు చెలరేగుతుందని పరోక్షంగా ఈ కథద్వారా సూచిస్తాడు.

నవలా రచయితల్లో నైజీరియన్ దేశస్థుడు 'చినూవా అచేబే' వలసదేశాల్లో నీగ్రోప్రజలు చైతన్యవంతులవుతుండగా ఎలాంటి అంతర్గత వైరుధ్యాలను, సంఘర్షణలను ఎదుర్కొంటారో తన పాత్రలద్వారా చిత్రించాడు. అచేబే రచించిన నవలల్లో ప్రధానమైనవి: "Things fall apart", "Arrow of god", "No Longer at case".

"Things fall apart" అనే నవలలో ఇతివృత్తం — విదేశీసంస్కృతి ప్రభావంలోపడి, తనజాతి సమాజంలోసంపన్నుడిగా వుండిపోవాలనే యత్నంలో వ్యక్తిగతమైన విషాదాన్ని ఎదుర్కోడం. ఉమోఫియా తెగ జీవితంలోకి క్రైస్తవమతం వ్యాపించగానే వచ్చిన వైరుధ్యాలు—ఆ తెగ చారిత్రకమైన దశలో తిరిగినమలుపు, చిన్నాభిన్నమైన వారి ఆదిమ సాంస్కృతిక అలవాట్లను, యధార్థాలను చూపించాడు. చుట్టూవున్న ప్రకృతిలోని చెట్లు, తుఫానులు, వాన, కొండలు ప్రతిదానిలో వచ్చే పరిణామాలను పాత్రలజీవితాలలో వచ్చే మలుపులకు పక్కగా సమన్వయం చేసాడనిచెబుతారు.

'No Longer at case'అనే నవలలో బూర్జువా జీవితానికి అలవాటుపడిన ఒకొంకోవా అవినీతికి పాల్పడి లంచాలు తినడంద్వారా తన సాంఘిక హోదాను కాపాడుకోవాలని ప్రయత్నించడం, ఆ లంచాలు పుచ్చుకోడం క్రమంగా ఒక తెగకు ఎలా అలవాటుగా మారుతుందో, అది మామూలు పద్ధతికింద ఏ రకంగా పరిణమిస్తుందో వివిధ సంఘటనలద్వారా ఈ నవలా ఇతివృత్తం అద్దం పడుతుంది. వెనకబడిన సమాజంలో మధ్యతరగతి ప్రజలు జీవితసదుపాయాలను ఏ పద్ధతిలోనైనా సాధించాలని ప్రయత్నించి కష్టజీవులను మరచిపోవడం ఇందులో ముఖ్యమైన అంశం.

"Arrow of god" అనే నవలలో — ఎజూలు ఒక తెగకు చెందిన మతగురువు. మంచి సాహసవంతుడిగా, మేధావిగా పేరున్న ఎజూలు ఒక విషయంలో తనతెగకు క్రమంగా దూరమవుతాడు. ఒక భూమి తగాదాలో తన ప్రజల విశ్వాసాన్ని కోల్పోతాడు తన కొడుకును క్రైస్తవమతంలో చేర్పించినందుకు మరోవైపు శత్రుతెగలోని ప్రచారంవల్ల క్రమంగా ఒంటరివాడవుతాడు. తాను జీవితాంతం 'ఉలు' దేవుణ్ణి కొలిచాడు. కాని అకస్మాత్తుగా ఒక రోజున కొడుకు ప్రమాదంలో చనిపోతాడు. శత్రువులదాడి పెరుగుతుం . తనను దేవుడి బాణంగా భావించుకొని ఎదురులేదనుకున్న ఎజూలు పిచ్చివాడైపోతాడు. తనదేవుడే తనకు ద్రోహం చేసాడనే నిర్ణయానికి వస్తాడు. ఈ ఇతివృత్తం మనకి మళయాళం నవల 'నిర్మాల్యం'ను జ్ఞాపకం చేస్తుంది.

అంగోలియన్ నవలా రచయిత జోర్జ్ అమాడో తన బాయియా భాషలోని మాధుర్యాన్ని,లయను గుండెను తాకేవిధంగా వ్యక్తంచేసాడని విమర్శకుల అభిప్రాయం.

ఆఫ్రికన్ అధ్యయన కేంద్రం ( The centre for African studies ) వలస వ్యతిరేక పోరాటాలకు నైతిక బలాన్ని—సాంస్కృతిక ఆధారాలను సమకూర్చింది. అంగోలో, గినీ, మోజాంబిక్ రచయితలు, మేధావులు కేప్‌వెర్డో దీవుల్లో నిర్బంధితులుగా ఎంతోకాలం గడిపారు. పోర్చుగీస్ అధికారుల హింసకు లోనైనారు. లిసీడియాస్, ఆంటోనియో జాసింటో, రాండినో వీరో తదితర రచయితలు ముఖ్యులు. మొదట్లో పోర్చుగీస్ భాష అలవాటైనా ఆ తర్వాత వాళ్లు తమ స్వంతభాష కింబుండూను అభివృద్ధి చేసుకున్నారు. ఆ తర్వాత క్రమంగా సాయుధపోరాటం అంగోలా తదితరదేశాల ప్రజల జీవితంలో అంతర్భాగమైంది. "గెరిల్లా" అనేపదం గ్రామీణ జీవితంలో ప్రచారంలోకి వచ్చింది.

స్వాతంత్ర్యంకోసం పోరాడడం ఎంత మహత్తరమైన జీవితాంశమో, కాల్చే ప్రతి బుల్లెట్‌లో న్యాయాన్ని అందించే సందేశం ద్వారా పాతకలలన్నీ పక్షుల్లా రెక్కలని ఎలా విదిలించుకుంటాయో ఆఫ్రికన్ ప్రజాసాహిత్యం ప్రపంచానికి చెబుతోంది. ఆఫ్రికన్ ఆదిమ మానవుడి జీవితవాంఛ — విముక్తిపోరాటం అక్కడి డప్పు వాయిద్యాలతో, జానపద సంగీతాలలో మార్మోగుతోంది. తుపాకులను ధ్వంసం చేసినా మళ్లీ కొత్తతుపాకి కోసం ఇంటికి వెడతానంటూ, విధ్వంసంకాలేని మానవుని ఆత్మవిశ్వాసంతో, ఓటమిలేని పోరాటంతో ఈనాటి ఆఫ్రికన్ నల్లవాని సాహిత్యం ఈ యుగపు వినూత్న పరిణామంగా జ్వలిస్తూ వుంది.

శ్రీ కుంటిముక్కల లక్ష్మీనారాయణశర్మ

# జానపదగేయం - వ్యవస్థ

భాషాశాస్త్ర సాహిత్యంలో కన్పించే విశ్లేషణలలో సాహిత్య విభాగాన్ని అర్థవంతంగా వివరించేందుకు పూనుకున్నవి కొన్ని మాత్రమే ఉన్నాయి. అనువర్తన విధానాలలోని లోపం, సిద్ధాంత విషయం పరిణామానికి లోనవుతుండడంవలన ఈ విశ్లేషణల ఫలితాలు సందేహాస్పదంగా తోస్తాయి. విశ్లేషణలలోని కొన్ని వివరాలు ఇదివరలో చర్చించటం జరిగింది (1977 ఎ, బి, సి). వాటిలో ప్రతిపాదించిన అంశాలను జానపద సాహిత్యానికి అనువర్తింపడం ఇక్కడ జరుగుతుంది.

కవిత్వాన్ని సమర్థవంతంగా అర్థంచేసుకోవడం పాఠకుల/శ్రోతల అభిరుచి, సందర్భజ్ఞానం వివేచనపై ఆధారపడిఉంటాయి. ఈ మూడింటిలోను కవిత్వాన్ని అర్థంచేసుకోవడానికి ముఖ్యంగా వివేచన ఉపయోగం ఎక్కువ. "ప్రాతినిధ్యం" వివేచనలో ముఖ్య పాత్ర వహిస్తుందని హాలిడే (Halliday 1973 : 112-13) అభిప్రాయం. లోగడ ముకరా విస్కీ (Mukara Vsky, 1970 : 43-7) ప్రతిపాదించిన విలక్షణ* (Foregrounding)కు పోలిక ఉన్నప్పటికీ భిన్నమే.

హాలిడే దృష్టిలో "విలక్షణ" ఉద్దేశ్య ప్రాతినిధ్యంగా తోస్తుంది. ఈ నామబంధంలో ఉపయోగించిన 'ఉద్దేశ్యాని'కి సంస్కృతాలంకార శాస్త్రజ్ఞుడైన భామహుడి కావ్య నిర్వచనమే (శబ్దార్థౌ సహితౌ కావ్యమ్) అర్థం. ఏదో ఒకరకంగా భాషా లక్షణాలు వేరొకరకంగా కన్పిస్తూ మరొకవిధంగా కొన్ని లక్షణాలకు అవధారణ ఏర్పడటమే హాలిడే ప్రాతినిధ్యానికి ఇచ్చిన నిర్వచనం. ఈ విషయాన్ని ప్రయోజనదృష్టితో ప్రయోగిస్తే ఎదిరి పాత్రల ప్రతిస్పందనను సూచించింది ప్రకాశం (1976 : 9). హాలిడే తదితరులచేత ప్రతిపాదింపబడిన వ్యవస్థా వ్యాకరణ సిద్ధాంతం భాషాప్రయోజనాలను సఫలవంతంగా చూపిస్తుందని వాక్యాలలోను (సాహిత్యంలోను) ఇమిడిఉన్న భాషా నిర్మాణాలలో ప్రతిఫలిస్తున్న భాషాప్రయోజనాలను స్పష్టంగా అర్థంచేసుకోవాలంటే ఈ కోణాల దృష్ట్యా పరిశీలన జరపాలన్నది ఈయన అభిప్రాయం.

పై పరిశీలనలు ఎంతవరకు ప్రయోజనకారో తెలుసుకోవడం ఈ క్రింది జానపద గేయాధారంగా జరుగుతుంది:

చందమామ చందమామ ఎక్కడికెళ్ళావే
గోల్కొండకు పోయి గొత్తెను తెచ్చి 2

పడింట్లోనే వాలికె దీసి
చీకిన బొక్కలు కాకికేస్తే 4

కాకి మోసెడు గడ్డి దెచ్చే
గడ్డి తీస్కబోయి బర్రెకేస్తే 6

బర్రె బుడ్డెడు పాలనిచ్చే
పాలు కొంటబోయి అమ్మకిస్తే 8

అమ్మ నాకు అటుకులు పెట్టె
అటుకులు తీస్కబోయి కోమటికిస్తే 10

కోమటి నాకు కొబ్బరి పెట్టె
కొబ్బరి కొంటబోయి పంతులుకిస్తే 12

పంతులు నాకు పజ్జెం జెప్పే
పజ్జెం గొంటబోయి మామకిస్తే 14
మామ నాకు పిల్లనిచ్చే

పిల్లపేరు మల్లె మొగ్గ నా పేరు జమీందారు 16

## రామరాజు (1969 : 16p)

'వ్యవస్థా వ్యాకరణ సిద్ధాంతం' భాషకీ క్రింది ప్రయోజనాలున్నాయని భావిస్తారు :

ఎ) ఆలోచనా అవయవం 1) అనుభవ అవయవిక 2) సంబంధావయవిక

బి) అంతర్వ్యక్తావయవం 3) అంతర్వ్యక్తావయవిక 4) వైయక్తావయవిక

సి) అంశావయవం 5) వికరణాత్మక అవయవిక 6) వాస్తవావయవిక.

---

* లీచ్ (Leech 1960 : 56-57); "ప్రయోక్త ఎన్నుకున్న కళాత్మక కృతి సృజనలో వాడే సాధారణ విధానాలను, సూత్రాలను అనుసరిస్తూనే విరుద్ధాత్మక ప్రవర్తన చూపించడం సమాజ సభ్యులుగా మనం గమనించే విషయమే.

...కళాత్మకవ్యవస్థ నియమాలను పరిశీలించేవారు విమర్శకుడు, శాస్త్రవేత్త సమస్తాన్ని, ఆశ్చర్యం కలిగించే మూలాంశాలను శోధించాలి కాని, సాధారణ విధానాన్ని కాదు. (భాషా) శాస్త్రపరంగా, సమాజపరంగా అంగీకృతమైన ఈ వైవిధ్యాలకు ప్రత్యేకంగా ఇచ్చే పేరే విలక్షణ."

ఉదాహృత జానపద 'గేయ ప్రయోజన ప్రాతినిధ్యం' గ్రహించాలంటే భాషా ప్రయోజనాలదృష్ట్యా వివరణ అవసరం.

అనుభవ అవయవిక, సహభాగుల, పరిస్థితుల ప్రక్రమాల మిశ్రితం. ఈ గేయ సంబంధి వివరాలను క్రింది విధానంలో సూచించవచ్చును.

సహభాగులు — గేయంలో పది ప్రాణివాచక సహభాగులు పాల్గొన్నాయి. మిగిలినవి అప్రాణి వాచకాలు. ప్రాణివాచక సహభాగుల్లో నాలుగు జంతువాచకాలను మిగిలినవి మానవ వాచకాలు. మానవ వాచకాలలో నాలుగు పుంలింగ వాచకాలు, రెండు స్త్రీలింగ వాచకాలు పాల్గొన్నాయి. వివరణకు సూచిక స్వరూపం ఇస్తే విషయం ప్రస్ఫుటం అవుతుంది.




పరిస్థితులు— సహభాగులు పాల్గొనే పాత్రలనాధారంగా ప్రేరకాలుగాను, అనుభోక్తలుగాను, కర్మలు, విశేషణాలు గాను విడదీయవచ్చును.

ప్రక్రమాలు— గేయంలో ప్రయుక్తమైన 23 క్రియలలో పది మాత్రమే ప్రత్యేకతను సంతరించుకున్నాయి. శేషక్రియలన్నీ పునరుక్తతలే. ఒక క్రియ సంబంధార్థకంగాను (పాదం 4: చీకిన బొక్కలు) రెండు సంయుక్తక్రియలు (పాదాలు 6, 8: తీస్కబోయి, కొంటబోయి) ఒక్కొక్కసారి పునరుక్తమవుతూ (పాదాలు: 10, 12, 14) ప్రయోగించబడ్డాయి. క్రియా ప్రక్రమాలను నాల్గుగా విభజించుకోవచ్చును. 1) వచ్యర్థకాలు 2) భౌతికవ్యాపారబోధకాలు 3) గతి (Process) బోధకాలు 4) చాలక (Motion) అర్థకాలు. విశ్లేషణ సూచిక రూపంలో తెల్పవచ్చును.




(సూచికలో ఇవ్వబడిన క్రియలు గేయప్రయోగంలో ఉన్న క్రియల ధాతురూపాలు, అక్కడక్కడ స్వరనాదతను తీసివేసి గ్రహించినవి.)

విశేషణాలుతప్ప (పాదాలు 3, 5, 7: నడింటేసి, మోపెడు గడ్డి, బుడ్డెడు పాలు) మిగిలిన సహభాగులన్నీ వర్ణ్య వస్తువులుగా నిలుస్తాయి. వీటిలో కొన్ని సందర్భానుసారంగా ప్రేరకకర్తలుగాను, అనుభోక్తలుగాను పాల్గొంటాయి. ఇది గొలుసుకట్టుగా బంధింపబడి ఉండడం విశేషం. వర్ణ్యవస్తువులన్నీ ముఖ్యోద్దేశ్యాన్ని తమలో తాము పంచుకొన్న విధానాన్ననుసరించి మూడు విభాగాలు పొందుతాయి. 1) ప్రేరకాలు (చందమామ, గోల్కొండలు) 2) ముఖ్య కర్త— గేయరచయిత 'జమీందార్'గా ప్రవేశిస్తాడు ప్రత్యక్షంగా, ముఖ్యోద్దేశ్యం సాధించే నిమిత్తం నాల్గుసార్లు పాల్గొన్నాడు. (పాదాలు: 9, 11. 13, 15 నాకు) 3) అముఖ్యకర్తలు — ముందు చెప్పబడిన వర్గాలకు చెందినవి అన్నీ ఇందులోకి వస్తాయి. కొన్ని అముఖ్యకర్మలు తమలోతాము కర్త మరియు కర్మసంబంధాల్తో ఉన్నాయి. ఉదా: గేయంలోని నాల్గవపాదంలోని కర్మ అయిదవ పాదంలో కర్తగా చరిస్తుంది. అలాగే అయిదవపాదంలోని కర్మ ఆరవపాదంలోని కర్తగా... ఇదివరలో చెప్పబడిన గొలుసు కట్టుతనానికిదీ కారణం.

గాయకుడే, రచయితే ముఖ్యకర్తగా ఉంటూ ముఖ్యోద్దేశ్యం గేయంచివరన నెరవేర్చుకొనడం జరిగింది. కన్నుతాను 'జమీందారు' గాను ఉద్దేశ్యాన్ని 'మల్లెమొగ్గ'తోను ఉపమించుకున్నాడు.

గేయమంతటా 'చర్య'లు గొలుసుకట్టుగా ఆవరించుకొని ఉన్నప్పటికే ముఖ్యాచర్యకారణం గేయ ఉపధాచరణంలో ఇమిడిఉంది. దీనిలో ఉద్దేశ్యం ఏమిటో చెప్పబడింది. సంబంధావయవిక దృష్ట్యా ఇది 'కీలకస్థానం'.

సాధారణంగా 'చాలక' క్రమంలో చలనం అంతర్లీనం. చలనక్రియ అయిన 'రావె' ('వచ్చు' ప్రార్థనార్థకరూపం) అసాధారణ సహవర్తనంతో వ్యర్థకంగా ఉపయోగింపబడటం గమనార్హం. (ఫలాపేక్షలో ఈ క్రియ తన ధర్మమైన చలనాన్ని సూచించదు)

వాక్య నిర్మాణాల పరిశీలన అంతశ్చర్యావయవిక నెరవేరుస్తుంది. గేయం అధికభాగం భూతకాలిక అసమాపక క్రియలతో కూడిన హేత్వర్థకసమాస బంధాల ప్రయోగం విశేషం. ఈ సమాస బంధాల చివర 'ఎ' పదాంశం ఉండటం వీటి లక్షణం. గేయం మొదట్లో ఒకటి, చివరలో రెండు నిర్దేశాత్మక ప్రవచనాలున్నాయి.

వైయక్తికాంశయవికను 'చిత్తవృత్తి'లో పరిశీలిస్తే భిన్నాక్షర నిర్మితమైన పదాలన్నీ సముచితమైన అర్థాన్ని బోధిస్తూ 'పొదుపు కదా నిర్మాణం' కలిగిఉంది. భావాన్ని ఎక్కువగా రెండక్షరాల క్రియాపదాల్లో కుదించి ఉన్నట్లుగా గమనించగలం.

ఈ గేయంలో ఉన్న న్యూనార్థిక పరిధి దృష్ట్యా తాత్పర్యార్థక పదం ఎన్నుకోవడం కష్టం. 'ఇచ్చు' (భిన్నరూపాలను) లెక్కించి తాత్పర్యార్థకంగా తీసుకోవచ్చును. గేయ మూలభావాన్ని తెల్పగలగడం (కనీసం పాక్షికంగానైనా), గేయచివరిపాదానికి ముందున్న పాదంలో ఉండడమేకాక ఆరుసార్లు పునరుక్తమవడం ఈ క్రియలో ముఖ్యకర్మార్థం వ్యక్తపరచబడడం ఈ ఎన్నికకి కారణాలు.

తాత్పర్యార్థకపదాన్ని ఎన్నుకోవడంలో హైమ్స్ (Hymes. 1960 : 118) కన్పరిచిన అంశాల్లో ఇవి సరిపోతాయి. ఈ గేయానికి భిన్నక్రియలతోపాటు ఈ క్రియాప్రయోగం ప్రత్యేక శైలిని సంతరించుకునేలా చేసింది.

వికరణాత్మకవయవికను (అర్థవిషయంగా చూస్తే) గేయ ప్రథమపాదం విషయంగా ఉంది. రెండవపాదం నుంచి పదిహేనవ పాదంవరకు 'శ్రేణీపరివృత్తి'ని గమనించ వచ్చును. (వాక్యం ఉపవాక్యంగా మారటం శ్రేణీపరివృత్తికి సంశిత నిర్వచనం) శ్రేణీ పరివృత్తి సంసంజననంతో కూడిందిగా ఉంది. చివరిపాదం విషయిగా మారుతోంది.

(అర్థ దృష్ట్యా) వార్తావయవికను సూచించదలిస్తే, చివరిపాదం వరకు ఉన్నభాగం ఉద్దేశ్యంగాను, చివరిపాదం విధేయంగాను ఉంది. స్థూలంగా చేసిన విశ్లేషణ ననుసరించి భాషా ప్రయోజనాలలో ఈ క్రింది లక్షణాలు గేయానికి ప్రత్యేకతను సంతరించిపెట్టినవిగా నిర్ధారించవచ్చును

1) 'శ్రేణీపరివృత్తి' ఈ గేయానికి ముఖ్యలక్షణం అంటే ప్రయుక్త వాక్యంలో చివర భాగం ఉపవాక్యాలుగా కన్పిస్తాయి

2) అముఖ్య కర్మల పరస్పర సంబంధం గేయానికి గొలుసుకట్టు నిర్మాణాన్ని ప్రసాదిస్తోంది.

3) గొలుసుకట్టు నిర్మాణంలో ఉన్న వాక్యాలు సూచించే అముఖ్య ఉద్దేశ్యాలతోపాటు. క్రియాంత పదాలు ముఖ్యోద్దేశ్యాన్ని అర్థం చేసుకోవడానికి తోడ్పడుతున్నాయి.

4) శ్రేణీపరివృత్తి పొందిన ఉపవాక్యాల చివర సాధారణ లక్షణమైన 'ఎ' పదాంశాంతాన్ని గేయశైలీ లక్షణంగా గ్రహించవచ్చును.

విపులంగా సమీకరించిన ఈ ఫలితాలు ఇతర జానపద గేయాల వ్యవస్థా లక్షణాలతో పోల్చిచూస్తే వచ్చే ఫలితాలు కూడి భాషా సిద్ధాంతం సౌష్టవంగా పెంపొందటానికి ఎలా ఉపయోగపడతాయో మరొకమారు చర్చిస్తాను.

# References


1) Freeman, D. C., 1970 : Linguistics and Literary Style, Newyork : Holt Rinehard and Winston Mc.

2) Halliday, M.A K., 1973 : Explorations in the Function of Language London: Edwin Arnold

3) Hymes, D., 1960 : "Phonological aspect of Style", in Sebeok (ed), 109-31.

4. Laxmi Narayana Sarma, K., 1977 (a) : "శైలీశాస్త్రం – యెంకి", 'తెలుగు', VI 1 : 67–77

(b) : "కనుబొమల్లో" ... 'భారతి' 54/7:52 – 54.

(c) : "శైలీశాస్త్రం – శరదూతం" విశ్వనాథ స్మారక సంచిక (అచ్చులో) హైదరాబాదు.

5) Leech, G. N., 1969 : Linguistic guide to English poetry London : Longmans.

6) Mukarovsky, J. 1970 : "Standard language and Poetic language" in Freeman D (ed); 40-56.

7) Prakasam, V., 1976 : "Quest for the beyond" (Theoretical & Practical stylistics) Hyderabad : Mimeographed.

8) Rama Raju, B. 1969 : తెలంగాణ జానపద గేయాలు Hyderabad : Andhra Saraswata Parishad.

9) Sebeok, T. A., 1960 : Style in Language Newyork : M I T V John Wailey.

# మేలుకొలుపులు

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

తరతరంబుల యజ్ఞాన తమము క్రమ్మ
నిద్రలో మాంద్యమున నుండి నిజము కల్ల
యెఱుఁగకున్నావు తెలియ దీయెఱుఁగమియును
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.

సకల విధముల సంపదల్ క్షణికము లగు;
పదవు లన్నియుఁ బతన స్వభావయుతము;
లఖిల భోగముల్ పుణ్యంబు లపహరించు;
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.

అమిత మైన యహంకార మలముకొనఁగ
సత్యము నెఱుంగు సద్బుద్ధి సమసిపోయె;
నింత కంటెను పతన మిం కేమి కలదు ?
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.

పరమ పావన నరజన్మ వ్యర్థ పఱచు
కొనకు; మకుటాయమాన మీ జనన మెల్ల
సృష్టిలోపల; జ్ఞాన సంసిద్ధి కొఱకు
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.

మూఁడునాళ్ల ముచ్చటలలోఁ బ్రొద్దుపుచ్చి
వ్యర్థ మొనరించు కొనకుము భవ్య జన్మ;
లెమ్ము లెమ్ము గడింప జ్ఞానమ్ము వేగ
మేలుకొను మోయి! మానవా! మేలుకొనుము.

జ్ఞానమయ మైన భరత దేశంబునందుఁ
బుట్టుకం గన్న అత్యంత పుణ్యపురుష !
తత్త్వరస ముగ్గు మన తెల్గుతల్లి పెట్టె
మేలుకొను మోయి! మానవా! మేలుకొనుము.

సర్వకళలును శాస్త్రముల్ శక్తు లెల్ల
జ్ఞాన సాధనకేసుమా! జ్ఞానలక్ష్య
భాగ్యమే భారతావని భాగ్య మరయ
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.

శాశ్వతం బగు సత్యలక్ష్యంబు ముందు
మిగిలినవి వ్యర్థముల్; జ్ఞానమే శరణ్య;
మదియే సుఖమిచ్చు నిందును నందు నెందు
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.

అమితమైన జ్ఞానామృత మబ్ధి లగుచు
అలరుచున్నది మనకుఁ బిత్రార్జితమయి
తృప్తిగాఁ గ్రోలి ఆనంద దీధితిఁ గన
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.

వంచనా పాటవమ్మున వఱలు రాజ
కీయములగోల మనకేల ? కేవలంబు
జన్మ సాఫల్య మొనగూర్చు జ్ఞాన మంద
మేలుకొను మోయి! మానవా! మేలు కొనుము.



శ్రీ ఏ. కృష్ణారావు

# యుగపురుషుడు మార్క్స్

కారల్ మార్క్స్‌ను ఆధునిక శాస్త్రీయ సామ్యవాదానికి మూల పురుషుడని చెప్పవచ్చు. సామ్యవాదం, దానికి సంబంధించిన అనేక భావాలు మార్క్స్‌కు ముందే చెప్పబడినాయి. రాబర్ట్ ఓవెన్, సైంట్ సైమన్ మొదలైన వారు కాల్పనిక సామ్యవాదం (Utopiom Socialism) గురించి చర్చించినారు. వారి భావాలు, కార్యకలాపాలు ఆచరణ సాధ్యంకాక పోవటం వల్ల ఎక్కువ ప్రచారం లోకి రాలేదు. వివిధ స్థాయిలలో ఉన్న సామ్యవాదభావాలను ఒక సంపూర్ణ భావనగా రూపొందించి, దానిని అమలు పరచడానికి ఒక నిర్దిష్టమైన కార్యక్రమాన్ని మార్క్స్ వెండితుడు రూపొందించాడు. కారల్ మార్క్స్‌ని ఒక యుగపురుషుడుగా కోట్లాది ప్రజలు ఆరాధిస్తున్నారు. రాజనీతి భావాలలో ఇంత ప్రసిద్ధి చెందిన రచయిత మరొకరు కనిపించరు. ఇతడు Communist Manifesto (1848), Das Capital (1867), Critique of political Economy (1859), Value, Price and Profit (1867) మొదలైన అనేక గ్రంథాలు రచించాడు. వీటిలో 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో' విశ్వవిఖ్యాతి చెంది, అన్ని బాషల లోకి అనువదించబడి కోటాను కోట్ల కమ్యూనిస్ట్ వాదులకు ఒక 'బైబిల్'గా, పవిత్రమైన గ్రంథంగా మన్ననను పొందినది.

కారల్ మార్క్స్ భావాలను ఈ క్రింది శీర్షికల ద్వారా మనం చర్చించవచ్చు: (1) చారిత్రక భౌతిక వాదము (Materialistic Inter pretation of History); (II) మిగులు విలువ సిద్ధాంతం (Theary of surplus value); (III) వర్గపోరాటసిద్ధాంతము (Theary of class war): (IV) శ్రామిక నియంతృత్వము (Dictatorship of the proletariat); (V) రాజ్యరహిత, వర్గరహిత సమాజము (classless and stateless society)

## చారిత్రక భౌతిక వాదము

మార్క్స్ భౌతిక వాది. భావాలకంటే పరిసరాలకే ప్రాధాన్యం ఇచ్చాడు. పరిసరాల ప్రభావం ముఖ్యంగా ఆర్థిక పరిస్థితులు ప్రజల జీవితాల్ని, వారి రాజకీయ, సాంఘిక సంస్థలను, భావాలను నిర్దేశిస్తాయి. చరిత్రను భౌతిక పరిస్థితుల ద్వారా పరిశీలించాలని మార్క్స్ అభిప్రాయము. వివిధ కాలాలలో, రాజ్యాలలో, నాగరికతలో మనం తెలుసుకోవలసింది భౌతిక పరిస్థితులు (Material Conditions) ఈ భౌతిక పరిస్థితులు ఆర్థిక కారణాలతో జతపడి వుంటాయి. ఆర్థిక కారణాలనగా సామాన్య ప్రజలు వారి జీవనోపాధికై అవలంబించే మార్గాలు, అవకాశాలు. ఈ అవకాశాలను పూర్తిగా వినియోగించుకొనే వారు ఆర్థిక కార్యకలాపాలను నిర్దేశించగలుగుతారు. వీరి కార్యకలాపాలలో మిగతా వారు తక్కువ స్థాయిలో పాల్గొంటారు. ఇలా పాల్గొనే వారు సాధారణంగా అధిక సంఖ్యలో ఉంటారు. వీరు కేవలం తమ ఉపాధికోసమే పనిచేస్తారు. వీరికి ఆర్థిక, ఉత్పాదక కార్యకలాపాలలో ఎక్కువ చొరవ, నిర్ణయాలు తీసుకొనే అధికారము ఉండదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఉత్పత్తి కార్యకలాపాలను ప్రధానంగా నిర్దేశించే వారు కొద్ది మంది మాత్రమే ఉంటారు. ఈ ఉత్పత్తి కార్యకలాపాలపై అజమాయిషీ, యాజమాన్యం, నియంత్రణ, ఎవరికైతే ఉంటుందో వారే ఒక సమాజం యొక్క రాజకీయ సంస్థలు, సాంఘిక వ్యవస్థ, తదితర సామాజిక జీవనానికి సంబంధించిన అన్ని అంశాలపై ప్రాబల్యాన్ని చూపించగలుగుతారు.

చరిత్రను ఆర్థిక విశ్లేషణద్వారా పరిశీలించటంలో మార్క్స్, హెగెల్ ఉపయోగించిన గతితార్కిక పద్ధతినే (Dialectics) ఉపయోగించాడు. దీని ప్రకారం మానవచరిత్రను పరిశీలించినప్పుడు వివిధరాజ్యాలలో వచ్చే మార్పులను వాటి ఆర్థికపరిస్థితులు నిర్ణయిస్తాయి. ఉత్పత్తి కార్యకలాపాలలో ఏర్పడే మార్పులు (నూతన పరికరాల ఉపయోగము, సాంకేతిక, శాస్త్రీయ విజ్ఞానంఅభివృద్ధి), వాటి ప్రభావం రాజకీయసంస్థలపై కూడా ఉంటుంది. ఆదిమ సమాజంలో వస్తూత్పత్తి కేవలం వ్యక్తిపరంగా, వ్యక్తిగతమైన అవసరాలకే పరిమితమైనది. సామాజికజీవనం బలపడటంతో మానవుని అవసరాలు క్రమంగా పెరిగి వాటిని తీర్చుకోటానికి క్రొత్తపద్ధతులను కనుక్కోవటం జరిగింది. తరవాతకాలంలో భూస్వామిక వ్యవస్థలో, అటు తరవాత పారిశ్రామిక విప్లవం ఫలితంగా వస్తూత్పత్తిస్థాయి విపరీతంగా పెరిగి తత్ఫలితంగా ఏర్పడిన ఆర్థిక కార్యకలాపాలు రాజకీయసంస్థలపై కూడా ప్రసరించినాయి. ఉదాహరణకు ఆటవికసమాజం నుంచి రాజకీయ వ్యవస్థ వరకు, రాజకీయ వ్యవస్థ నుంచి ప్రాతినిధ్య సంస్థలద్వారా ఏర్పడిన జాతి రాజ్యాలన్నీ (Nation states) ఆర్థిక కార్యకలాపాలలో వచ్చిన మార్పుల ఫలితమే.

మార్క్స్ చరిత్రను విశ్లేషించటంలో ఆర్థిక కారణాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాడు. ఇతని అభిప్రాయంలో భౌతిక పరిస్థితులే మానవుడి భావాలను, అంతరాత్మను, మానసిక స్థితిని

నిర్దేశిస్తాయి. అంతేగాని భావాలు భౌతిక పరిస్థితులను నిర్దేశించవు. ఆర్థిక పరిస్థితుల ప్రభావాన్ని విశ్లేషించి వాటి ప్రాముఖ్యాన్ని వివరించటానికి మార్క్స్ ప్రయత్నించాడు. ఆర్థిక కారణాల ప్రభావాన్ని మనం ఏ విధంగానూ తగ్గించలేము, కాదనలేము. కాని ఆర్థికకారణాలు మాత్రమే చరిత్రనునిర్దేశిస్తాయని చెప్పటంలో కొంత అతిశయోక్తి, మరికొంత అవాస్తవికత కనిపిస్తాయి. అనేక సందర్భాలలో జాతీయభావం (Nationalisum), జాతీయోద్యమం, మత, సాంఘిక కారణాలవల్లకూడా మానవుడు రాజకీయ కార్యకలాపాలలో పాల్గొనటానికి సిద్ధపడతాడు. అంతేకాక ఆర్థిక కారణాల ద్వారా చరిత్రను విశ్లేషించటంలో మానవుడిపాత్ర కేవలం యాంత్రికం అనిపిస్తుంది. కాని మానవుడు యాంత్రికంగా వ్యవహరించడు. ఆర్థిక, సాంఘికరాజకీయసంస్థలు మానవ నిర్మితమైనవే. అందువల్ల అవి కేవలం మానవాతీతమైనవనిలేదా మానవుడు వాటిని ఎటువంటి సందేహం లేకుండా అనుసరిస్తాడని మనం చెప్పలేము.

## వర్గ పోరాటము :

మార్క్స్ అభిప్రాయంలో ఇంత వరకు ఉన్న మానవచరిత్ర వర్గ పోరాటాన్ని సూచిస్తుంది. వర్గాల మధ్య ఏర్పడిన సంఘర్షణే చరిత్ర అని మార్క్స్ అంటాడు. ప్రాచీన కాలం నుంచి ప్రస్తుత కాలం వరకు ప్రతి సమాజంలో ప్రజలు రెండు వర్గాలుగాఉంటారు. ఒక వర్గం ఉత్పత్తి కారకాలకు (Factors of production) యాజమాన్యం వహిస్తుంది; ఆర్థిక వ్యవస్థ ప్రయోజనాలను నిర్దేశిస్తుంది. వనరుల యాజమాన్యంలో ఉత్పత్తి కార్యకలాపాలను నిర్దేశించటం, వాటిని వినియోగదారులకు కేవలం లాభాపేక్షతో విక్రయించటం జరుగుతుంది. వస్తూత్పత్తిలో మార్పులు వచ్చిన కొద్దీ వస్తూత్పత్తి పెరగడమేకాక ఉత్పత్తికారకాలకు యాజమాన్యం వహించే వ్యక్తులసంఖ్యకూడా క్రమంగా తగ్గిపోతుంది. దీనికికారణం ఉత్పత్తిదారుల మధ్య ఏర్పడిన తీవ్రపోటీయో ఈ ఉత్పత్తి దారులు ఆర్థికకార్యకలాపాలనునిర్ణయించటమేకాకిందులోపాల్గొనే శ్రామికులను లాభాపేక్షతో విపరీతంగాపీడిస్తారు. అసహాయ స్థితిలోఉన్న శ్రామికవర్గం ఈ ఉత్పత్తిదారులపట్ల ద్వేషభావాన్ని పెంచుకుంటుంది. అంతేకాక వీరి సంఖ్యకూడా ఉత్పత్తికార్యకలాపాలలో సాంకేతిక,వైజ్ఞానిక పరిశోధనలద్వారా ఏర్పడినయంత్రాలు, ఆధునికీకరణ, శ్రామికుల సంఖ్యను తగ్గించేస్తాయి. అంతేకాక లాభాపేక్ష కోసం విదేశీమార్కెట్ల అన్వేషణ, ఇతరదేశాలనుంచి వనరులను సంపాదించుకోటానికి తక్కువవేతనాలపై శ్రామికులను వినియోగించుకోటానికి ప్రయత్నాలు జరుగుతాయి. వీటిఫలితంగా శ్రామికుల సంఖ్య దినదినం అభివృద్ధి చెందుతుంది. చివరికి విప్లవపంథా ననుసరించి, పెట్టుబడిదారీ వ్యవస్థను తొలగించి వర్గరహిత సమాజాన్ని ఏర్పాటు చేయటానికి ప్రయత్నాలు జరుగుతాయి. ఈ సందర్భంలో మార్క్స్ ఈ విధంగా శ్రామికులను ఉత్తేజపరుస్తాడు :

''కమ్యూనిస్టులు వాళ్ల అభిప్రాయాలను, లక్ష్యాలను కప్పిపుచ్చటాన్ని ద్వేషిస్తారు. ప్రస్తుత సాంఘిక వ్యవస్థను బలప్రయోగంద్వారా అంతం చేయటంద్వారానే వాళ్ల లక్ష్యాన్ని సాధించడం జరుగుతుందని కమ్యూనిస్టులు బహిరంగంగా ప్రకటిస్తారు. కమ్యూనిస్ట్ విప్లవం రావటానికి ఉన్న అవకాశాలను చూసి పాలకవర్గాలు భయపడనీ. సంకెళ్ళను ఛేదించుకోవటం తప్ప శ్రామికులు నష్టపోయేదేదీ లేదు. వాళ్ళు జయించటానికి మరో ప్రపంచం ఉంది. అన్నిదేశాల కార్మికులారా సంఘటితం అవండి''.

స్థూలంగా చెప్పాలంటే వర్గపోరాటం చరిత్ర ప్రతి దశలోనూ కన్పిస్తుందని మార్క్స్ అంటాడు. గ్రీకుల కాలంలో పౌరుడు బానిస, రోమన్‌ల కాలంలో కులీనులు, సామాన్య ప్రజలు, మధ్యయుగాలలో భూస్వాములు, బానిసలు, ఆధునిక కాలంలో పెట్టుబడిదారులు, శ్రామికులు, యజమానులు ఉద్యోగులు — వీరి మధ్య జరిగే నిరంతర సంఘర్షణే వర్గపోరాటము. మార్క్స్ సూచించిన ఈ వర్గ పోరాటం ఒకరకంగా ప్రచారానికే ఎక్కువ అవకాశం కల్పిస్తుంది. వివిధ కాలాలలో ధనిక పేదల మధ్య ఈర్ష్యాద్వేషాలు ఉన్నా సామాజిక జీవనంలో వీటి సంఘర్షణ పూర్తిగా ఉన్నట్లు మనం కచ్చితంగా చెప్పలేము. మార్క్స్ జీవించిన కాలంలో శ్రామికుల పరిస్థితి అధ్వాన్నంగా ఉండేది. అంతేకాక అప్పుడు వారిలో ఐకమత్యము, సంఘటితత్వం సంస్థారూపం ధరించకపోవటంవల్ల వారిని పీడించటానికి పెట్టుబడిదారులకు అవకాశం ఉండేది. అంతమాత్రాన మొత్తం సమాజం రెండు వర్గాలుగా ఏర్పడింది లేదా ఏర్పడుతుంది అని కచ్చితంగా మనం చెప్పలేము. ప్రతి సమాజంలోనూ ఆర్థిక కార్యకలాపాలలో ప్రత్యక్షంగా పాల్గొనని ప్రజలుకూడా ఉంటారు, వీరు ఉద్యోగులు కావచ్చు, అధ్యాపకులు కావచ్చు లేదా విద్యార్థులు కావచ్చు. లేదా వీరందరినీ మధ్యతరగతి ప్రజలని కూడా చెప్పవచ్చు. ప్రతి సమాజంలోనూ ఈ మధ్యతరగతికి చెందిన ప్రజల కనీసం కొద్దిమందైనా ఉంటారు. అందువల్ల సమాజం రెండు వర్గాలుగా చీలిపోతుందని చెప్పలేము. అంతేగాక వర్గాన్ని మనం కచ్చితంగా నిర్వచించలేము. ఒక వ్యక్తి ఒకే వర్గానికి ఎల్లకాలం పరిమితం అవుతాడని కూడా చెప్పలేము.

ప్రస్తుత కాలంలో అనేక రాజ్యాలలో కార్మిక సంఘాలు ఏర్పడినాయి. ఈ కార్మికులందరూ ఒకే సంస్థద్వారా తమ ప్రయోజనాలను సాధించుకోటానికి ప్రయత్నం చేయటం లేదు. వివిధ రంగాలలో పనిచేసేవాళ్ళు వివిధ సంస్థలద్వారా కృషి చేస్తున్నారు. వేతనాలు, తదితర సౌకర్యాల విషయంలో తేడా కన్పిస్తుంది. ఉదా : వివిధ సంస్థలలో పనిచేసే వ్యక్తులకు పని రీతిగా సమాన వేతనాలు లభించటంలేదు. అందువల్ల శ్రామికులంతా ఒకే వర్గం కింద సంఘటితం అవటంలేదు. ఈ సందర్భంలో ప్రస్తుత కాలంలో శ్రామికులకున్న సదుపాయాలను పరిశీలించినట్లయితే అనేక రాజ్యాలలో ముఖ్యంగా పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన రాజ్యాలలోని శ్రామికవర్గం వెనుకబడిన సమాజం కంటే మెరుగుగా ఉంది. అందువల్ల ప్రతి రాజ్యంలోనూ ప్రజలు రెండు వర్గాలుగా విడిపోతారనటం సరైనది కాదు.

## శ్రామిక నియంతృత్వము

వర్గపోరాట సిద్ధాంతానికి అనుగుణమైన భాగం శ్రామిక వర్గం నియంతృత్వం. శ్రామిక వర్గం పెట్టుబడి దారీ వ్యవస్థను కూలద్రోసి కార్మిక వర్గ ఆధిక్యతతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తుంది. ఈ ప్రభుత్వం శ్రామిక వర్గం వ్యతి రేక శక్తులను పూర్తిగా అణిచివేసి వర్గ రహిత, రాజ్య రహిత సమాజాన్ని స్థాపిస్తుంది. మార్క్స్ రాజ్యాన్ని వర్గప్రాబల్యానికి ఒక సాధనంగా భావించాడు. పెట్టుబడి దారి వ్యవస్థలో రాజ్యము పెట్టుబడి దారీ వర్గ ప్రయోజనాలను పెంపొందించటానికి ప్రయత్నిస్తుంది. కార్మిక నియంతృత్వం పెట్టుబడి దారీ విధానాన్ని పూర్తిగా రద్దు చేయటానికి, యితర రాజ్యాలలోని వ్యవస్థలు తన రాజ్యవ్యవస్థకు, విధానాలకు ప్రమాదం కలిగించకుండా వాటిని నిరోధించటానికి శ్రామిక వర్గం రాజ్యాధికారాన్ని, ప్రభుత్వ యంత్రాంగాన్ని పూర్తిగా వినియోగిస్తుంది. కార్మిక వర్గ నియంతృత్వం తాత్కాలికమైనది. వర్గరహిత, రాజ్యరహిత సమాజం స్థాపన దీని ధ్యేయము. దానిని సాధించిన తరువాత వెంటనే కార్మిక నియంతృత్వం రద్దవుతుంది. రాజ్యయంత్రాంగం క్రమంగా అదృశ్యం అవడం ప్రారంభిస్తుంది. ఈ సంధికాలంలో కార్మిక నియంతృత్వం తన అంతిమ లక్ష్యాన్ని సాధించటానికి, ఎదురయ్యే అడ్డంకులన్నింటినీ పూర్తిగాతొలగించటానికి ప్రయత్నిస్తుంది.ఈదశలో పరిశ్రమలను ఆర్థిక కార్యకలాపాలను ప్రైవేట్ యాజమాన్యంనుంచి పూర్తిగా తొలగించడం,వ్యక్తిఆస్తి హక్కును (ప్రైవేట్ ఆస్తి)రద్దుచేయటం ప్రైవేటు ఆర్థిక కార్యకలాపాలను నిషేధించడం జరుగుతుంది ప్రతి వ్యక్తికి అతని సామర్థ్యానికి తగిన పనిని కల్పించడం, అతను చేసిన పనికి తగిన ప్రతిఫలం ఇవ్వటం జరుగుతుంది.

రాజ్యరహిత, వర్గరహిత సమాజస్థాపన దీర్ఘకాలిక కృషితో కూడినది. ఈ ఉద్యమంలో పాల్గొనడానికి అనేక రంగాలలో, అనేక స్థాయిలలో ప్రజలు పాల్గొంటారు. వారి కృషికి తగిన ఫలితాన్ని ఇవ్వటమే ప్రస్తుత లక్ష్యము (సమసమాజ స్థాపనకు ముందు). ప్రజలలో వర్గభేదాలు నశించి, ఐకమత్యము, స్వయంసమృద్ధి, స్వయంసంసిద్ధత సాధించిన తరువాత ఆ సమాజంలో వర్గభేదాలు నశించటమేకాక రాజకీయసంస్థల అవసరంకూడా ఉండదు.ఈ నవ సమాజంలో ప్రతి వ్యక్తికి అతని శక్తి సామర్థ్యాలకు తగిన పనిని కల్పించటం, అవసరాలకు తగిన ప్రతి ఫలాన్ని అతనికి ఇప్పించటం జరుగుతుంది.

కారల్ మార్క్స్ శ్రామిక నియంతృత్వం తాత్కాలికమైనదని భావించాడు. ఈ శ్రామిక నియంతృత్వపు కృషి ఫలితంగా వర్గ రహిత, రాజ్యరహిత సమాజం ఏర్పడ తుంది. ఆ తరువాత రాజకీయ సంస్థల అవసరం ఉండదని మార్క్స్ భావించాడు. శ్రామిక నియంతృత్వం తాత్కాలికం అని చెప్పినా ఇది సుదీర్ఘంగా కొనసాగటానికే ఎక్కువ అవకాశాలు కనిపిస్తున్నాయి. రష్యాలో 1917లో బోల్షివిక్ విప్లవం వచ్చిన తరువాత లెనిన్ నాయకత్వంలో శ్రామిక ప్రభుత్వం ఏర్పడింది ఈ ప్రభుత్వతం తాత్కాలికం అవకుండా ప్రస్తుతంకాలంలోనూ కొనసాగుతున్నది అంతేకాక నానాటికీ నియంతృత్వాధికారాలను చెలాయిస్తూన్నది జాతి రాజ్యభవన్ బలపడిన ఈ కాలంలో రాజ్యరహిత సమాజం అనేది దాదాపు అసాధ్యమే అవుతుంది. వర్గాలను నిర్మూలించటం ఒక ఆశయం అయినప్పటికీ ఆర్థిక, సాంకేతిక కారణాల వల్ల వర్గాలు ఈనాడు కూడా అనేక సామ్యవాద రాజ్యాలలో ఉండటమేకాక అవి నానాటికి బలపడుతున్నాయి.ప్రభుత్వోద్యోగులు, సాంకేతిక నిపుణులు, వైజ్ఞానిక వేత్తలు, సైనికాధికారులు, పార్టీ సభ్యులు, సామాన్య స్థాయిలో ప్రభుత్వకార్యకలాపాలను నిర్వహించే లక్షలాది ఉద్యోగులు—వారి జీవన విధానంలో, వేతనాలలో, వసతులలో ఎంతో వ్యత్యాసం ఉంటున్నది. అదే విధంగా కమ్యూనిస్ట్ పార్టీలోని నాయకులు, అనుచరులు, మరొకవైపు సామాన్య ప్రజలు – ఈ విధంగా ప్రజాజీవనంలో కూడా కొన్ని వైవిధ్యాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. శ్రామిక నియంతృత్వం పాత వర్గాలను రద్దుచేసి వాటిస్థానంలో కొత్తవర్గాలను సృష్టిస్తున్నది.

## వర్గరహిత రాజ్యరహిత సమాజము :

కారల్ మార్క్స్ ఉద్దేశంలో వర్గ రహిత సమాజము రాజ్యం యొక్క ఆవశ్యకతను క్రమంగా తగ్గించి వేస్తుంది. ప్రజలలో వర్గ భేదాలు నశించి, ఆర్థిక తారతమ్యాలు తొలగిపోయినప్పుడు రాజ్యం ఆవశ్యకత ఉండదు. ఎందుకనగా ఆర్థిక వ్యవస్థ పూర్తిగా సమాజపరం అవుతుంది. ప్రతి వ్యక్తీ శ్రమించి పని చేస్తాడు. తన అవసరాలకు తగిన ప్రతిఫలం పొందుతాడు. ఈ సమాజంలో పీడించేవారు ఉండరు. పీడింపబడే వారూ ఉండరు. కాబట్టి రాజ్యం యొక్క అవసరం ఎవరికీ ఉండదు

కాల్పనిక సామ్యవాదులు వాస్తవికతకతీతంగా కొన్ని ఆదర్శాలను సూచించారు. మార్క్స్ ఈ ఆదర్శాలకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. పెట్టుబడి దారీ విధానం ద్వారా నష్టపడిన, నిస్సహాయ స్థితిలో ఉన్న అశేష ప్రజానీకాన్ని సంఘటిత పరిచి, ఒక నిర్దిష్ట కార్యక్రమం ద్వారా లోపభూయిష్టమైన పెట్టుబడి దారీ వ్యవస్థను తొలగించటానికి కార్మిక వర్గాన్ని మార్క్స్ ప్రోత్సహించాడు ఇంత వరకు కారల్ మార్క్స్ వాస్తవికవాది. ఆ తరువాత వర్గరహిత, రాజ్యరహిత సమాజం కార్మిక కర్షక అంతిమలక్ష్యం అని భావించాడు నిజానికి ఈ లక్ష్యం కూడా ఒక ఆదర్శం కింద భావించవచ్చు. అనేక రాజ్యాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఈ మార్పులన్నీ తీసుకురావటానికి ప్రయత్నించిన వారు ఈ మార్పుల లక్ష్యం నవసమాజ నిర్మాణం అని, అందులోని రాజకీయ, ఆర్థిక, సాంఘిక సంస్థలు మానవజీవితాన్ని శ్రేయోదాయకంగా చేస్తాయని ఉద్బోధించినారు. అయినప్పటికీ ఈనాటి వరకు ఇటువంటి సమాజ నిర్మాణం జరగలేదు. సాంకేతిక, వైజ్ఞానిక, ఆర్థికాభివృద్ధిని మానవుడు ఎంత సాధించి నప్పటికీ ఇటువంటి సమాజ నిర్మాణం ఎండ మావులుగానే మిగిలి పోయింది.

# తుహిన తోరణము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

అపుడు వెన్నెల కాసిన యడవి సొంపు
లడవిఁ గాసిన వెన్నెల లగుట కాదు;
రస గహనవీథిఁ దుహిన తోరణము తెఱచి
యనుపథము సాగు మ్నోభావనాధ్వనీన !

శ్రీ కమనీయముల్ చివురుచేతులఁ బర్ణ కుటీరవాటికన్
వాకిట సంజదీప మిడవచ్చిన కణ్వుని ముద్దుబిడ్డకున్
గూఁకటి వేణిలోఁ దుఱుముకో నఱవిచ్చిన మూదిమొగ్గగాఁ
దాఁకిన వెల్గురేక భరతక్షితి కానుపు తియ్యతన్పులా.

శార మంజుల సుమస్తబకమ్ము లయిరేని
కడవలై పెండ్లి వేడ్క లిడు పొదలు
కొమ్మ యౌఁదల వంచుకొని చివుర్పెదవుల
మధువు లానెడి వృక్ష మంటపములు
పులుకు పుల్కనఁ గాంచు పులుఁగు కన్నెలకు డో
లా వినోదముఁ దీర్చు నోవరములు
విరుల గుత్తులు శిరోవిన్యస్త కలశముల్
గా, గొండ్లి గావించు తీఁగ గుబురు
లకృతక మమోఘ శృంగార మమృత సుభగ
మైన యారణ్యక ప్రణయ ప్రపంచ
మొక చిరంతన గురు వసిష్ఠోపదేశ
సూత్ర సంస్నేహ మారని జోతి కాద !

తెలిమొగ్గ పూల తెఁగలచాలు లొకదండ
స్ఫటికాక్ష సూత్ర సంఘటన నెఱపి
పావనోదక సరోవరదేశ మొకదెస
శ్వేతపద్మచ్ఛాయఁ జిలుకరించి
అనువాద కుశల శుకావళి యొకవంకఁ
బలుకు తెల్లని చిల్క తలఁపు తెచ్చి
తాళ ఖర్జూరాదిక తరురాజి యొకచాయఁ
జెలువారు పుస్తక శ్రీ ఘటించి
నాల్గుచేతులతో నరణ్యాని యొసఁగు
రమ్యవాణీ స్వరూప దర్శన మనంగ
శారద కళానిధి స్వచ్ఛ చంద్రికలకు
సార్వకాలిక రసమహోచ్ఛ్వాస మయ్యె.

క్రౌంచ దంపతి వియోగ క్లిష్ట జలధారఁ
దడియైన ఛందోవతార భూమి
భావుకాగ్రణి భరద్వాజర్షి గాను నను
వ్యాహారమునకు నాద్యంబుపజ్ఞ
బహువర్ణ శిల్ప కల్పన మూలదీపమౌ
హరిచాప సుందరి కంతిపురము
రామ రామేత్యక్షర మధుస్వరోదార
కూజత్పికం బాను కొన్నశాఖ
అఖిల లౌకిక ధర్మ సాహస్రములకుఁ
బడగ లెత్తు ననంతుని పట్టుపడక —
బహు శరత్సంచితమ్ము తపస్సుగుట్ట
అది కావ్యోద్గమంబైన యడవి పుట్ట

వాలికలై తపో విపిన వాటిక మూలుగు జీర్ణ వంశపు
స్థాలికి విందుసేయు సొగసై చివురించిన నందబాల గో
పాలుని కావిమోవి మధుపర్కము పిల్లనగ్రోవిపాట బృం
దా లలితాటవీ ప్రచలితంబయి చేయు సుధాభిషేకముల్.

చీకటి చెట్లు క్రొంద లిరు చేతుల వెన్నెల పూలపొట్లముల్
చేకొనినట్లు గాలి కదలింపులలో బెళిపింపులైనఁ బె
రాఁకు నఱ్ఱుసాఁచెడి మృగార్భకమున్ సకుశాగ్రపాణియై
దాకొను పారికాంక్షి యెదఁదన్ గరఁగున్ నవనీతఖండముల్.

తనకు లభించుదాన నొక తస్పు-పరోపకృతిం దలంపు—భో
గనియతి—సర్వలోక హితకాంక్ష నెలర్చు తపస్సు—వీనితోఁ
బనిగొని యున్నయట్టి మునిపల్లెల నాగరకత్వ చంద్రికల్
చినికిన యంత మేరకు ఫలించును విశ్వ జయప్రకాశముల్.

బెదరు బెదరు మాపుల లేళ్ళ పొదుపులకును
కుదురు గుండియ విడువనీ పదములందు
బాల హరిణాంక జూటుని పాణిరంగ
సంగి మంగళ వీక్ష — సారంగ రక్ష.



శ్రీ కే. కిశోర్ బాబు      శ్రీ కే. అశోక్ బాబు

# వట్టెం

ఈ గ్రామం కన్నె మున్నూటిలోనిది. ప్రస్తుతం నాగర్ కర్నూలు తాలూకాలో ఉంటుంది.

కన్నెమున్నూటికి కందురునాడని మరోపేరు. పూర్వం ఈ ప్రాంతానికి కదంబవాడి అని పేరు. దానికి నిదర్శనంగా కదంబ పృథ్వీ నాడు కందూరులో ఉన్నాయి.

ఈ ప్రాంతాన్ని పూర్వం పశ్చిమ చాళుక్య సామంతులైన ఏఱువ చోళులు పాలించారు.

ఆ చోళులు కొణిదెన వారిలో ఓ శాఖ. కొణిదెన వారి మూల పురుషుడు కరికాలుడు. అతని కుమారుడు మహిమానుడు. అతనికి కరికాలుడు, తొండమానుడు, దశవర్మ అని ముగ్గురు కుమారులుండేవారు. వారిలో కరికాలునిశాఖ కొణిదెనలో నిలిచి పోయింది. మూడోవాడైన దశవర్మ శాఖ గంగాపుర ప్రాంతం వచ్చిందని కొత్త భావయ్య చౌదరి మతం. అలాగే శాసనాల్లోని ప్రశస్తిని మూలపురుషుని పేరును బట్టి చూస్తే రెండో వాడైన తొండమానుని శాఖ కోడూరికి వచ్చారని చెప్పవలసి ఉంటుంది.

ఈ గ్రామం నేడు పాలమూరు నుండి కోసిగి వెళ్ళేరోడ్డుపై ఉంటుంది.

కృష్ణానదికి కన్నడ శాసనాల్లో ''ఏఱ''ని వ్యవహారముంది. తెలంగాణంలో ఆనదిని ఏఱనే పిలుస్తారు. చోళులు రేనాటి నుండి విస్తరించిన తరువాత కొందరు కృష్ణాతీరానా క్రమించి, ఏటి దరి యైన ఆ రాజ్యానికి ''ఏఱువ'' అని నామకరణం చేశారు.

ఏఱువను పాలించారు గాబట్టి వారేఱువ చోళులయ్యారు. పిమ్మట వారాక్రమించిన ప్రాంతాలన్నీ ఏఱువనాటి క్రింద చేరి పోయాయి.

చోళులు తమిళులు. వారిది సింహలాంఛనం. రేనాటికి వచ్చిన పిమ్మట వారు నల్లమలల్లోని ప్రధాన జీవం వ్యాఘ్రాన్ని తమ లాంఛనంగా తీసుకోగా, వారి నుండి వేరైన ఏఱువ చోళులు గోవత్సాలను తమ లాంఛనంగా స్వీకరించారు. ఈ విధంగా వారు, తమిళచోళుల నుండి రేనాటి చోళులు వేరైనట్లు రేనాటి చోళుల నుండి ఏఱువ చోళులు వేరైయ్యారు.

పాలమూరి ప్రాంతానికి వచ్చిన చోళులు మొదట కోడూరిని తమ రాజధాని చేసికొన్నారు. ఆ నాడు వారి అధీనంలో మూడు వందల గ్రామాలుండేవి. కాబట్టి వారి రాజ్యానికి ''కోడూరి మున్నూటి'' అని పేరుండేది.

ఈ కోడూరు ఆనాడు పశ్చిమ చాళుక్యులకు, రాష్ట్రకూటులకు జరిగే దండయాత్రలకు దారిలో ఉంది. తఱచు గడిమండలంగా ఉండేది. అందువల్ల కొంతకాలానికి వారు తమ రాజధాని నక్కడి నుండి మార్చుకోవలసి వచ్చింది

చోళులక్కడి నుండి తమ రాజధానిని కందూరుకి మార్చుకొని కందూరు చోళులయ్యారు. ఈ కందూరు నేడు వనపర్తి తాలూకాలో ఉంటుంది.

చోళులు కోడూరి నుండి కందూరికి వచ్చిన పిమ్మట వారి నాశ్రయించిన రాజబంధువులందరు ఆ సమీపంలో తమ రాజులపేర ''చోళపురం'' అనే గ్రామాన్ని స్థాపించుకొన్నారు. అదీనాడు షోలీపురం అని పిలువబడుతుంది.

ఈ షోలీపురం కందూరు గ్రామాలలో నేడు చోళులనాటి ఆలయాలున్నాయి. ఆనాడిక్కడి రాజ కుటుంబాలను, ఆలయాలను ఆశ్రయించి పెక్కు విప్రులుండేవారు. చోళులా విప్రులకు ఓ అగ్రహారాన్నిచ్చి వారినక్కడ నిలిపారు. ఆ విప్రులనా విధంగా నిలిపిన ''విప్రులపల్లె'' నేడుప్పరిపల్లెగా మారింది.

కందూరిలో ఉండే దేవునికి రామలింగస్వామి అని పేరు. ఆ దేవుని సోమసూత్రంలోగాక పక్కంలో ప్రతిష్ఠించబడ్డాడు. దానికి స్థానికులొకకథను చెబుతారు:

కందూరి సమీపంలో ఓ పెద్దగుట్ట ఉంది. ఇక్కడి దేవుడు మొదలాగుట్టపై ఓ చొటికలో ఉండేవాడు. ఆ దేవుని ప్రతిదినం తమ్మళితోపాటతని బార్యగూడ వెళ్లి పూజించేది. అలా ఉండగా కొన్నాళ్ళకామె గర్భవతి అయి ఆ కొండ ఎక్కలేకుండా అయింది. ఆ దశలో ఆమె ఓనాడు ఎలాగో స్వామి సన్నిధికి వెళ్లి ''స్వామి నేనిక పూజకు రాలేను కాబట్టి మన్నించవలసిందని'' మొక్కింది. అప్పుడా స్వామి ఆమె భక్తికి మెచ్చి కనిపించి ''నీవు కొండెక్కి రాలేకపోతే నేనే కొండ దిగివస్తాను. నన్ను నీవెక్కడ నిలవమంటావో! అంతవరకు తిరిగి చూడకుండా వెళ్ళు'' అని ఆదేశించాడు.

దానికామె అంగీకరించి కొండ దిగుతుండగా తనవెనుక ఏదో పెద్దరథం వస్తున్నట్లు చప్పుడు కాసాగింది. దాని కామె జడిసి అదేమిటో అని వెనుదిరిగి చూడకుండ ఉండలేకపోయి దారి నడుమనే ఓచోట వెనక్కి తిరిగి చూచింది. దానితో ఆ రూపం చూడలేక ఆమె అక్కడే పడిపోయింది. ఆమె వెనుకవస్తున్న రథ చక్రాలు దొర్లుకొని అక్కడినుండి క్రిందబడిపోయాయి.

అంతవరకా గుట్టక్రింద ఓ పుష్కరిణి వుండేది. గుట్టపై నుండి దొర్లిన రథచక్రాల్లో ఒకటి పుష్కరిణిలోను, రెండోది దాని ప్రక్కగాను పడిపోయాయి. అవి అలాపడిపోగా గ్రామస్థులా సంఘటన కద్భుతపడి పుష్కరిణి ప్రక్కగా పడిపోయిన రథచక్రానికి ఓ ఆలయం గట్టి ఆ చక్రంలోనే స్వామిని ప్రతిష్ఠించారు.

ఈ ఆలయం పశ్చిమముఖంగా ఉంటుంది గర్భాలయంలో శివుడు చక్రంలో ప్రతిష్ఠింపబడటంవల్ల దానికి సోమసూత్రానికి వలె జలమార్గంలేదు. అయినా శివునికిన్ని బిందెల నీరభిషేకంచేసినా, ఆ చక్రంలోనికే పోతుందిగాని దానిపైనుండి దాటి పారదు. ఈ విధంగా ఈ ఆలయానికి అందరి శివునికి ఓ ప్రత్యేకత ఉంది

ఈ ఆలయం వెన్ను నానుకొనే పుష్కరిణి ఉంది. దాని చుట్టు కడిమి చెట్లున్నాయి. అవి నల్లగా జీడిచెట్లలా ఉన్నాయి. పూలుమాత్రం ఎర్రగా ఉంటాయి. ఆ చెట్లు శ్రావణంలోనే మాత్రమే పూస్తాయి.

కడిమిలో నీరుకడిమి, నేలకడిమి, బట్టకడిమి, వసంతకడిమి అనే భేదాలున్నాయిగాబట్టి ఇవి ఏ జాతికి చెందినవో తెలుసుటకు దాని రూపాన్ని చెప్పాను.

పూర్వం ఈ చెట్లీ ప్రాంతంలో చాలా ఉండేవట కాని నేడు లేవు. ఈ చెట్లను బట్టే ఈ ప్రాంతానికి, "కదంబవాడి" అనే వ్యవహారం ఏర్పడిందని అంటారు. పరిశోధకులొక పర్యాయం యిది తప్పక చూడవలసిన గ్రామం.

చోడులు కోడూరిని విడిచిన పిమ్మట దీన్ని రాజధానిగా చేసికొని కోడూరివలెనే దీన్నిగూడ "కందూరి మున్నూటి" అని పిలిచారు.

ఈ చుట్టుపట్ల దీనిలాగే అయిజమున్నూటి, పెదకంటి మున్నూటి, కణియకల్లుమున్నూటి అని యింకా మున్నూటినాడులున్నాయి. ఆ నాడులన్ని పశ్చిమ చాళుక్యుల సామంతులు పాలించేవారు.

నేడు తెలంగాణంలో "మున్నూరు కాపు" అనే ఓ తెగ ఉంది. వారికాపేరు ఆరువేల నియోగులవలె ఈ మున్నూటి నాడులను బట్టినే ఏర్పడిఉంటుంది.

ఈ కన్నె మున్నూటిని క్రీ. శ. 1075 ప్రాంతంలో భువనైకమల్లుని సామంతుడు బిజ్జన చోళుడు పాలించాడు. నేడు పాలమూరు నాగరకందనూలు సడకుపైనుండే బిజ్జనపల్లె యితని పేరనే వెలసినగ్రామం. అది నేడు "బిజ్నాపల్లి" అని భ్రష్ట రూపాన్ని పొందింది. ఈ గ్రామం వట్టెం గ్రామానికి దక్షిణంగా రెండుపరువులపై ఉంటుంది.

బిజ్జనపల్లె కంటె మొదలక్కడ అనంతగిరి అనే పల్లె ఉండేది. అది కాలక్రమాన అంతరించిపోయింది.

బిజ్జనపల్లెలో గోన గన్నారెడ్డి శాసనమొకటి ఉంది. అతని రాజధాని వర్ధమానపురం. ఈ గన్నారెడ్డి అనుయాయుల్లో మంగి డొకడు. వరకాలుని ప్రభావం ఈ ప్రాంతంపై ఎక్కువ. ఈ మంగడొక దొంగల సరదారు. ఆ నాడతడు నివసించిన పల్లె నేడు (మంగని + ఊరు) మంగునూరు అని పిలువబడుతుంది. ఇది వట్టెము గ్రామానికి పశ్చిమంగా ఉంటుంది

క్రీ. శ. 1170 ప్రాంతంలో వర్ధమాన పురాన్ని భీమగోకర్ణ చోడులు పాలించారు. వారిలో గోకర్ణుని శాసనంలో పెద్ద పోతిరెడ్డి, చిన్నపోతిరెడ్డి చెఱువులు పేర్కోబడ్డాయి. ఆ పోతిరెడ్డి పేర వెలసిన పోతిరెడ్డిపల్లె వట్టెం గ్రామానికి ఉత్తరంగా ఓ మైలుపై ఉంటుంది.

క్రీ. శ. 1280 నాటి కాకతి రుద్రమ సామంతుడైన చెఱకు బొల్లయరెడ్డి బండారి కరణం రామయ్యగారి ఉమామహేశ్వర శాసనంలో కోడుపర్తి పేర్కొనబడింది. అది ఆనాడొ నాయంకరం. ఆనాడు దాని నాయకుడు నాపయమ్మైన కావచ్చు. ఈ గ్రామం నేడు వట్టెం గ్రామాని కుత్తరంగా రెండు కిలోమీటర్లపై ఉంటుంది. ఈ విధంగా ఈ గ్రామం చుట్టు చాలా ప్రాచీన గ్రామాలున్నాయి.

## 2

వట్టెం గ్రామానికి మొదట లింగాపురమని పేరు. దాని అడుగు ప్రస్తుత గ్రామానికి దక్షిణంగా ఉంటుంది.

లింగాపురం గుంతపాటుకు ఉండి వర్షాకాలంలో చిత్తడిగా ఉండేది. ప్రస్తుత గ్రామముండే చోట "మంగంపల్లె" అనే గుడిసెలుండేవి. అక్కడ మంగ చెట్లెక్కువగా ఉండేవి కాబట్టి దాన్ని ఆపేరుతో పిలిచేవారు. ఆ అడుగు— ఎప్పుడు వట్టిగా శుభ్రంగా ఉండేది. అందువల్ల లింగాపురం ఆవట్టి చోటికి మారి "వట్టెం" అనే పేరు పొందింది. ఇప్పటికీ దాని ప్రక్కగా మంగలపల్లె ఉంది.

ఈ గ్రామాని కుత్తరంగా ఓ గుట్ట ఉంది. దానికి నారదాచలమని పేరు. ఆ గుట్టపై 'వింధ్య వాసినీ దేవత" ఉంది. ఆమె వర్షాధి దేవత అని యిక్కడి వారి నమ్మకం.

ఈ గ్రామం పూర్వం శ్రోత్రియాగ్రహారం. దీన్ని చింతలపల్లి వారు, గంగాపురం వారు, ఖండవల్లి వారు అనే మూడు కుటుంబాలకు కలిపి రెడ్డి దొరలు అగ్రహారంగా యిచ్చారు.

అగ్రహారం కంటె మొదటి నుండి గూడా ఈ గ్రామంలో కవిపండితులకు కుటుంబాలెక్కువ. వారిలో మనకు మొదట స్ఫురించేది అప్పకవి మేనమామ గారి కుటుంబం.

అప్పకవి పూర్వులది లేమామిడి. అది ఆనాడు చరికొండ సీమలో ఉండేది నేడది షాద్‌నగర్ తాలూకా అయింది.

అప్పకవి వంశానికి మూలపురుషుడు తిమ్మన. ఆయన లేమామిడిలో ఉండేవాడు. ఈయన కుమారుడు సోమన. అప్పకవి యితన్ని గురించి—

బాలుడై కాశికా పట్టణంబున కేగి
  బ్రహ్మేంద్రు నొద్ద శాస్త్రములు జదివె
బ్రహ్మరాక్షసి చేత క్రమము చెప్పంబడి
  కట్టిన గండ భాగంబు నొందె
ఎరికొండ సీమలో సంతరించెను కాకు
  నూరన సర్వాగ్రహార మొకటి
నిడుదవోల్లని బొద్దినే పల్లి నవదళ
  పురిని మాన్య క్షేత్రములు గడించె—

అని చెప్పాడు. ఈ సోమన ఎరికొండ సీమలో కాకునూరనే అగ్రహారాన్ని పొంది లేమామిడి నుండిక్కడికి మారి ఆ చుట్టుపట్ల గల నిడుదవోల్లు, బొద్దినేపల్లి తొమ్మిది రేకులలో మాన్యాలు సంపాదించాడు. ఇది పై పద్య సారాంశం.

ఈ పద్యంలో రెండోపాదం ఉత్తరార్థానికి "కట్టిన గండ భాగంబు నొందె" అన్నపు డన్వయంకుదరదు దీనికి "బ్రహ్మ రాక్షసి చేత, క్రమముజెప్పుచు బండి గట్టిన గండ భాగంబుమోదె"! అనే మరో రూపాంతరముంది. ఆ పాఠాంతరంలో గండ భాగానికి "బండి గట్టిన" అనే విశేషణం సరిపడదు ఈ విధంగా ఆ పాద పాఠం, పాఠాంతరం రెంటిలో గూడ అన్వయక్లిష్టంగ ఉంది.

అంతేగాక "చదివె, బందె, గడించె" అని మూడు పాదాలు సమాపకాంతాలుగా ముగుస్తు వాని నడుమ మూడో పాదం "ఒకటి" అని విశేషణాంతమై ప్రక్రమ భంగం కూడ కనిపిస్తుంది.

అప్పకవి లాక్షణికుడు గదా! అతడు వ్రాసిన పద్యం ఈలా అన్వయ క్లిష్టంగా, ప్రక్రమ భంగంగా ఉంటుందా అని అనుమానం.

ఈ పద్యంలో రెండో పాదపుటుత్తరార్థం 'కట్టిన గండ భాగంబు నొందె" అనే కంటె "గట్టిగ గండ భాగంబు మోదె" అని ఉంటె దాని కర్థం కుదిరే అవకాశముంది. ఆ అర్థానికీ ప్రాంతంలో అప్పకవి కుటుంబాన్ని గురించి వినిపించే కథ గూడ సహకరిస్తుంది.

[1]ఇంతవరకు దీన్ని గురించి గుండి వెంకటాచార్యులు చేసిన ఊహ సరయిందే.

పూర్వం ఆ ప్రాంతంలో ఓ భూస్వామింట గ్రహబాధ ఉండేది. దాన్ని పోగొట్టటానికి దేశీయులెవరికీ సాధ్యంగాలేదు. ఎందరు మాంత్రికులు వచ్చినా ఆ గ్రహం వారికే ఎదురు మంత్రాలు వేసేది. అది చూచి వారు భయపడి ఇది సామాన్య గ్రహం గాదు "బ్రహ్మరాక్షసి" అని వెళ్ళి పోయేవారు. అపుడాయింటాయన ఓ మంచి మాంత్రికుని కోసం వెదకుతుండగా ఆయనకు సోమయ్య తారస పడ్డాడు.

అతడు కాశికి వెళ్ళి బాగా చదువుకొని వచ్చాడని, మంత్రగాడని కూడా పేరుండేది. సోమయ్య ఆయనతో నేను మీ యింటి గ్రహబాధ తీరుస్తానన్నాడు. అది విని ఆయన సోమయ్యను తమ ఇంటికి తీసుకు వెళ్ళాడు. ఇంటికి వెళ్ళిన తరువాత భూస్వామి అతనిని "మీరు మొదట స్నానాదులు ముగించుకొని, వంట చేసుకు తినండి" అని పెరటిలోకి తీసుకెళ్ళి బావిని చూపించాడు.

పెరడు బాగా విశాలంగా ఉండేది. సోమయ్య ఆ పెరట్లో ఓ చోట వంట చేసికోవటాని కుపక్రమించి స్నానం చేసి, యింటి వారి నడిగి ఓ పీట యిప్పించుకొని దాన్ని పెరట్లోనే ఓ చోట వేసుకొని సంధ్య ముగించి జపం చేసికో సాగాడు.

అపుడా యింటి గ్రహంవచ్చి ఆయన ముందు నిలిచి "ఓహో! నీవు నన్ను పారద్రోలటానికి వచ్చావా! మంత్రాలు నీకే వస్తాయనుకొన్నావా! నేను వేదం చెప్పననుకొన్నావా! వేదం నేను కూడ చెప్పగలను చూడు!" అని ఓ పాద మెత్తుకొని క్రమం చెప్పటం మొదలు పెట్టింది.

సోమయ్య జపం చాలించి ఏమీ ఆలోచించకుండా అదివింటు అలా గేకూచున్నాడు. అపుడు దైవికంగా ఆ గ్రహంక్రమం చెప్పటంలో తప్పింది అంతలో సోమయ్యకెం తోచిందో ఏమో లేచి ఆగ్రహంతో దాని చెంపపై రెట్టకొద్ది ఒక్కటంటించాడు. దానితో అది పెద్దగా కేకేసి పెరటి గోడ దూకి పారిపోయింది. అలా అది గోడ దూకే అపుడు కాలుదాకి గోడమూల కొంత విరిగి పడింది.

ఆ కేక, గోడ కూలిన చప్పుడు విని యింటిలోని వారు గబగబా పెరట్లోకి వచ్చి సోమయ్యను "ఏం జరిగింది! ఏం జరిగిందని" ఆదుర్దాగా అడిగారు. అప్పుడాయన వారికి జరిగిన సంగతి చెప్పి నిదర్శనంగా కూలిన గోడను చూపించాడు.

అది చూచి ఆ యింటి వారు సోమయ్య మహత్యానికాశ్చర్య పడి, యిక ఆయన చేత ఆ పారిపోయిన గ్రహం మళ్లీ తమింటిగడప త్రొక్కకుండా బాగుచేయించుకొని ఆయన్ని గొప్పగా సత్కరించారు. ఇదీ సోమయ్యను గురించి వృద్ధులు చెప్పే కథ.

ఈ వృత్తాంతం అప్పకవి నాటికే "పింగళి వారి" కీర్తి వృత్తాంతంవలె ప్రచారం పొంది ఉంటుంది కాబట్టి, సూరన ఆ సంగతి ప్రభావతీ ప్రద్యుమ్నంలోకి ఎక్కించినట్లు అప్పకవి ఈ విషయాన్ని తన అవతారికలో జొప్పించాడు.

అయితే ఈ గ్రహబాధ ఆ ప్రాంతంలో ఏ కుటుంబంలో ఉండేదో దాని వివరాలింకా స్పష్టంగా తెలిసిరాలేదు.

కాలాన్నను సరించి ఈ సోమయ్య చిరాపు భానునికి సంపోతాడు. అతని మాద్రు పినుములవల్ల పెద్దయ్య. అతని సోదరులు గూడా మర్గపాలకులుగా ఉండేవారు.

చరిగొండ కైశికీయతువల్ల ఆ ప్రాంతంలో మందుముల వారు వసనుదార్లుగా ఉన్నట్లు ఇతరాధారాల్నిబట్టి "ఎదిరెవాళ్ళ"

కాకునూరు, రచనూరు మొదలైన గ్రామాలకు ''తాహీదుదార్లు''గా ఉన్నట్లు తెలుస్తుంది. ఇటీవలి వరకు కాకునూరు మాత్రం నిడుదవెల్లి జాగీరుక్రింద ఉండేది.

చరికొండసీమలో సరికొండ పెద్దమ్మ బాగా పేరొందిన గ్రామదేవత. ఆమె భయంకరంగా కూడ ఉంటుంది గాబట్టి అప్పకవి చెప్పిన బ్రహ్మరాక్షసికి, ఈ దేవతకు ఏమైనా సంబంధ ముందేమో !

ఇక పద్యంలోని మూడో పాదాన్ని గురించి అప్పకవి సోమనను ''మనియె... అభినవ చూత సద్గ్రామమునను'' అని చెప్పాడు. మనియె అనగా జీవించుట కాబట్టి అందుకోసం అత వెవరినీ ఆశ్రయించనక్కరలేదు. స్మార్తుడు గాబట్టి శ్రౌతంతో జీవించవచ్చు.

[2]ఇక శ్రీ రాజగోపాలరావుగారన్నట్లు అప్పకవికి సోమయ్య కాకునూరిని అగ్రహారంగా పొందేనాటికి యే యింటిపేరున్నది తెలియదు

సోమన యింటిపేరుకు రావూరివారు ''గిర్వమణసద్రొక్కిన'' అని అర్థం చెబితే రాజగోపాలరావుగారు మరో అడుగు ముందుకు వేసి, ఆయన మధురలో బుధసమూహాన్ని వేదశాస్త్ర పురాణాది వాదాల్లో దొడరి (కాకు + నూరు + ఇంటినిజేసి) నూరిండ్లవారిని తిరస్కరించటంవల్ల ఏర్పడివుంటుందని అన్నారు. ఆనాడు మధురలో బ్రాహ్మణ కుటుంబాలెక్కువ గాబట్టి గోపాలరావుగారి వ్యుత్పత్తి సరిపోయినప్పటికి అగ్రహారదాత సోమన బిరుదమే అగ్ర హారానికి ఉంచాడనటానికి బలం చాలదు.

''మనియెనిల కాకునూరి తిమ్మన సుతుండు'' అని అప్ప కవే అన్నాడు గాబట్టి తిమ్మననాటికే వారికాయింటి పేరుండాలి లేదా అప్పకవికి అంతకంటె మొదటిపేరు తెలియదు కాబట్టి ఔపచారికంగా దాన్ని వాడినాడని భావించాలి.

కవులు తమ యింటిపేర్లకు చిత్రమైన వ్యుత్పత్తులు గల్పించుకొన్న ఉదంతాలు లేకపోలేదు. మరింగంటి వారికా యింటి పేరు కులశేఖరాళ్వారుల వెంట రామానుజులు వెళ్లినపుడు శ్రీరంగేశుడు వారిని జూచి —

కంటిమి మిము కూరేశుల

గంటిమి మీవెంటవచ్చు ఘనులెవరో మరిం

గింటిమి—అని అంటే అనవచ్చు గాక ! కాని ఆ పద్యంలోని మరిం గంటిమనే దళాన్నిబట్టి వారికా యింటి పేరేర్పడి ఉండదు. ''మఱికంటి'' అనే గ్రామం మామిళ్లపల్లి శాసనంలో పేర్కొన బడింది. కాబట్టి వారికా యింటిపేరు ఓ గ్రామ నామమై ఉంటుంది.

అలాగే అప్పకవి గూడ తమ పూర్వుడైన సోమన కాకునూరనే అగ్రహారాన్ని పొంది కాకునూరివాడైనాడు కాబట్టి దాన్ని ఒలడు మధురలో పండితులతో సల్పిన వాదానికి సమన్వ యించి ఆ పేరుకి ఓ నిరుక్తి సృజించి ఉంటాడు

అప్పకవి సహజంగా కవి. అప్పకవీయంలోని పీఠికా పద్యాలు చదివితే, అతని కుత్పేక్షలపై, నిరుక్తులపై ఉండే మక్కువ తెలుస్తుంది. ఇక ఈ పాదం గూడ ''ఒకటి'' అనే విశేషణాంతంగా కాక, క్రియాంతంగా ఉండాలనిపిస్తుంది.

అందువల్ల దాని ఉత్తరార్థం ''సర్వాగ్రహారము, సంలి రంచె'' అని గాని— ''కాకునూరన సర్వాగ్రహారమొందె'' అని గాని ఉంటె ప్రక్రమ భంగము తీరిపోతుంది. ప్రసక్తంగా వచ్చిన ఈ చర్చ యిప్పటికే చాలా పెరిగింది.

ఈ సోమయ్య పౌత్రుడు పెద్దసోమయ్య వట్టం పోతయ్య గారి కూతురు కృష్ణమ్మను చేసికొన్నాడు. ఈ పెద్దసోమయ్య కుమారుడు వెంగన్న మళ్ళీ వట్టం వారింటి ఆడపడుచునే — పోతయ్యగారి కుమారుడు పెద్దిభట్టు కూతురు శేషమ్మను చేసి కొన్నాడు. ఈ వెంగన్న కుమారుడే అప్పకవి.

అప్పకవిగారి తాత పెద్ద సోమయ్యగారు కాకునూరిని విడిచి పలనాటిలో కాపురం పెట్టాడు. అంతేగాక ఆయన గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకాలోని ''కొంపిచర్ల''లో ఓ పెద్ద బావి త్రవ్వించాడు. అక్కడుండే శంకరలింగానికి గొప్ప శిలా ప్రాకారం గట్టించాడు. సత్తెనపల్లి తాలూకాలోని ''గుడిపాడు''లో వినుకొండదారిని ఓ తోట, గ్రామానికి దక్షిణంగా ఓ చెరువు వేయించాడు.

అప్పకవి ఈయనగారి సప్త సంతానాలు చెప్పాడు గాని నివాసం చెప్పలేదు. ఇక ఆయన మేనమామల కుటుంబంలోని నాలందరు కవులు, పండితులు. వారిని అప్పకవి ''కృతప్రబంధుల'' న్నాడుగాని వారి కృతులింకా ఏవి లభించలేదు.

పోతయ్యగారి కుమారుడు పెద్దిభట్టు సాయప వేంకట భూపాలుని చేతుంగేడసీమలో ''కామేపల్లి'' నిఖిలాగ్రహారంగా పొంది వట్టంనుండి అక్కడికి వెళ్లిపోయాడు.

పెద్దిభట్టుకు అంతనరకే తమ బావగారక్కడ కాపురం పెట్టడం ఓ అనుకూలంగా ఉండింది కాబట్టి ఈ విధంగా వియ్యాలవారైన కాకునూరు—వట్టం వారిద్దరు ఒకరి తరువాత ఒకరు తెలంగాణ ప్రాంతంనుండి పలనాటికి చేరారు.

పెద్దిభట్టుకు కామేపల్లిని అగ్రహారమిచ్చిన సాయిపవారు, కమ్మవారు మాదాల గోత్రులు. వారు రాయలసీమలోని దూపాడు పరగణాను పాలించారు. ఆ వంశంలో సాయపమల్లన — అక్కాంబల కుమారుడు ''వేంకటపతి'' ఒకడున్నాడు. సాయిపవారి వంశం చూస్తే లతని వివరం తెలుస్తుంది.[3]

మరో విషయం. బ్రౌనుదొరగారికి గురుతుల్యుడైన అద్వైత పరబ్రహ్మశాస్త్రిగారు వట్టంవారే. వారి జన్మస్థానం ''కారుమూరు'' గుంటూరు జిల్లాలోనిదే.

లప్పకవి తన మేనమామల గోత్రం చెప్పలేదుగాని వట్టెం వారు తెలంగాణ్యులు కౌండిన్యస గోత్రులని విప్రగోత్ర శాఖల్లో ఉంది. పూర్వం వట్టెం ప్రాంతంలో కౌండిన్యస గోత్రానికి చెందిన పండిత కుటుంబాలుండేవి.ఆ వంశానికి చెందిన సర్వజ్ఞ నారాయణా చార్యులనే పండితునికి కందూరు గోకర్ణచోడుని కాలంలో ''వెల్లంగోటి'' సర్వ సమస్తాగ్రహారంగా యివ్వబడింది. ఈ గ్రామమిప్పుడు వట్టెం, బిజ్జనపల్లి గ్రామాల నడుమ ఉంటుంది. ఈ గోత్రానికి చెందిన మరో పండితుడు ఏదుట్ల శేషాచలం. ఈయన పింగళి సూరన పిమ్మటివాడు. ఇతని పూర్వుల నివాసం ఏదుట్ల. నేడు గోపాలుపేట దగ్గర ఉంటుంది. ఈ గ్రామాలన్నీ కందూరినాటి లోనివి.

బూరుగుల వారప్పకవి జన్మభూమిని గురించి వ్రాస్తూ ఒకని తాతగారు కాకునూరినుండి సుదూరమైన పల్నాటికి ఏ విధంగా వెళ్ళిఉంటారు అని సందేహించాడు కాని దానికి ఆస్కారం గనిపించదు.

పూర్వం బ్రాహ్మణ కుటుంబాలు సంచారంచేస్తూ ఒక ప్రాంతంనుండి వేరొక ప్రాంతానికి వెళ్ళుతు, అగ్రహారాలు దొరికిన చోట స్థిరపడిపోయేవారు.

నారాయణ భట్టు పశ్చిమ చాళుక్య రాజ్యంనుండి వేంగి రాజ్యానికి వెళ్ళి రాజరాజుచే ''నందంపూడి'' అగ్రహారంగా పొంది అక్కడే స్థిరపడిపోయాడు.

[4]తర్కసంగ్రహకర్త అన్నంభట్టు పూర్వులు నేటి అచ్చం పేట తాలూకా [*]ని మామిళ్ళపల్లి నివాసులు. అక్కడనుండి వారు చిత్తూరు మండలానికి వెళ్ళారు. పిమ్మట అన్నంభట్టు రామ రాయలతో గుంటూరు జిల్లాలోని ''గరికపాడు'' ను అగ్రహారంగా పొందగా అక్కడ స్థిరపడ్డాడు.

[5]భాగవత వ్యాఖ్యాన కర్త వాత్స్య వీరరాఘవాచార్యులు బద్వేలు తాలూకాలోని లక్ష్మక్కపాలెం నివాసి. ఆయన యాత్రా టనంచేస్తూ క్రీ. శ. 1748 ప్రాంతంలో నేటి వనపర్తి తాలూకా లోని శ్రీరంగాపురానికి వచ్చాడు.

అప్పుడు దాన్ని సూగూరి ప్రభువు బహిరి గోపాలరావుగారి కుమారుడు వెంకటరెడ్డి తన రాజధానిని అక్కడికి మార్చుకొని దాన్ని పాలిస్తున్నాడు. ఆయన రాఘవాచార్యుల ప్రతిభను జూచి అక్కడ ఉండమని కోరగా నిలచిపోయాడు. పిమ్మట క్రీ.శ. 1756 ప్రాంతంలో శ్రీ రంగాపురాన్ని దర్శించటానికి వెళ్ళిన అమరాబాద్ దొరలు వెళ్ళారు.

దాన్నపుడు చింతకుంటరెడ్డి వంశానికి చెందిన కొండల ధర్మారావు పాలించేవాడు. ఈ రెడ్లు పగిడిపాల గోత్రీకులు. వీర రాఘవాచార్యులా దొరల ప్రార్థనపై అమరాబాద్ వెళ్ళాడు. ఇక ఆయనక్కడే పరమపదించాడు.

కాబట్టి ఈ విధంగా ఆ నాటి ప్రాంతంవారు మరో ప్రాంతంలో ఉండిపోయిన నిదర్శనాలున్నాయి.

అంతటి అమరవాది, ఆలేటి, ఆవంచ, ఇంద్రగంటి, గూడూరి, వెదదంవారు తెలంగాణ ప్రాంతంనుండి అక్కడికి వెళ్ళినవారని, ఖండవల్లి, గొడవర్తి, మంత్రవాది, వారణాసి, సన్నిదానంవారు వేంగినాటినుండి తెలంగాణానికి వచ్చినవారని చెబుతారు కాబట్టి అప్పకవి పితామహ.మాతామహ కుటుంబాలు యిక్కడనుండి పలనాటికి వెళ్ళటంలో సందేహముండదు. ఆ నాటి విద్యావంతులకీ దేశభేదంలేదు.

## 3

వట్టెంలోని కుటుంబాల్లో అప్పకవి కుటుంబం తర్వాత చెప్పదగినవారు చింతపల్లివారు. వారు వైదికులు. వశిష్ఠగోత్రులు. అశ్వలాయన సూత్రులు. ఈ వంశానికి మూలపురుషుడు ఎల్లయ్య. అతడు వింధ్య వాసినీదేవీ ఉపాసకుడని ఆదిరాజువారు జెప్పినట్లు శ్రీ డా. బి. రామరాజుగారు తెలిపారు.ఈ దేవాలం వట్టెం సమీపం లోని నారదా చలంపై ఉంది. కాబట్టి ఈ ఎల్లయ్య ఈ చుట్టు పట్లవాడే అనాలి.

చింతపల్లి ఎల్లనార్యుడు అచ్యుతదేవరాయలతో బహుళాగ్రహారాలు పొంది కమలాపురంలో నివసించాడు. ఆ వంశంలో ఐదో తరం వాడైన మూర్తికవి తిరువళ్ళూరిలో నివసించాడు. ఆయన

కుమారుడు వీరరాఘవయ్య మట్ల అనంతరాజు కొలువులో చేరి మట్లవారి సీమకు వచ్చాడు. వారి సీమ కడపజిల్లా ప్రాంతంలో ఉండేది.

వీరరాఘవయ్యకు ఏడుమంది సంతానం కలిగారు. వారిలో జ్యేష్ఠుడు గోపాలకవి శాఖ గంగాపురానికి వెళ్లింది. చతుర్థుడైన వెంకటశౌరి శాఖ వట్టెం గ్రామానికి వచ్చింది. ఈ వేంకటశౌరి కుమారుడు వీరరాఘవకవి ''మధురవాణీ విలాసమ''నే మధురమైన ప్రౌఢ ప్రబంధాన్ని రచించాడు.

ఇక్కడినుండి వీరి శాఖ మళ్ళీ కర్నూలు జిల్లా నంది కొట్కూరు తాలూకాలోని బోయినికుంటకు వెళ్ళింది. అక్కడి నుండి వీరరాఘవ కవిపౌత్రుడు రామస్వామిశాస్త్రి మళ్ళీ వట్టెం వచ్చాడు.

ఈ విధంగా చింతలపల్లి వారెన్ని గ్రామాలు తిరిగినా వారికి వట్టెం గ్రామంతో సంబంధముండిపోయింది.

ఈ రామస్వామిశాస్త్రి పౌత్రుడు రామస్వామి శాస్త్రియే. అతడు వీరరాఘవ చరిత్ర సంస్కృతంలో చంపువుగా రచించాడు.

చింతలపల్లి వారి పిమ్మట ఈ గ్రామంలో చెప్పదగింది సంబరాజువారి కుటుంబం. వారు వట్టెం గ్రామానికి కరణాలు. హరితస గోత్రులు. ఆపస్తంబ సూత్రులు. కార్తవీర్యార్జునోపాసకులు. ఈ వంశానికి మూలపురుషుడు సంబరాజు. అతని పౌత్రుడు చెన్నమరాజు. అతనికి ముగ్గురు కుమారులు కలిగారు. వారిలో పెద్దవాడు నారసింహుడు. అతని ప్రపౌత్రుడు సంబరాట్క్మేషహి 'పరమ భాగవతాంబరీషవిలాసమనె' ప్రౌఢ ప్రబంధాన్ని రచించాడు.[6]

చెన్నమరాజు కుమారుల్లో తక్కిన యిద్దరిపేర్లు తెలియ లేదు కాని ఈ వంశంలో తిరుమలరాయడనే కవి 'రాధాకృష్ణ విలాసం' అనే కావ్యం రచించాడు[7]. మరో కవి వట్టెం నివాసి నరసింగరాజు'లాలి ప్రహరి' అనే సేవా ప్రబంధాన్ని, అతని పుత్రుడు రామచంద్రుడు 'సుపాణినీ పరిణయమ'నే అచ్చతెనుగు కబ్బాన్ని రచించారు.[8]

ఇప్పటికీ వంశంలో నలుగురు కవులు కనిపిస్తున్నారు. ఈ వంశం ప్రస్తుతం వట్టెంలో లేదుగాని ఈ తాలూకాలోని వెలుగొండ, లట్టిపల్లి, కేతెపల్లిలో ఉన్నారు. ఇక్కడినుండి ఓ శాఖ దేవరకొండ తాలూకాలోని గౌరవరానికి వెళ్లింది. ప్రస్తుతం వారుండే గౌరవరానికి సంబరాజు గౌరవరమనే రూఢి.

ఈ గ్రామంలో పేర్కొనదగిన మరో పండిత కుటుంబం పాపకవిగారిది. వీరు చాత్తాద వైష్ణవులు. శ్రీవత్స గోత్రులు. వీరి యింటిపేరు తిరునగరివారు.

పాపకవి తండ్రి నరసింహకవి. ఆయన అనిరుద్ధవిలాసం, విలాసవతీ పరిణయం అనే యక్షగానాలు, అనంతవ్రతకల్పం, తిరు మంగ యాళ్వారు చరిత్ర అనే కావ్యాలు రచించాడు. వీనిలో ఏవీ ముద్రణ పొందలేదు.

ఈయన కుమారుడు పాపకవి. ఇతనికి 'పసపద్యకవి' అని బిరుదుండేది. ఇతని కృతి – ఆనందరామాయణం. కవిగారు గ్రంథ ముద్రణకు చందాలకోసమై తిరిగేకాలంలో సాధుజనంలో అతనికి తారసపడిన ఓ వ్యక్తి అతని దగ్గరినుండి పుస్తకాన్ని హరించుకు వెళ్ళాడట. అలా అదిపోయిన తరువాత పాపకవికి మతి [illegible] దని చెబుతారు.

ఆనందరామాయణంగాక ఈతడు విజయవిలాసం, కృష్ణ తులాభారమనే యక్షగానాలు, వేంకటేశ్వర శతకం, సీతారామాంజ నేయ శతకం అనే శతకాలు రచించాడు. ఈ శతకాలు ముద్రణ పొందాయి.

పాపకవిగారి కుమారుడు నరహరికవి. ఆయన ఏతుర్భాషా ప్రవీణుడు ఆశుకవితలో మంచిధారగలవాడు! ఈతని కృతి నారదా చలమహాత్మ్యమనే స్థలపురాణం. ఈ కావ్యంలో నారదాచలం పైన వెలసిన శ్రీ వెంకటేశ్వరోదంతం ఉంటుంది. ఇది ముద్రణపొందింది.

ఈ విధంగా ఈ గ్రామంలో పెక్కు పండిత కుటుంబా లున్నాయి. వారి వివరాలు తెలిసినంతవరకు తెలిపాము.

మాకు యింకా ఈ వ్యాసంలో అప్పకవి తాతగారి [illegible] సోమయ్యగారు గ్రహవాధను పోగొట్టిన యింటిని గురించి, అప్పకవి మామగారు పెద్దిభట్టుకు కామేపల్లిని అగ్రహారంగాయిచ్చినసాయప వేంకట భూపాలుని గురించి, అమరావాదకు వీరరాఘవాచార్యులను గొనివెళ్ళిన దొరలను గురించి, స్పష్టమైన వివరాలు తెలియలేదు. అలాగే సంబరాజువారి వంశంలోని కవులందరు ఒకే వంశానికి చెందినవారవునో! కాదో! వంశవృక్ష వివరాలు తెలియలేదు కాబట్టి పైవిషయాలు పరిశోధకులకు వదులుతున్నాము.

## అధోజ్ఞాపికలు

(1) భారతి 1965. June – పే – 85
(2) భారతి 1965 May
(3) మరుగుపడిన మాణిక్యాలు
(4) ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం పే. 257 (మొదటి సంపుటం)
(5) ధర్మరక్ష. 1973 Sept (మహబూబ్‌నగర్ జిల్లా పత్రిక)
(6) భారతి 1968 May P. 65
(7) భారతి 1968 Jan P. 48
(8) భారతి 1972 April P.59

# కొమర్రాజు వెంకటలక్ష్మణరావు జీవిత చరిత్ర

ఆధునిక యుగమున ఆంధ్రుల సర్వతోముఖ సాంస్కృతిక పునరుజ్జీవనమునకు హేతుభూతులైన మహాపురుషులు ముగ్గురు. సార్వత్రికముగా వచన ప్రక్రియల నన్నింటిని వ్యాప్తిలోనికి తెచ్చి ఆంధ్ర సాహిత్య పునరుజ్జీవనము నొనరించినది కందుకూరి వీరేశలింగము. ఆంధ్రపత్రిక మూలమున యావదాంధ్రలోకమును నొకటిగా దిద్ది తీర్చి జాతీయ పునరుజ్జీవనము గలిగించినది కాశీనాధుని నాగేశ్వరరావు. ఆంధ్రజాతిలో సాంస్కృతిక పునరుజ్జీవనము కావించినది కొమర్రాజు వెంకటలక్ష్మణరావు.

ఈ ముగ్గురిలో కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారి జీవిత చరిత్రయే ప్రస్తుత గ్రంథము.

## గ్రంథరచనావశ్యకత

గ్రంథరచయితలైన డాక్టరు రమాపతిరావుగారు, రచనా సందర్భమును నిట్లు ప్రస్తావనలో చెప్పినారు:

"కొమర్రాజు లక్ష్మణరావుగారిని గూర్చి ఒక జీవిత చరిత్ర వ్రాయాలన్న నా కోర్కె ఆయన శతజయంతిని పురస్కరించుకొని మరింత బలపడింది. లక్ష్మణరావు పంతులుగారిని గూర్చి సాధికారమైన, సమగ్రమైన జీవితచరిత్రను ఇంగ్లీషులో జి. కృష్ణగారు రచించారు.........ఇప్పుడు నేను వ్రాసిన గ్రంథం కృష్ణగారి కను వాదంకాదు. నాకు తెలీని విషయములు వారినుంచి తెలుసుకున్నాను. అంతమాత్రమే. శ్రీ కృష్ణగారు వారు వ్రాసిన గ్రంథాన్ని నన్ను వదవనివ్వడమేగాక విలువైన సమాచారం నే నుపయోగించుకోవ డానికి కూడా అనుమతించారు. వారికి నా కృతజ్ఞతలు మరీ మరీ చెప్పవలసి ఉంది".

## ప్రస్తావన

పై దానినిబట్టి యీ గ్రంథమునకు ప్రధానాధారము, శ్రీ కృష్ణగారి ఆంగ్లగ్రంథమే యనుట నిర్వివాదాంశము. అయితే లక్ష్మణరావుగారి శతజయంతిని గూర్చి కొంత చెప్పవలసియున్నది.

## లక్ష్మణరాయ శతజయంతి

లక్ష్మణరాయ శతజయంతి (1976)ని పురస్కరించుకొని నేను 'లక్ష్మణరావుగారి జీవిత చరిత్ర'ను వ్రాసితిని. అది–

1) కొమర్రాజ లక్ష్మణరావు జీవితము తెలుగు.

2) కొమర్రాజు లక్ష్మణరావు జీవితము ఇంగ్లీషు అని రెండు భాషలలో నున్నది.

ఆంధ్ర ప్రభుత్వము వారికి పై రెండు గ్రంథములను పంపితిని. కాని వారే చర్యను తీసికొనలేదు. కొంత కాలమైన వెనుక నా గ్రంథములను రెండింటిని నాకు తిరిగి పంపినారు.

లక్ష్మణరావుగారిని స్వయముగా నెరిగినవారిలో నొకడ నగుటచేత నేను వారిని గూర్చి, వారి కుటుంబమును గూర్చి పరిశోధన చేయుచుంటిని. నా యదృష్టవశమున లక్ష్మణరావుగారి తండ్రిగారైన వెంకటప్పయ్యగారికి అంకితమైన "సేతు మహాత్మ్యము" అను పద్య కావ్యము లభించినది. అందు కొమర్రాజువారి 'సంపూర్ణ వంశచరిత్ర'గలదు. ఇది వరదరాజు నందికేశ్వరశాస్త్రి రచితము. అముద్రితము. నేడు తిరుపతి ప్రాచ్య పరిశోధనాలయమున నున్నది.

అందరి విషయములేగాక, లక్ష్మణరావుగారి బావమరదులు, వారితో నిరువది యేండ్లుగా సాహిత్య విషయముల నన్ని హితులునగు శ్రీ వానూరి వీరభద్రేశ్వరరావుగారి వద్దనుండి యనేక యమూల్యాంశములను, శ్రీ లక్ష్మణరావుగారిని గూర్చి వ్రాత మూలముగా గ్రహించి నా గ్రంథమున చేర్చితిని. నేను విజ్ఞాన చంద్రికా పరీక్షలతో సంబంధ మున్నవాడనగుటచేత, లక్ష్మణరావుగారి మరణమునకు వెనుకవిజ్ఞానచంద్రికామండలి పునరుజ్జీవనము– గ్రంథప్రకటన – వీని సంపూర్ణ వివరములనునొనగితిని. లక్ష్మణరావుగారితో, సంబంధించిన సాహిత్య వ్యక్తులందరిని గూర్చి సంగ్రహముగా చెప్పితిని. ప్రామాణికంగా సర్వవిధముల సమగ్రముగా సంతరించితిని.

ప్రస్తుత గ్రంథమును ప్రకటించిన విశాలాంధ్ర వారికికూడ నా గ్రంథమును పంపితిని. కారణమేమియు తెలుపకయే వారు దానిని తిరిగి నాకు పంపివేసిరి.

రమాపతిరావుగారి గ్రంథమున 11 శీర్షికలున్నవి. అందు 'జీవితయాత్ర' అను శీర్షికలో కొమర్రాజువారి వంశ వివరణ

---

కొమర్రాజు వెంకటలక్ష్మణరావు జీవిత చరిత్ర, రచయిత : డాక్టరు అక్కిరాజు రమాపతిరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. వెల రూ. 4–50.

మున్నది. ఇదియెంత యస్తవ్యస్తముగా నున్నదో గ్రంథమునుండి వాక్యముల నుదాహరించి, చూపుచున్నాను.

"16వ శతాబ్దికి చెందిన కొమర్రాజు ఈ వంశానికి మూల పురుషుడు. ఆయన కరిణీకం చేసేవాడు. ఈయునగారిమునిమనవడు వెంకటనారాయణ క్రీ. శ. 1740లో శైవమతదీక్షను స్వీకరిం చాడు. అప్పుడాయన పేరు శంకరుడుగా మార్చుకోవడం జరిగింది. ఈయనగారు శ్రీశైలం చుట్టూముమ్మారుప్రదక్షిణలుచేసినట్లు చెబుతారు ఆ నాటినుండీ కూడా ఆ కుటుంబమువారు ఆరాధ్యశైవ సంప్రదాయాన్నే అనుసరిస్తూ వచ్చారు. [పుట11]

[i] శంకరుడు కొమర్రాజు మునిమనుమడు కాదు. అతని కెనిమిదవతరమువాడు.

[ii] "కొమర్రాజు అనే వంశకర్త దగ్గరనుండి 11-వ తరంవాడైన లక్ష్మణరాయడు దేశ పాండ్యా అధికారాన్ని పొందడం జరిగింది ... చందూలాల్‌ద్వారా యీ పదవి అధికారము లక్ష్మణ రాయుడికి ప్రాప్తించాయి. అమరావతి సంస్థానాధిపతియైన రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయడుగారికి లక్ష్మణరాయడు మంత్రిగా ఉండేవాడు ఈయన సోదరులు నాగేశ్వరరావుగారు అమరావతి జమీందారు దగ్గర గొప్ప ఉద్యోగమేచేస్తూ ఉండేవారు."పుట. 11

పై వాక్యములన్నియు న ప్రామాణికములు. కొమర్రాజు వారి వంశ వివరములు తెలుసుకోకుండ వ్రాసినవి. నాగేశ్వరరావు లక్ష్మణరాయని తండ్రి గాని సోదరుడుకాడు. ఆతడే – అమరావతి వాసిరెడ్డివారియొద్ద మంత్రి. లక్ష్మణరాయడు చందూలాల్ మంత్రి. నాగేశ్వరరావు శంకరుని కొడుకు. శంకరుని భార్యయగు బుచ్చమ్మవలన జన్మించినవాడు.

"ఆశాతోదరి గాంచెను
శ్రీశైలపతిన్ సదాత్మశీలుని మరి రా
జేశామాత్యుని వెస నా
గేశుని మువ్వురను లోకహితమతిరతులన్"

వారిలో నాగేశుడు

"సలలిత వాసిరెడ్డి కులచంద్రుడనందగు వెంకటాద్రి రా
ట్త్రేకము మంత్రిత సుధీజనులెన్న వహించె"

(సేతు మాహాత్మ్యము)

## కొమర్రాజువారి వంశావళి

[లక్ష్మణరాయ సంకలితము]

కొమర్రాజువారి వంశావళిని లక్ష్మణరావుగారే చారిత్రక ముగా సమకూర్చినారు. ఆ వంశావళి అముద్రితము. దాని సంపూర్ణ వివరములన్నియు నా గ్రంథమున నిచ్చియున్నాను.

## ఒకే వంశమున నాలుగు తరముల మంత్రులు

నా గ్రంథములోని వంశావళి ప్రకారము నాగేశుడు వాసిరెడ్డివారియొద్ద, లక్ష్మణరాయడు చందులాల్‌వద్ద మంత్రు లుగా నున్నట్లు తెలియుచున్నది గదా! లక్ష్మణరాయని కొమారుడు వెంకటప్పయ్య (లక్ష్మణరావుగారి తండ్రి) మునగాల రాజలైన నాయనివారియొద్ద మంత్రి. ఆ వెనుక – కుమారుడు లక్ష్మణ రావు నాయని రంగారావుగారివద్ద మంత్రి. అప్పటికాతని వయస్సు 24 ఏండ్లు మాత్రమే.

ఇట్లొకే కుటుంబమున నాలుగు తరములు మంత్రి పదవి నిర్వహించినది కొమర్రాజువారి వంశమొక్కటే. ఇది ఆంధ్రదేశ రాజకీయ చరిత్రలో ప్రత్యేకముగా పేర్కొనదగిన యంశము.

## లక్ష్మణరావు జనన సంవత్సరము శతజయంతి

"1877 సంవత్సరం మే నెల 18 వ తేదీని లక్ష్మణ రావు జన్మించాడు." (పుట 13)

"లక్ష్మణరావు జననము 18-5-1876"అని నా గ్రంథ మున గలదు. ఇచట నెల, తేదీలలో భేదము లేదు. సంవత్సరము వద్దనే భేదము గలదు. నా గ్రంథము లక్ష్మణరావుగారి బావమరది యైన కానూరి వీరభద్రేశ్వరరావుగారి యొద్ద కొన్ని నెలలుంచితిని. వారి దాని నామూలాగ్రముగ పరిశోధించినారు. నేనిచ్చిన జనన తేది 18-5-76 వారు మార్చలేదు.

లక్ష్మణరావు దివంగతుడైన తరువాత అన్నింటియందును ఆతని జననము 1876 అనియే గలదు.

## లక్ష్మణరావు విద్యాభ్యాసము నాగపూరు నివాసము

లక్ష్మణరావుగారి తలిదండ్రులనుగూర్చి, ఆయన విద్యాభ్యాస మును గూర్చి వ్రాసిన విషయములు (13-14 పుట) పరస్పర విపర్యాసములతో నున్నవి. అవి యన్నియు నిశ్చితములై తేదీలతో నున్నను గ్రంథకర్త వానిని చూడకపోవుటచే నీ వ్యత్యస్త మేర్పడి నవి. అది యంతయు నుదాహరించుట గ్రంథవిస్తర భీతి యగును గాన కొన్ని వాక్యముల నుదాహరించి విమర్శించుచున్నాను.

1) "లక్ష్మణరావుకి రెండేండ్లు నిండగానే తండ్రి పరమ పదించాడు. వెంకటప్పయ్యగారికి లక్ష్మణరావు ద్వితీయ వివాహపు సంతానం. ప్రథమ కళత్ర వియోగంలో ఆయన గంగమ్మగారిని చేసుకోవడం జరిగింది." లక్ష్మణరావు పుట్టడానికిముందే ఒక

మూడురుపుట్టింది వారికి. వెంకటప్పయ్యగారికి — ప్రథమ కళత్ర వియోగము జరుగనులేదు. ద్వితీయ వివాహము అగుటయు లేదు. ఆయనకు ఇద్దరు భార్యలు. అప్పమాంబ, గంగాంబ.

> "అతని యర్ధాంగి యప్పమాభ్యానభాటి"
> "ఆ సతిమణి గాంచె నిత్యాభివృద్ధి
> దనర శంకర లింగాభిధాన సుతుని"
> "రెండవ సతి గంగాంబిక"
>
> (సేతు మాహాత్మ్యము)

సేతు మహాత్మ్యము వేంకటప్పయ్యకు ప్రథమ కళత్ర వియోగము సంభవించినట్లు చెప్పలేదు.

పాఠకులకు విశదముగా నుండుటకు వివరములు తెలుపుచున్నాను—




(2) "బండారు మాధవరావుగారు లక్ష్మణరావుగారికి మేనమామ. అప్పుడు పి. డబ్ల్యు డి. శాఖలో ఇంజనీరుగా పనిచేస్తూ నాగపూర్‌లో ఉండే వారు."

"గంగమ్మగారు ఇద్దరు పిల్లలను తీసుకొని నాగపూర్ చేరింది."

"ఇంతలో మాధవరావుగారికి భార్యా వియోగం సంభవించింది (లక్ష్మణరావుగారి అక్కగారైన) అప్పమాంబగారిని మేనమామకు యిచ్చి వివాహం చేశారు" (పుట 14)

పై వాక్యములను బట్టి-అప్పమాంబ వివాహము—నాగపూర్ చేరిన తరువాతనే జరిగినదని స్పష్టము. ఇది యెంత మాత్రము సరికాదు. ఆ వివాహము అంతకు ముందే జరిగినది. ఆ వివరములివి:

వెంకటప్పయ్యగారు—క్రీ. శ. 1880లో మరణించినారు. అప్పటికి అప్పమాంబ వయస్సు 6 సంవత్సరములు. ఆమె జననము 1874.

భర్త పోయిన తరువాత గంగమ్మగారు తన ముగ్గురు పిల్లలను తీసుకొని, సవతి కుమారుడైన శంకరరావు వద్ద దేవరకొండలో నుండెడిది. అప్పట నున్న వారి రెండేండ్లకూ అనగా క్రీ.శ. 18 2లో మాధవరావుగారికి భార్యా వియోగము కలిగినట్లు ఆమెకు తెలిసినది. వెంటనే తన కుమార్తె—ఎనిమిదేండ్లవయస్సుగల అప్పమాంబను యిచ్చి పెండ్లి చేసినది. ఈ వివాహము దేవరకొండలోనే జరిగినది.

మాధవరావుగారికి మొదటి భార్య చనిపోవు నాటికి "మీనా" అను రెండేండ్ల కూతురు గలదు. మాధవరావుగారికి ఆడ దిక్కు లేకపోవుటచేత గంగమ్మగారు చిన్నపిల్ల అప్పమాంబను, లక్ష్మణరావును తీసుకొని నాగపూర్‌న స్థిర నివాస మేర్పరుచుకొనినది. ఇందువలన అటు మాధవరావుగారికి, ఇటు గంగమ్మగారికి—రెండు కుటుంబముల వారికి అభ్యుదయము చేకూరినది

3) "నాగపూర్‌లో లక్ష్మణరావు మరాఠీ మాధ్యమం ద్వారా విద్యాభ్యాసం చేశారు. 1900 సంవత్సరాని కల్లా ఆయన మారిస్ కాలేజీలో చదివి పట్టభద్రుడయ్యాడు."

లక్ష్మణరావు మెట్రిక్యులేషను వరకు మరాఠీ భాషయే చదివినను, కళాశాలా తరగతుల యందు మాత్రము మరాఠీ చదువలేదు. అతడు సంస్కృతము ద్వితీయ భాషగా గ్రహించి, ఎఫ్. ఏ, బి. ఏ. రెండింటి యందు కృతార్థుడైనాడు. ఆయన ఎమ్. ఏ. పట్టము కలకత్తా విశ్వవిద్యాలయమున సంస్కృతము, తత్త్వ శాస్త్రము ప్రధానముగా పొందినాడు. ఆ కాలమున నాంగ్ల పట్టభద్రులలో నింత నిస్తులమగు సంస్కృత పాండిత్యము గలవాడు లేడని పేరు గడించినారు.

## లక్ష్మణరావు - తిలక్

లక్ష్మణరావుకు మహారాష్ట్ర విద్వాంసులతో పరిచయము గలిగించినది పర్ణశాలాస్థల నిర్దేశము. దీని చేతనే మహారాష్ట్రమున నాతని కీర్తి స్థిరమైనది కాని యింత ముఖ్య విషయమును గూర్చి యొక గ్రంథమున నొకవాక్య మున్నది. అది పి.వి. రాజ్వాడే అను మహారాష్ట్ర విద్వాంసునితో మొదలైనదని కందు. కాని అది తప్పు. క్రీ. శ. 1899 సంవత్సరమున మహారాష్ట్ర దేశమున బాలగంగాధర తిలకు రామాయణమున చెప్పబడిన పర్ణశాల మహారాష్ట్ర దేశములో నాసిక్ త్ర్యంబకము వద్ద గలదని ఒక వాదము లేవ నెత్తినాడు. అది ఆయన మరాటా పత్రికలో ప్రకటితమైనది.

మహారాష్ట్ర దేశమున నేమా పెమా అందరు నీ వాదమున పాల్గొని—పర్ణశాల మహారాష్ట్రమునందే గలదన్న తిలకు వాదమును అంగీకరించిరి.

లక్ష్మణరావు అప్పటికి 22 ఏండ్ల యువకుడు మాత్రమే. ఈ వాదమును నామూలాగ్రముగా పరిశీలించినాడు. వివాదరంగములోనికి దిగినాడు. వాల్మీకము పర్ణశాలా ప్రదేశమేగాక, ఆ సమీపముననే గోదావరినది కూడ కలదను మూలమునుబట్టి నిరూపించినాడు. ఆ ప్రదేశములను వాల్మీకి వర్ణించిన వర్ణనలను బట్టి - అది నాసిక్ త్ర్యంబకమువద్ద లేదనియు, ఆంధ్రదేశమున నేడు గోదావరీనదీ తీరమునగల భద్రాచల క్షేత్రమునకు సమీపమున నున్న "పర్ణశాల"యే యని సోపపత్తికముగా నిర్ణయించినాడు.

దీనితో మహారాష్ట్ర విద్వల్లోకమాశ్చర్య చకితమైనది. ముఖ్యముగా తిలకునకు లక్ష్మణరావు పరిచయము గలిగించినది

పర్ణశాల వాదమే. మహారాష్ట్ర వచన రచనలో తనతో సమానుడని తిలకు గుర్తించినాడు. నాటినుండియు వారిరువురకు గాఢ మైత్రి సమకూడినది. లక్ష్మణరావు తిలకు అనుయాయి యైనాడు.

## గ్రంథమున విడువబడిన యంశములు-

పైని వివరించిన పర్ణశాలాస్థల నిర్దేశమే కాదు. మఱి, కొన్ని ముఖ్యవిషయము లిందు విడువబడినవి.

## విజ్ఞాన చంద్రికామండలి పునరుద్ధరణము

క్రీ. శ. 1924లో—అనగా లక్ష్మణరావు దివంగతుడైన మఱుసటి సంవత్సరమే—"విజ్ఞానచంద్రికామండలి" పునరుద్ధరింపబడినది. దీనికి ముఖ్యులిరువురు— 1. అయ్యదేవర కాళేశ్వరరావు-- 2. దిగవల్లి వెంకటశివరావు —

ఈ పునరుద్ధరణము లక్ష్మణరావు సంకల్పించిన పని పూర్తిచేయుటయేగాక — అప్పటికే దేశ స్వాతంత్ర్య సమరము ముమ్మరముగా సాగుచుండుటచేత — స్వాతంత్ర్యచరిత్రనుగూర్చిన గ్రంథములు ప్రకటింపబడినవి

ఈ పునరుద్ధరణమున — 15 గ్రంథములు వెలువడినవి. వాని వివరములు నా గ్రంథమున గలవు. కొన్నియిచ్చుచున్నాను.

## దిగవల్లి వెంకటశివరావు

1. దక్షిణాఫ్రికా చరిత్ర 2. అధినివేశ స్వరాజ్యము 3. ఆంగ్ల రాజ్యాంగము.

## మానికొండ సత్యనారాయణశాస్త్రి

1. వైదిక నిలయము 2. బౌద్ధ యుగము 3. ఆంగ్ల రాజ్యస్థాపనము.

రెండు భాగములు

## వెన్నేటి సత్యనారాయణ

ఫాహియాన్‌భారత వర్షయాత్ర —

## ఆత్మకూరి గోవిందాచార్యులు

భారతదేశము—ఆర్థిక చరిత్ర (రెండు సంపుటములు)

## అయ్యదేవర కాళేశ్వరరావు

1. ఫ్రెంచి స్వాతంత్ర్య విజయము 2. తురుష్క స్వాతంత్ర్య విజయము 3. అమెరికాసంయుక్తరాష్ట్రములు.

## 2. పారిభాషిక పదనిర్మాణము

నేడు దేశభాషలలో విద్యాభ్యాసము గావింపబడుచున్నది. నేటి ప్రభుత్వమునకు పారిభాషిక పదనిర్మాణమొక సమస్యగా నున్నది. ఇప్పటి కిరువదేండ్ల క్రిందటనే లక్ష్మణరావు దేశభాషలలో విద్యాభ్యాసము గావింపవలెనని చాటినాడు 'విజ్ఞాన చంద్రికా మండలి'లో తాను ప్రకటించిన శాస్త్ర గ్రంథములన్నింటికి చివర ఇంగ్లీషుపదములతో తెలుగు పారిభాషిక పద పట్టికలనిచ్చి యున్నాడు. నవీనయుగమున పారిభాషికపద స్వీకరణకు కృషిచేసిన ఆద్యులలో లక్ష్మణరావు గారొకరు.

## 3 విజ్ఞాన సర్వస్వము

విజ్ఞాన సర్వస్వము సంపాదకత్వము వహించుటయేగాక ప్రధానముగానున్న వ్యాసములు అవివది. విని వివరములిందులేవు. ఇవి ప్రత్యేక సంపుటముగా ప్రకటింపబడలేదు. అట్లు ప్రకటించిన లక్ష్మణరావు విశ్వతోముఖ విజ్ఞానము వ్యక్తము.

## 4. అముద్రిత రచనలు

"ఆంధ్ర" అను నిని గూర్చి లక్ష్మణరావు ఒక గ్రంథమే వ్రాసినారు. అది అముద్రితము ముద్రితము కావలెను.

లక్ష్మణరావు విశ్వతోముఖ ప్రజ్ఞాశాలి, ఉదార దర్శనుడు, విజ్ఞాన తపస్వి. జీవిత కాలమున ప్రతి రక్తకణమును, ఆంధ్రుల విజ్ఞాన ప్రసారమునకై ధారపోసిన మనీషి. అట్టి మహాపురుషుని జీవిత చరిత్రయందు అతని ఆదర్శమూర్తి ప్రతిఫలింపవలెను. గ్రంథము ప్రామాణికముగా సంతరింపబడవలెను. అప్పుడే ఆ రచన సార్థకమగును. లేనియెడల జీవిత చరిత్ర రచనా ప్రయోజనము సాధింపనేరదు.

ప్రస్తుత గ్రంథమునగల 125 పుటలలో లక్ష్మణరావుగారి జీవితము రేఖామాత్రముగా వ్రాయబడినట్లు కనబడుచున్నది. డా. రమాపతిరావుగారు తెలుగు దేశములోని సుప్రసిద్ధ నవలా రచయితలు. డాక్టరు పట్టమును పొందిన తరువాత రచనా వ్యాసంగమును చాలించినవారివలె గాక ముఖ్యముగా జీవిత చరిత్రలు వ్రాయుటయందు వారు ప్రత్యేకశ్రద్ధ వహించి అనేకాంశములను సేకరించుచున్నారు. లక్ష్మణరావుగారిని గూర్చి ప్రత్యేకముగా విశ్వవిద్యాలయములో పి. హెచ్.డి. పట్టము కొరకై పరిశోధన చేయుచున్నట్లు విన్నాను. ఏమైననేమి ముందుగా లక్ష్మణరావుగారి వ్యాసములన్నియు గ్రంథావళిగా ప్రకటితము కానప్పుడు వారి బహుముఖ ప్రజ్ఞాపాటవముల మనకు ప్రత్యక్షముగా గోచరించవు.

— కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# సిముక సాతవాహనుడి నాణాలు

సిముకుని నాణాలు దొరకటం ఇదే మొదలు. మొత్తం భారతదేశ చరిత్రకే యివి బయల్పడటమొక గొప్ప విశేషం. ఆంధ్ర సాతవాహన రాజ్యస్థాపకుడైన సిముకుడి పేరు వినటమేకాని ఆ రాజుదిగా చెప్పదగిన శాసనంగాని, నాణెంగాని యింతకాలంగా ఏదీ దొరకక పోవటంతో చారిత్రకంగా ఈ నాణాల విలువ అతిముఖ్యమైంది. కరీంనగరుజిల్లాలో గోదావరికి కుడిగట్టున పడుబడిపోయిన కోటలింగాల అనే కుగ్రామానికి చెందిన పొలాల్లో ఈ నాణాలు ఇటీవలనే బయల్పడెను. గోదావరి కావల యున్నది ఈ గ్రామానికెదురుగా ఆదిలాబాదు జిల్లాలో చేరిన లక్సెట్టిపేట తాలూకా నగరం వుంది. ధర్మపురి వాస్తవ్యులు, కరీంనగరులో పోస్టలు డిపార్టుమెంటులో పనిచేయుచున్న నా మిత్రులు శ్రీ సంగనభట్ల నరహరి గారు ఈ నాణాలతోపాటు మరికొన్ని అపూర్వమైన నాణాలను కూడా సేకరించి గడచిన జనవరిలో నా కొసగిరి. అదే నెలలో మద్రాసులో జరిగిన ఇండియన్ ఎపిగ్రాఫికల్ సొసైటీ సమావేశములో ఈ నాణెములనుగూర్చి పరిశోధనాత్మక పత్రమును చదివితిని. దాని సారాంశముతో గూడిన విశేష తెలుగువ్యాసమిది.

శ్రీ నరహరిగారు నాకొసగిన నాణాలలో 8 సిముకునివి; 12 సాతవాహనునివి; 18 సాతకర్ణివి; 10 గోభద్రునివి; 38 స్వామిగోపునివి; 20 ఇతర నాణాలు కూడయున్నవి.

సిముకుని 8 నాణాలలో ఒక్కటి మాత్రము పోటెన్ అనబడు మిశ్రలోహపుది. మిగిలినవన్నియు రాగివి. వానికి మొదటి వైపున యెడమవైపుకు నిలబడియున్న యేనుగు కలదు. రెండిటిలో మాత్రము తొండము పైకెత్తబడియున్నది. పోటెనునాణెముమీద ఏనుగుముందర చెట్టుగుర్తుకలదు. మరొకదానిపై శ్రీవత్సచిహ్నము కలదు. త్రికోణాత్మక పతాక గుర్తుకూడ మరిరెండు నాణెములపైన గలదు. అంటికి రెండవవైపున ఉజ్జయిని చిహ్నము, స్వస్తికములు గలవు. వాటి ఆకృతి దాదాపు చతురస్రమువలెను. భుజముల పొడవు 11 మిల్లిమీటర్లనుండి 16 మిల్లిమీటర్ల వరకు ఉండును. బరువులు 1.3 గ్రాములనుండి 2.3 గ్రాముల వరకు గలవు. అన్నియు అచ్చులతో ముద్రించినవే. మొదటి వైపున ఏనుగు బొమ్మపైన 'సిరిఛిముక సాతవాహ' అని బ్రాహ్మీలిపిలో వ్రాయబడియున్నది. ఒకదానిపైన ఆ పేరుకు ముందర 'జో' అనే అక్షరంకూడా కానవచ్చుచున్నది. దీన్నిబట్టి పూర్తి పేరు 'రజో సిరిఛిముక సాతవాహన' లనుకొనవలెను. అంటే సిముకుడీ నాణెములలో కొన్నిటినైనా తను స్వతంత్ర రాజైన పిదపనే యిచ్చి యుండుననుకొనవలెను.

పై జెప్పిన గుర్తులన్నియు ప్రాచీనకాలపు 'పంచిమార్కు' నాణాలమీద, రాజ నామాంకితములైన నాణాలమీద అప్పటప్పట మనదేశము నందంతట కానవచ్చుచుండును. కనుక సిముకుడీ గుర్తులను ప్రత్యేకించి యే ప్రయోజనము కొరకు వాడెనో చెప్పుట కష్టము. ఏనుగు రాజుల ఘనతను తెలుపు చిహ్నము. స్వస్తికము, శ్రీవత్సము మంగళసూచకములుగా అన్ని మతముల వారు ఆనాడు స్వీకరించిన గుర్తులు. వృక్షము బోధివృక్షమును తెలుపునని కొందరు తలంచెదరు. త్రికోణాకారపు గుర్తును కొందరు ధ్వజచిహ్నమని చెప్పుదురు. ఉజ్జయిని గుర్తు అనగా ప్లస్ గుర్తుకి నాలుగువైపుల రెండేసి యేకకేంద్రవృత్తములుండును. దీనిలో అనేక ప్రభేదములు కూడ కలవు. దీనికి ఉజ్జయిని గుర్తు అను పేరెందులకు పెట్టిరో, దాని నెందులకు నాణాలపైన వాడిరో సరిగా తెలియదు. వింధ్య పర్వతప్రాంతములో దొరకిన నాణెములపై నిది తరచు కానవచ్చుటచేత దీనికి ఉజ్జయిని గుర్తు అని కన్నింగహామ్ పేరిడెను. దాని నట్లే వాడుచుండిరి. సాతవాహనుల నాణెములంటిపైన సాధారణముగ ఈ గుర్తు కనుపించును. కనుక ఈ గుర్తులవల్ల తెలియవచ్చే రాజకీయ విశేషములేవి ప్రస్తుతం మనకు తెలియవు.

ఈ నాణాలపైనున్న ఛిముకుడనే పేరు సాతవాహన రాజులలో మొదటివాడైన సిముకునిదే. నానఘాట్ గుహలో కొన్ని శిల్పప్రతిమలపైన ఆయా వ్యక్తుల పేర్లు కూడ కలవు[1]. నాగనికయను సాతకర్ణి భార్య ఆ ప్రతిమలను మలిపించి ఆ పేర్లు వ్రాయించెనని పలువురు చెప్పిరి. అందులో మొదటి బొమ్మపైనున్న పేరు 'రాయా సిముక సాతవాహనో' అని యున్నది. తర్వాత 'దేవి నాయనిక', 'రాఞో సిరిసాతకని' లనే పేర్లు కూడ కలవు. సిముక సాతవాహనుని పేరు తెలియటం దీనిని బట్టియే. ఈ రాజ సాతవాహన వంశములోని మొదటి రాజైయుండునని కూడ దీనివలన తెలియుచున్నది. పురాణాల్లో సాతవాహన వంశస్థాపకుని పేరు సిన్ధుక, శిశుక, ఛిస్మక అని పలువిధములుగా చెప్పబడెను. ఈ నాణాల మీద ఛిముక అనియున్నది. ఆది ఛిస్మక అనే పురాణనామంయొక్క వికృతి కావచ్చును. పురాణ వ్రాతగాని దోషము వలన 'ఛిముక' యనునది 'ఛిస్మక' అని కూడ మార్పునొందుటకు తావు లేకపోలేదు. కనుక నానాఘాట్‌లోని సిముకుడు, పురాణంలోని ఛిస్మకుడు ఈ నాణాలమీది ఛిముకుడు ఒక్కరేయగుదురు. సాతవాహనరాజవంశంలో వేరొక ఛిముకుడున్నట్లు ఇంతవరకుతెలియదు.

ఇంతవరకు ఈ కొత్త నాణాలు గూర్చిన విశేషములు చెప్పబడెను. వాటిని ముద్రించిన రాజు సాతవాహన వంశస్థాపకుడైన సిముకుడేయగునని కూడ చెప్పితిమి. ఇంక అన్నిటికంటె ముఖ్యమైనది కాలనిర్దేశము. అంటే యీ నాణాలుముద్రింపబడిన కాలమును స్థూలముగానైన చెప్పుట చరిత్రపరిశోధనలో ముఖ్యమైన అంశము. ప్రస్తుతమిచట రాజు పేరుండనేయున్నది గనుక ఆ రాజ

కాలమే నాణెకాలమని సులభముగా చెప్పవచ్చుననుకొనుటకు వీలు లేదు. కారణమేమనగా సిముకుడి రాజ్యకాలమే యింతవరకు సరిగా నిర్ణయము కాలేదు. అట్టిస్థితిలో రాజునుబట్టి నాణాల కాలాన్నికాక నాణాలనుబట్టి రాజుకాలాన్ని నిర్ణయించవీలగునేమో చూడవలసి యున్నది. కాలనిర్దేశము చేయుటలో శాసనములందు కాని, నాణెము లందుకాని అక్షరములయొక్క పరిణామమును పోల్చుకొని వాటి కాలాన్ని స్థూలంగా చెపుతారు. అది అంత నిశ్చయంగా నమ్మతగి నట్లుండదని కూడ వారే చెపుతారు. అయినప్పటికి అశోకుని నాటి లిపి క్రమక్రమంగా ఎట్టిమార్పులు చెందుతూ వచ్చిందో పోల్చు కుంటూ అక్షరాలే కాలానికి చెందినవో చెప్పటానికి కొంతయైనను వీలుండును. క్రీ పూ. 250 నాటిదైన అశోకలిపికంటెనుమారు నూటపాదికయేండ్ల తర్వాత ప్రతిష్ఠించబడిన బేస్‌నగర (విదిశా నగర) సమీపమందున్న గరుడస్తంభశాసన లిపితో[2] ఈ నాణె ముల లిపిని పోల్చిచూచిన కొంత కాలవ్యవధి స్పష్టముగ కాన వచ్చును. ఈ స్తంభము తక్షశిలానగర రాజగు అంతియల్సి రాజు యొక్క దూతగా కాసీపుత్రుడగు భాగభద్రుని యొద్దకు వచ్చిన హెలియొడొరసు అను భాగవతుని చేత ప్రతిష్ఠింపబడినట్లు చెప్ప బడెను. ఇందు చెప్పబడిన విదిశరాజైన భాగభద్రుడు శుంగవంశము నకు చెందిన అయిదవరాజగు భద్రఘోషుడని కొందరు,ఏడవరాజని కొందరు చెప్పుదురు. కాని శుంగరాజనిమటుకు అందరు అంగీకరిం చిరి. అశోకుని తర్వాత నతని సంతతివారు నలుగురు రాజులు పాలించిన తదుపరి బృహద్రథుడను వానిని చంపి పుష్యమిత్రుడు క్రీ. పూ. 180 ప్రాంతమున శుంగవంశమును స్థాపించెను. అతడు 36 యేండ్లు పాలించెను. తర్వాత అతని పుత్రుడు అగ్నిమిత్రుడు, అతని పుత్రుడు సుజ్యేష్ఠుడు, తర్వాత వసుమిత్రుడు, ఆ తర్వాత అయిదవ రాజైన భద్రకలేక భాగభద్రుని 14 వ రాజ్యవత్సరమున బేస్‌నగర గరుడ స్తంభము ప్రతిష్ఠింపబడెను. అందుచేత మౌర్యవంశ పతనానంతరము అంటే క్రీ. పూ. 180 తర్వాత కనీసమొక 60లేక70యేండ్ల తర్వాతది ఆ స్తంభశాసనము కావలెను. దాని లిపి అశోకలిపిలోకంటె యెక్కువ సామ్యము కలిగి యున్నది. ఈ నాణెముల లిపి అక్షరాలు దాని కంటె యింకా 60 లేక 70 యేండ్ల వ్యవధిని సూచిస్తున్నవి. ముఖ్యముగ '[illegible]' 'ఫ' 'క' వర్ణములు విశేషించి అర్వాచీన కాలమును తెలుపుచున్నవి. అంటే నాగనిక వ్రాయించిన నానాఘాట్ శాసనంకంటె కూడ అర్వాచీన లక్షణము ఈనాణెముల అక్షరములందు కానవచ్చును. అయినను; సి, రి, ధి; అనే అక్షరాల మీద నున్న ఇకార గుడి అక్షరంపైన కుడి వైపు కొక అర్ధ వంకర గీతవలె మాత్రమున్నది. ఇది అశోకలిపి లక్షణం. నానాఘాట్ అక్షరాల్లో ఇది మరల పైన యెడమవైపుకి వంపు తిరిగి యిప్పటి ఇకార గుడిని పోలియుండును. ఇది ముఖ్యముగ ప్రాచీన లక్షణమే యగును. 'ఫ' అక్షరము కూడ తర్వాత కాలములో పెద్ద మార్పునొందెను. నాణెములను ముద్రించుటకై తయారు చేసెడి అచ్చులు ప్రత్యేకముగ నిపుణులచే చేయబడును. వారు అక్షరములను అందముగ నుండునట్లు శ్రద్ధగా వ్రాయుట సహజము. శాసనములందట్లు శ్రద్ధగాకాక మామూలుపాతవిధానము



1, 2, 3 నాణెములు ఛిముక సాతవాహనుడివి; 4 గోభద్రుడిది; 5, 6, 7 సమగోపుడివి;
8 సాతవాహనుడిది (దీని రెండవ వైపున సమగోపుడి నాణెములపైన రెండవ వైపున గల నందిపాద లేక త్రిరత్న చిహ్నములు చూడదగును.)

లోనే అక్షరములు మలచబడును. కనుక నానాఘాట్ శాసన లిపి కంటె ఇందలి అక్షరములు అర్వాచీనతను తెలుపుచున్నవనుటలో నిదియే కారణము. శాసనములు వ్రాయువారు నాణెములు కొరకుచేయు అచ్చులను తయారు చేయు వారివలె నిపుణులు కానక్కర లేదు. కనుక ఈ నాణెములను బేస్‌నగరశాసనానికి తరువాతవిగాను, నానాఘాట్ శాసనానికి కొద్ది పూర్వపువిగాను స్వీకరింప వచ్చును. అంటే వీటిని సుమారు క్రీ. పూ. 50–40 మధ్యకాలమునకు చెందినవిగా చెప్పవచ్చును. పైజెప్పిన ఇకారగుడి యొక్క ప్రాచీన లక్షణమును బట్టి వీటిని ఇంత కంటె తర్వాతకు తీసుకొని వచ్చుట కష్టము. వీటి తర్వాత 30 యేండ్ల వ్యవధిలోనే నానాఘాట్‌లో నాగనిక వేయించిన శాసనములు కాదగును.

నాణెములపై నున్న పేర్లను, ఉజ్జయిని గుర్తును పురస్కరించుకొని కూడ వీటికి అదే కాలము (క్రీ. పూ. 50–40మధ్య) యుక్తమనితోచును. 'రణాసిరి సదవహన' అను పేరున్న కొన్ని నాణెములను గూర్చి డా. పరమేశ్వరిలాల్ గుప్త యీ విధముగ జెప్పెను: ''పేర్లతోగూడిన నాణెముల ముద్రణ క్రీ. పూ. రెండవ శతాబ్దంలో గాని మనదేశంలో ప్రారంభము కాలేదు. మొదట నగరములపేర్లు, తర్వాత రాజులపేర్లు వ్రాయుట క్రమముగ వాడుకలోనికి వచ్చెను; ఆ తర్వాతకాని రణా, సిరి, ఇత్యాది విశేషణములు కూడ వాడబడుచుండెను; అంతేగాక సాతవాహనులు తమ నాణెములన్నిటిమీద తప్పకుండ వాడుచు వచ్చిన ఉజ్జయిని గుర్తు (లనగా + ప్లస్ గుర్తుకి నాలుగు కొనలందు నాలుగు వలయముల నుంచుట) పంచిమార్కులు గల కొన్ని రాగి నాణాల మీద మాత్రం అరుదుగ కానవచ్చెడివి. ఇట్టివి క్రీ. పూ. రెండవ శతాబ్దిలో తుది భాగంలో కాని వాడుకలోనికి రాలేదు. సాతవాహన నాణాలమీద ఈ గుర్తు క్రీ. పూ. ఒకటవ శతాబ్దిలో మాత్రమే వాడబడింది.''[3]

ఇట్లే డా. అజయమిత్రశాస్త్రి కూడ సాతవాహన నాణెముల కాలమునుగూర్చి సుదీర్ఘమగు నొక వ్యాసమును ప్రకటించిరి.[4] మహారాష్ట్రములోని నెవసా యనుచోట త్రవ్వకములలో వెలువడిన కొన్ని నాణెముల కాలనిర్ణయమును చర్చించుచు త్రవ్వకములోని భూమిలో నేర్పడు పొరలను (Strati graphy) బట్టి సాతవాహన రాజ్యకాల ప్రారంభము క్రీ. పూ. మొదటి శతాబ్దిలో మధ్య భాగముకంటె ముందుకి పోజాలదని నిష్కర్షచేసిరి. ఈ సందర్భమున వారు కాళిదాసు రచించిన 'మాళవికాగ్నిమిత్ర' కథలోని చరిత్రాంశమునుగూడ గ్రహించి పుష్యమిత్రుడు రాజ్యముచేయుచున్న కాలములో (క్రీ. పూ. 187–151) వాని పుత్రుడగు అగ్నిమిత్రుడు విదిశలోనుండ విదర్భ రాజగు యజ్ఞసేనునితో కలహము సంప్రాప్తమయ్యెను. యజ్ఞసేనుడోడిపోయి పుష్యమిత్రునికి సామంతుడుగ నుండుట కంగీకరించెను. దీనివలన క్రీ. పూ. 150 వరకు శాతవాహనులు విదర్భలో నుండిరనుట కెట్టి తావు లేదు. ఆ తర్వాత సుమారు 84 యేండ్లు శుంగులు, వారి తర్వాత కాణ్వులు కొంతకాలం పాలించిన తర్వాతగాని సిముకుడు స్వతంత్రుడు కాలేదు. అంటే పుష్యమిత్రుడి తర్వాత 150–84 కొందరి కాణ్వుల కాలముపోగా క్రీ. పూ. 50–40 మధ్యనే సిముకుని స్వాతంత్ర్య స్థాపన జరిగియుండునని చెప్పదగును. Dr. Sircar సుమారు క్రీ. పూ. 30 లో సిముకుడు రాజ్య స్థాపన చేసియుండునని నిర్ణయించిరి.

ఈ సందర్భమున పురాణములను కూడ కొంతవరకు గ్రహింపదగును. పురాణములలో భవిష్యద్రాజవృత్తాంతములనే పేరులో కలియుగ రాజవంశావళులు కొన్ని చెప్పబడెను వాటిలో ననేక లోపములున్నను, మౌర్యుల తర్వాత వంగులు శుంగుల తర్వాత కాణ్వులు రాజ్యము చేసినట్లున్నది. వీరి తర్వాత సుశర్మయను నాలుగవ కాణ్వరాజును ధిక్కరించి (అధికారమునుండి తొలగించి) ఆంధ్రజాతీయుడైన సిన్ధుకుడు రాజయ్యెనని యున్నది. ఇచట మత్స్య పురాణ శ్లోకము లిట్లున్నవి:

చత్వారస్తు ద్విజాహ్యేతే కాణ్వా భోక్ష్యన్తి వై మహీం.
చత్వారింశత్పంచచైవ భోక్ష్యన్తీమాం వసున్ధరామ్।
ఏతే ప్రణత సామన్తా భవిష్యా ధార్మికాశ్చయే
యేషాం పర్యాయ కాలేతు భూమిరాన్ధ్రాన్ గమిష్యతి॥[4]

[నలుగురు ద్విజాన్వయ కాణ్వరాజులు రాజ్యమేలెదరు. వారు 45 యేండ్లు భూమిని పాలింపగా సామంతులు ప్రణతులుగ నుందురు. వారు ధార్మికులు. వీరి పర్యాయ పాలనయందు భూమి ఆంధ్రులకు చెందును.]

ఇందు గమనింపవలసిన విషయ మొకటి గలదు. వీరు పర్యాయ పాలన చేయునపుడు భూమి ఆంధ్రులవశమగును అనునది చాల ముఖ్యమైన సూచన. పర్యాయ పాలన మనగానేమి? మామూలు క్రమము ననుసరించి పాలించుట యగుచో అట్లు చెప్పనక్కరలేదు. ఒకే రాజ్యమును ఇరువురు లేక యెక్కువమంది ఒకే కాలములో రాజ్యముచేయుట యని అర్థమగుచున్నది. వీరి రాజ్యకాలము మొత్తము 45 యేండ్లగుటవలన వారిలో చాల పర్యాయంగా రాజ్యము చేయుచుండిరనుటకన్న వేరే రాజవంశము వేరేప్రాంతములో రాజ్యమేలుచుండగా కాణ్వులు మగధలో రాజ్యం చేస్తున్నట్లు చెప్పటకు వీలగుచున్నది వింధ్యకు దక్షిణ దేశములో కొందరు వంగరాజులింకా పాలించుచుండి యుందురు. వారికి లోబడిగాని, మగధలోని కాణ్వులకు లోబడికాని సాతవాహనులు ఆంధ్రప్రాంతము నేలుచుండియుందురు. దూరముగనున్న సార్వభౌములక్రింద వీరి సామంతత్వము చెప్పతగినంతది కాదు. అంటే పేరుకుమాత్రం సామంతులు. ఇట్టి స్థితిలో కాణ్వులలో తుదిరాజగు సుశర్మ విదిశలో స్వతంత్రులైయున్న శుంగులను లోబరచుకొనుటకై దక్షిణ దండయాత్ర చేసియుండును. అప్పుడు సాతవాహన సామంతుడగు సిముకుడు (లేక సిసుకుడు, సిన్ధుకుడు) సుశర్మను ధిక్కరించి వెనుకకు తరిమివేయుటయే గాక సన్నిహితులైయున్న వంగరాజును కూడ ఓడించి స్వతంత్రుడై యుండును. దీనిని తెలుపు పురాణశ్లోకమిట్లు కలదు:

కాణ్వాయనం తతోభృత్యః సుశర్మాణం (ణః)ప్రసహ్య తం॥
శుంగానాంచైవ యచ్ఛేషం క్షపిత్వాతు బలీయసః
శిశుకోన్ధ్ర' స్సజాతీయః ప్రాప్స్యతీమాం వసున్ధరామ్॥[5]

[కాణ్వాయనుడగు సుశర్మను బలాత్కారముగ (ధిక్కరించి), మిగిలిన శుంగరాజుల అధికారమును రూపుమాపి బలవంతుడగు శిశుకుడను ఆంధ్ర జాతీయుడు భృత్యుడు భూమిని పొందును.]

శిశుకుడు కాణ్వులతోపాటు సేవించిన శుంగులను కూడ ఓడించెనని దీనివలన స్పష్టమగుచున్నది. అంతే కాణ్వులతో పాటు కొందరు శుంగులుకూడ భృత్యుడు (సామంతుడు)గ నున్న శిశుకునికి శత్రువులు. పైన చెప్పిన పర్యాయ పాలనమున కిదియే అర్థము కాగలదు. అంటే కాణ్వులు మగధలో రాజ్యం చేయుచుండగా విదిశలో శుంగులు స్వతంత్రులుగ తమ పతనానంతరము కూడ రాజ్యమేలుచుండిరి. సిముకుడు వారిరువురిని ఓడించి స్వతంత్రుడాయెను. మగధను ఆక్రమించుకొన్నట్లు మనకు సాక్ష్యమేదియు లేదు. కాని అవన్తిని సిముకుడు తన రాజ్యములో చేర్చుకొనెనేమో. కనుక సిముకుడు స్వతంత్రుడగుట క్రీ. పూ. 50–40 మధ్యనే. అనగా క్రీ. పూ. 185 ప్రాంతములో మౌర్యుల పతనానంతరము శుంగుల 112యేండ్లు కాణ్వుల కొందరి రాజ్యకాలము గడిచినపిదప జరిగియుండును. ఈ నాణెములప్పటి కాలమునే సూచించుచున్నవి.

ఈ సందర్భమున మరియొక అంశము చెప్పవలసియున్నది. ఈ సిముకుని నాణాలతోబాటు అదే కోటలింగాల పొలాల్లో మరి రెండు క్రొత్త రాజుల నాణాలు కూడ దొరకినవి. క్రొత్త రాజులనగా వారిదివరకు చరిత్ర తెలియనివారు. వారిలో ఒకరు 'రాఞో గోభద్ర' మరియొకరు 'రాఞోసామగోప'. వీరి పేర్లెక్కడ చరిత్రలో కానరావు. నాణెముల తీరునుబట్టి యివి సిముక నాణాలకంటె పూర్వమునాటివి. వీరిద్దరు స్వతంత్ర రాజులుగనే యుండిరి. గోభద్రుని నాణెములపైన స్వస్తికము, విల్లు, బాణము, గుర్తులు కలవు. రెండవవైపున ఏమియులేదు (blank). సామగోపుని నాణాలు ఐదారు రకములుగ నున్నవి. కొన్నిటి మీద విల్లు, బాణము, త్రికోణపుపతాక ; కొన్నిటిమీద చెట్టు, త్రికోణపుపతాక; కొన్నిటిమీద వృషభము, చెట్టు కలవు. అన్నిటికి రెండవవైపున రెండు ఏకకేంద్ర వలయముల చుట్టు నలువైపుల నందిపాదములు లేక త్రిరత్న చిహ్నములు గలవు.

ఈ గోభద్రుని, సమగోపుని కడపటి శుంగరాజులనుటకు తగిన అవకాశము కలదు. పురాణములందు చెప్పబడిన శుంగరాజులలో ఈ పేర్లు కానరావు. అట్లే బేస్‌నగర స్తంభశాసనంలో చెప్పబడిన భాగభద్రుడి పేరు కూడ కనుపించదు. అయినను కాశీపుత్ర భాగభద్రుని ఘోషుడనబడే ఐదవరాజుగా సూచిస్తుంది. అతనికే యింక ఆంధ్రక, భద్రక, ఓద్రుక, ఆర్ద్రక అని యింకా కొన్నిపేర్లున్నట్లు పురాణాల్లో కనుపిస్తుంది.[6] మననాణెంమీది గోభద్రుడు కూడ భాగభద్రుడివలె భద్రకుడు కాదనుననే నమ్మకము కలుగుచున్నది. అతని రాజ్యకాలం చాలాస్వల్పమే. అంటే పురాణాల్లో రెండేళ్ళు మాత్రమే చెప్పబడింది. అయినను అతనిపేర్లలో ఆంధ్రకుడనేది అతనికి ఆంధ్రదేశముతోగల సంబంధమును సూచిస్తోంది అంటే రాజుకాకపూర్వం యువరాజుగ ఆంధ్రప్రాంతాన్ని పాలించియుండును.

కనుక అతనినాణాలు ఆంధ్రలో దొరకటం సంభవమేకాగలదు. ఇంక సమాగోపుడు. ఈ పేరుకూడ పురాణాల్లోలేదు. కాని 'సమాభాగ' అను పేరుగలరాజు 9వ శుంగరాజుగ పురాణాల్లో పేర్కొనబడెను. అతనినే 'సమాగోప' అని నాణెములపై వ్రాయించిరాయను అను మానము కలుగుచున్నది. ఈ రాజులు భాగవతులు. వారిపేర్లుకూడ వసుఘోషుడు, భద్రఘోషుడు, భాగవతుడు అని యున్నవి. బేస్ నగరములోని శాసనంకూడ గరుడస్తంభముపైన కలదు. మన నాణెములపైన ఈ యిరువురి పేర్లలోను 'గ' పదము కలిసి యుండుట, కొన్ని నాణెములపై వృషభము సిర్తించబడుట కూడ మనయూహకు తావొసగుచున్నవి. అట్టి యూహ అంగీకార్యముకాని యెడల యీ యిరువురి రాజులను కాణ్వులతో పర్యాయపరిపాలన మొనర్చిన విదిశశాఖకు చెందిన కడపటి శుంగరాజు అనవచ్చును. వారిపేర్లు పురాణాల్లో లేవనవలెను.

ఈ 'సమాగోప' నాణెములను గూర్చి మరొక ముఖ్యవిశేషము కలదు. వాటికి రెండవ వైపున త్రిరత్న చిహ్నములు కలవంటిమి. అదే విధముగ త్రిరత్న చిహ్నములు రెండవవైపున ముద్రించబడిన 'సిరి సాతవాహన' అని పేరుగల నాణెమొకటి యీ సేకరణలో కోట లింగాలలో దొరకెను. దాని మొదటి వైపున సిరిసాతవాహన పేరుగాక, చిన్న ఉజ్జయిని గుర్తు, స్వస్తికము, త్రికోణపు పతాక, చెట్టు, కలవు. వీటిలో ముఖ్యమైనది రెండవ వైపునున్న త్రిరత్న చిహ్నము సాతవాహనులు తమకు పూర్వరాజులైన సమాగోపుని నుండి గ్రహించియుండురనుట నిశ్చయము. సిముకుడు కూడ ఆచిహ్నమును తన కొన్ని నాణెములపైన ముద్రించి యుండును. అవి మనకు లభ్యము కాలేదు. సాతకర్ణిరాజు యొక్క నాణెములు కొన్నిటి మీద ఈ త్రిరత్న చిహ్నమున్నది. [7] కనుక మొదటి శాతవాహనరాజు లందరు ఈ త్రిరత్న చిహ్నమును తమ కొన్ని నాణెములపై ముద్రించుట వారు సమాగోపుని జయించి స్వాతంత్ర్యము స్థాపించు టను సూచించును. కనుక కాణ్వులు మగధనేలు నప్పుడు శుంగ రాజులు కొందరు విదిశలో స్వతంత్రులుగ రాజ్యమేలు చుండిరి. వారి రాజ్యములో ఆంధ్రదేశము నామమాత్ర సామంత రాజ్యమై యుండెను. సిముకుడు కేవలము ఆంధ్రదేశమునేలు సామంత మాత్రుడుకాదు. అతనికి సింధుకుడనే పేరునుబట్టి సింధుదేశములో కొంతకాలమైనను కాణ్వుల యొక్కగాని, శుంగులయొక్కగాని రాజ ప్రతినిధిగ పనిచేసియుండునని తోచును. ఆ రాజవంశములందు గల లోటుపాట్లు బాగా గుర్తెరిగిన వాడగుట చేత సరియగు అదను చూచి ఆ యిరువురిని ధిక్కరించి స్వతంత్రుడయ్యెను. మగధను ఆక్రమించెనని చెప్పజాలము. కాణ్వులు, శుంగులు నామమాత్రావ శిష్టులు కాగా పురాణ కర్తలు తమ రాజవంశావళిలో వ్రాయదగిన గొప్ప రాజవంశము ఆంధ్ర సాతవాహనులదేయయ్యెను.

సిముక సాతవాహనుని నాణెములు ఆంధ్రదేశములో దొరకుటను బట్టి సాతవాహనులు ఆంధ్రజాతీయులని చెప్పు పురాణ వాక్యములు సత్యములేయగును. ఈ నాణాలు దొరకిన కోట లింగాల తీరప్రాంతమునందున్న ధన కటకమునకు సుమారు 280 కిలోమీటర్ల దూరమున నున్నది. పశ్చిమముగా ప్రతిష్ఠానము 400 కి. మీ. పైగ దూరమున నున్నది. సాత వాహనులు ఆంధ్రదేశమునందు మొదటినుండి తుదివరకు రాజ్యము చేయుచుండిరను విషయమ మీ నాణెములు రుజువుచేయుచున్నవి. రాగినాణెములు సాధారణముగా ముద్రించబడిన తావులనుండి మిక్కిలి దూరప్రాంతములకు కొనిపోబడవను విషయుమందరు అంగీకరించినదే కనుక సిముకుడు కోటలింగాల ప్రాంతముననే తన స్వతంత్ర రాజ్యస్థాపన చేసియుండును. ఖారవేలుడు సాతకర్ణిని లెక్కచేయక పశ్చిమముగ కణ్ణబెణ్ణ (కృష్ణవెణ్ణ) వరకు దండెత్తి ముసికనగరమును పట్టుకొనెనని చెప్పబడిన హాథీగుంఫా శాసనమును బట్టి తీరప్రాంతముకూడ సాతవాహనుల యధీనమందున్నదని తెలియుచున్నది. మహామేఘవాహన బిరుదము కల కళింగాధిపతి ఖారవేలుని శాసనమొకటి యిటీవల ఏలూరు ప్రాంతమునందున్న గుంటుపల్లిలో దొరకుటచేత ఆ ఖారవేలుని దండయాత్ర తీరాంధ్రము వైపుననే జరిగెనని రుజువగుచున్నది.[8] పశ్చిమ మహారాష్ట్ర ములో శక, క్షత్రపుల దాడుల నరికట్టుటకై ప్రతిష్ఠానమును రాజధానిగ చేసుకొనిరి. వీటితో దొరకిన గోభద్రుని, సమాగోపుని నాణెముల వలన మౌర్యుల తర్వాత ఆంధ్రదేశములో శుంగులు పాలించిరా లేదా యను సందేహము తొలగిపోగలదు. సాతవాహనులు వారికి సామంతులైయుండగ, వారి యధికారము ఆంధ్రదేశములో చెల్లుచుండెనని యీ నాణెములు రుజువుచేయుచున్నవి.

సాతవాహన రాజ్యస్థాపన కాలమునుగూర్చి అనేక విధములగు వాదోపవాదము లింతవరకు సాగుచున్నవి. వాటినన్నిటిని యిచట వివరించుట సాధ్యముకాదు. కొందరు క్రీ. పూ. 3వ శతాబ్దిలోను, కొందరు 2 వ శతాబ్దిలోను, కొందరు 1వ శతాబ్దిలోను సాత వాహన రాజ్య మారంభమై యుండునని తెలిపిరి. ఈ నాణె ములనుబట్టి క్రీస్తుపూర్వము 50 ప్రాంతమున సిముకుడు సాత వాహన రాజ్యమును స్థాపించెనని చెప్పవచ్చును. అప్పటినుండి సుమారు 270 యేండ్లు అనగా క్రీస్తు తర్వాత 220 లేక 230 వరకు వారి సామ్రాజ్యమువిచ్ఛిన్నమగక సాగెనని చెప్పట యుక్తము.

## అ ధో జ్ఞా పి క లు

1 Arch. Survey of W. India. V. P. 64.

2 D. C. Sircar, Select Inscriptions, P. 88 Pl. XI.

3 JNSI., XVI-1, P. 87.

4 Coinage of the Satavahanas P. 103-109.

4 Dynasties of Kali Age. by Pargiter, P. 35.

5 Dynasties of Kali Age. P. 38.

6. The Age of Imperial unity. P, 98

7 JNSI VIII. P. 18

8 ఖారవేలుని గుంటుపల్లి బ్రాహ్మీ శాసనము.
డా. ఆర్. సుబ్రహ్మణ్యము.
ఆం. ప్ర. ఆర్కిలాజికలు ప్రచురణము, 1968.

# కలగూరగంప

## మంచనలో మార్క్స

కాకతీయ యుగమున సామాజిక వ్యవస్థను తెల్పు పదములు చాతుర్వర్ణ్యములు, అష్టాదశప్రజలు అనునవి. ఇవి కేవలము ఆయా వర్గములు చేయు వృత్తులనుబట్టి ఏర్పడిన వర్ణములు లేదా కులములు లేదా జాతులు (పదునెనిమిది జాతులు). స్థూలముగ చాతుర్వర్ణ్య విభజన సమాజానికి చెందిన విద్య, రక్షణ, ఉత్పత్తి, వినిమయము, సేవ అను ప్రాథమిక విధుల విభజనపై నాధారపడినది. అట్లే అష్టాదశప్రజలు అనుపేరు సమాజమున భిన్న ఉత్పత్త్యాది కార్యక్రమములను సూచించును.

అష్టాదశప్రజలు అనునది చాతుర్వర్ణ్య వ్యవస్థకు విస్తృతాన్వయమేనని కొందరి అభిప్రాయము.[1] ఇందు బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్ర వర్ణములు ఇతరములైన పదునాలుగు వర్ణములతో కలిపి పదునెనిమిది అయినట్లు మరికొందరి భావము.[2] కాని సోమదేవరాజీయమును బట్టి ప్రతాపరుద్రుని కాలమున బ్రహ్మ,క్షత్రియ, వైశ్య, [ఉత్తమ] శూద్రులు కాక పదునెనిమిదికంటె మిక్కిలిగ జాతులులేదా వర్గ [నానావర్గ జన]ము లున్నట్లు తెలియుచున్నది 3 ఈ అంశము ప్రత్యేకముగ పరిశీలింపదగినది.

ఏది ఏమైనను నానావర్గజన విభాగము ఆయా జన వర్గములు అవలంబించిన వృత్తుల విభజనపై నాధారపడినది. వర్ణమును బట్టి వృత్తియా ? లేక వృత్తిని బట్టి వర్ణ, కుల భేదములేర్పడియుండునా అను పరిశీలన యిట అప్రస్తుతము.

వర్ణ, కుల, వృత్తి ప్రసక్తి లేకుండ క్రీ. శ. 13వ శతాబ్ది ఉత్తరార్థానికి చెందిన మంచనయను తెలుగుకవి సమాజమును ఒక ప్రత్యేక కోణమునుండి పరిశీలించి విశ్లేషించినాడు. మంచన రాజనీతి శాస్త్రకారుడుగాని; ఆర్థిక తత్త్వ శాస్త్రకారుడుకాని కాదు. రసస్ఫోరకమైన కావ్యము నొకదానిని చెప్పుచు కృతిభర్త కోరికపై యెడనెడ సందర్భమును కలిపించుకొని ఉపకథల ద్వారా కొన్ని నీతులను జనులకు బోధించినాడు. ఈతని కృతియైన 'కేయూరబాహుచరిత్రము'నకు మూలము రాజశేఖరుని విద్ధసాలభంజిక యనియు, అయినను మంచన ఆ అంశము తనకృతిలో ప్రస్తావింపక మూలమునందలి స్థలముల, పాత్రల నామములు మార్చినాడనియు పీఠికాకారులభిప్రాయపడిరి.[4] ఏది ఏమైనను ఎక్కువ భాగమితడు కల్పించినదిగను, అందు వ్యక్తీకరింపబడిన భావము (కథావస్తువుతో సంబంధము లేనివి) ఇతనివిగనే స్వీకరింపదగును.

మంచన అటనట చొప్పించిన నీతికథలలో[5] నొకటి 'వివేకియైన చోరుని' కథ. అందొక విప్రుడు కర్షక జీవనపు ప్రాధాన్యతను, శ్రేష్ఠతను తెల్పుచోట మంచన ఒకే ఒక్క సీసపద్యమున లోకములోని ఆర్థిక జీవన విధానాన్ని విశ్లేషించినాడు. ఎక్కడో కథాభాగములో మారుమూల బిగింపబడిన మంచన ఆర్థిక విశ్లేషణా దృక్పథం ఇంతవరకు పరిశోధకుల దృష్టినాకట్టుకొనకపోయినను సంస్మరణ యోగ్యత కలిగియున్నది.

చరిత్రకు భౌతిక/ఆర్థిక వ్యాఖ్యానాన్నిచ్చిన ఘనత ఇంతవరకు ఒక్క కార్ల్ మార్క్సకే దక్కింది అని లోకప్రసిద్ధి. కానీ మంచన ఆర్థిక జీవనవిధానాన్ని ఆధారంగా చేసికొని లోకాన్నంతటినీ నాలుగు పాయలుగ విభజించుటయేగాక 'అపహరణ' అన్న ఒక్క పదంచేత ఆ పాయల మధ్యనున్న ఆర్థిక బాంధవ్యాన్నిఎంతో అద్భుతంగా సూచించాడు. ఒక శతాబ్దానికి పైబడి మొత్తం ప్రపంచాన్నే ఊపివేస్తున్న కార్ల్ మార్క్స ఆలోచనా సరణి రేఖామాత్రంగా ఇప్పటికి ఏడు శతాబ్దాలకు పూర్వమే భారతభూమిలో అందునను తెలుగునాట ప్రభవించిందని ఈ క్రింది పద్యం నిస్సంకోచంగా తెలియచెప్తుంది:

"ఈ లోకమింతయు నాలుగు పాలింటం
దొకట భిక్షకులు సోమకులు నొక్క
పాలు సేవావృత్తి బ్రతికెడు వారు వి
ద్యోప జీవికులును నొక్కపాలు
వ్యవహార మాడెడు వారుం దస్కరులును
నొకపాలు కర్షకు లొక్కపాలు
మొదలి పాళ్ళును మూడుం బిదపటి పాలన
యనవరతంబును నపహరించు
నపహరించియు నంతంత కవి సహించు
నపహృతంబయ్యు నది వృద్ధి నందుచుండు
గానం దను రాజు గరిగినం గరిసనంపు
జీవనముం బోల దొండొక జీవనంబు."[6]

ఇందు ప్రయోగింపబడిన 'సోమకులు'[6a] అను పదము ఏ తెలుగు నిఘంటువునందును కానరాదు.

సోమ అను పదమునకు శ్రమ, పరాక్రమము అనియు సోమము అను పదమునకు పరాక్రమము, తిప్పతీగ, జలము, కర్పూరము, దినముయొక్క పదునొకండవ భాగము.[7]

సోమక శబ్దానికి సర్. యం. మోనియర్ విలియమ్స్ ఇచ్చిన అర్థాలలో ఈ సందర్భానికి అనుగుణంగా ఉన్నవి—ఋషిసంబంధమైన (of a Rishi): రాజసంబంధమైన(of a king)వి.[8] దీనినిబట్టి సోమకులు అంటే యాజ్ఞికులు లేదా క్షత్రియులు అని తెలుస్తుంది. మొత్తం పద్యంలోని ముఖ్య ఉద్దేశాన్ని స్వీకరించి తదనుగుణంగా అన్వయించుకుంటే యాజ్ఞికులన్న అర్థమే సరియైనదిగ తోచును.

ఇంతః లోకమును నాలుగు పాయలుగ విభజించుటనుబట్టి, వరకు ఆయా పాయలలోని ఉపవర్గముల మధ్య సమాన లక్షణ ఒక్కొక్క పాయలో చేర్చిన జనవర్గమునుబట్టి చూచినచో కొంత మొకటి నిశిత పరిశీలనపై కనిపించును.

| వర్గము | ఉప వర్గాలు | జీవనాధారము | సమాన లక్షణము |
|---|---|---|---|
| మొదటి పాలు : | 1. భిక్షుకులు<br>భిక్షావృత్తిపై, ఇతరుల దాక్షిణ్యముపై నాధారపడి జీవించువారు | ఇతర జనుల దయ | దానము |
| | 2. సోమకులు<br>(a) యాజ్ఞికులు — ప్రభుసమ్మతమైన యజ్ఞ యాగాదులు నిర్వహించి దాన పరిగ్రహణము చేత జీవించువారు | ధర్మశాస్త్ర నిర్దేశిత దానపరిగ్రహణము | |
| | (b) శ్రమ పరాక్రమముచే జీవించువారు. ఇది సేవావృత్తిలోని భాగమే. రెండవ పాలునందు చెప్పబడినది కాన ఈ అర్థము స్వీకరించుట లేదు. | బల, శౌర్య సాహసములు | పక్షకులతో సమాన లక్షణమిట గోచరింపదు. |
| రెండవ పాలు : | 1. సేవావృత్తి బ్రతకెడువారు — ప్రభుతకు పౌర / సైనికసేవ (Civil and Military Service) మరియు ఇతర సంస్థలకు లేదా వ్యక్తులకు సేవ | ఆయా విధులను చేయుటలో నైపుణ్యము విక్రమము మొదలగునవి. | భృతి/ వేతనము/ పారితోషికము |
| | 2. విద్యోపజీవులు. అధ్యయన, అధ్యాపక విధులిందు గ్రాహ్యము, కవులు; పండితులు మొదలగువారు. | వారి ప్రతిభ పాండిత్యములు | |
| మూడవ పాలు : | 1. వ్యవహారమాడెడువారు : బేహారము / వ్యాపారము చేయువారు. ఇది లోకసమ్మతమై బహిరంగముగ లాభముల నార్జించు ప్రక్రియ. ఇది హద్దు మీరితే ఒకరకమైన దోపిడీగ మారుతుంది. | వస్తువులను కొనుటకు అమ్మటకు మధ్యనున్న తేడా లాభము (పరోక్షముగ) | లోకులను కొల్లగొట్టుట/దోపిడీ |
| | 2. తస్కరులు :<br>చోరులు — గుప్తముగ ఇతరుల ధనమును పొందువారు. | గుప్త లాభము (ప్రత్యక్షముగ) | |

అంటే ఈ మూడు పాయలలోని ఉపవర్గీకరణను, వాని సాధారణ లక్షణాన్నిబట్టి క్రమముగ సమాజము (నాల్గవ వర్గము మాత్రమే మంచన అభిప్రాయంలో) నుండి దానము పొందుటచేత సేవించి మెప్పించి వేతనము లేదా పారితోషికము భృతిగా పొందుట చేత; లోకులను ప్రత్యక్షముగనో, పరోక్షముగనో దోపిడీచేయుటచేత అందు సూచించబడిన జనవర్గములు జీవించునని తెలియుచున్నది.

నాల్గవ పాలు : కర్షకులు —

ఇందు ఉపవర్గములు లేవు — కృషి చేయు వారందరికి సామాన్య వాచిగ ప్రయోగము. | కేవలము వారిశ్రమ ఫలితము | స్వార్జితము

మంచన చేసిన సమాజ వర్గీకరణ, ఉపవర్గీకరణానుబట్టి లతని ఆర్థిక విశ్లేషణా దృక్పథము స్పష్టమగుచున్నది కేవలం జీవనాధారములైన అంశములను బట్టియే ఆ వర్గీకరణ జరిగినది.

మంచన కేవలము ఇట్టి వర్గీకరణతో విషయమును వదలక మనకు మంచనలో మార్క్స్ కనిపించుటెట్లు ? అందుకే ఆ వర్గముల మధ్య బాంధవ్యమును సమీక్షించినాడు. పై మూడు వర్గములు నాల్గవ వర్గమును అనవరతము అపహరించునట. ఇది నిత్య సత్యమైనట్లు వర్ణించాడు మంచన. కలిమిలేములనుబట్టి సమాజమును రెండు వర్గములుగా విభజించి; పై వర్గము క్రింది వర్గమును దోపిడిచేయుచు జీవిస్తుందని; అది కాలక్రమాన వర్గ సంఘర్షణకు దారితీస్తుందని; సిద్ధాంతీకరించిన మార్క్స్ ఆలో

నలు మంచన వ్రాసిన పద్యాన్ని చూచు నేటి చదువరులకు ధ్వనింపక పోవు.

అంతేకాక, పై మూడు వర్గాలు అపహరించుచున్నను అంతంతకవి నశిస్తాయట. మార్క్స్ పెట్టుబడిదారీ విధానం ధననాశన బీజాలను తానే ఉత్పన్నం చేసికొంటుందని; శ్రామిక వర్గపు అంతిమవిజయం విప్లవంద్వారా అనివార్యంగా సిద్ధిస్తుందని ప్రబోధిస్తే మంచన ఏ కార్యక్రమమును ప్రతిపాదింపక కాలానికే (క్రమానుగతమైన పరిణామానికే) పై మూడు వర్గములను నశింపజేయు ప్రక్రియను వదిలాడు. శ్రామికవర్గపు అంతిమ విజయం వర్గరహిత సమాజస్థాపనకు దారితీసి సమాజంలో సుస్థిర వ్యవస్థ నెలకొంటుందని మార్క్స్ సిద్ధాంతీకరిస్తే మంచన నాల్గవ వర్గం అపహరింపబడికూడ [స్వభావసిద్ధంగా] అభివృద్ధిపొందునని విశ్వసించాడు. కరిసనపు జీవనము అభివృద్ధి పొందవలెనంటే సరియైన రాజు/ పాలకుడు ఆవశ్యకమన్నాడు మంచన. ఇతరజీవనములైన దాన, భృతి, దోపిడి లమీద ఆధారపడిన విధానములు ఈ జీవనమునకు సాటిరావని మెత్తగ గర్హించాడు మంచన.

పారిశ్రామిక విప్లవ ఫలితంగా ప్రపంచంలో ఏర్పడిన అవ్యవస్థ కార్ల్ మార్క్స్ సిద్ధాంతానికి మూలకారణమైంది. అట్టి పరిస్థితులులేని మిక్కిలి సాంప్రదాయబద్ధమైన దేశంలో జన్మించి మంచన సమాజాన్ని ఆర్థికంగా విశ్లేషించాడంటే – 13వ శతాబ్దంలో భారతదేశంలో మార్క్స్ పుట్టేఉంటే ఇంతకన్నా అద్భుతంగా చెప్పగలడా ? అనిపించును.

## అ ధో జ్ఞా పి క లు


(1) డాక్టర్ సి. వి. పరబ్రహ్మశాస్త్రి సం భా ష ణ సందర్భంగా

(2) శ్రీ కుందూరి ఈశ్వరదత్తు, శాసనశబ్దకోశము,ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1967, పుట, 27.

(3) కూచిమంచి జగ్గకవి, సోమదేవరాజీయము, నరేంద్రనాథ సాహిత్యమండలి. 1967, పుటలు 114–116

(4) మంచన, కేయూరబాహుచరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1966, శ్రీ గడియారం రామకృష్ణశర్మ రచిత పీఠిక, పుట, 10.

(5) అదే, ప్రథమాశ్వాసము, పద్యము, 11.

(6) అదే, తృతీయాశ్వాసము, పద్యము, 309.

(6a) కేయూరబాహుచరిత్ర ఇతర ప్రచురణలును పరిశీలింపబడినవి. సోమకులు అను పదమునకు పాఠాంతరములు లేవు.

(7) శబ్దరత్నాకరము, 1937, పుట, 802

(8) Sir M. Monier williams, Sanskrit English Dictionary, New edition, 1963, P, 1251.


కుమారి చలివం సీత

## "శబ్దపల్లవాలు"

శబ్దపల్లవాలనుగూర్చి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు వ్రాసిన బృహద్ వ్యాసం ఏప్రిల్, మే నెలల 'భారతి' సంచికలలో చదివాను. వారి వ్యాసంలోని రెండు చారిత్రకాంశాలు వివాదాస్పదంగా కన్పించాయి.

### 1

''తెలుగు వ్యాకరణ చరిత్రలో శబ్దపల్లవ సంజ్ఞను మొట్టమొదట ప్రవేశపెట్టినవాడు అథర్వణాచార్యుడు. ఈ ఆచార్యుడు తిక్కన సోమయాజి కాలమువాడని, కొంచెము ముందైన కావచ్చునని చెప్పుతున్నారు. వికృతి వివేకము లేక అథర్వణ కారికావళి అని చెప్పబడే ఈయన గ్రంథంలో 29 వ కారికలో శబ్దపల్లవ ప్రసంగ తొలుదొల్త కనబడుతూ ఉంది'' అని ఏప్రిల్ 'భారతి' 37 వ పుటలో ఉంది కాని–

తెలుగువ్యాకరణ చరిత్ర సిద్ధాంత గ్రంథంగా సమర్పించి డాక్టరేట్ పట్టం పొందిన శ్రీ అమరేశం రాజేశ్వరశర్మగారు 'శారదామంజీరం' (గోటేటి ఈశ్వరయ్యగారి రజతోత్సవ సంచిక) లో 'కాణ్వ వ్యాకరణము' (పుటలు 117–123 సం. 1971) లనే పరిశోధనాత్మక వ్యాసంలో అథర్వణ కారికావళి యను నామాంతరము గల వికృత వివేకకర్త, అథర్వణుడు, భారత, లింగ శబ్దాను శాసనముల కర్త అథర్వణుడు భిన్నులని ప్రతిపాదించినారు. కాబట్టి తిక్కన సోమయాజికాలమునగాని, ఇంచుక పూర్వముకాని భారతాంధ్రీకరణమునకు పూరకొనిన అథర్వణుడు. వికృతి వివేకకర్త కాడని శ్రీ శర్మగారి సిద్ధాంతము.

అదేవిధంగా శబ్దపల్లవాల వ్యాసంలో 'శబ్దపల్లవం' అంటే ఏమిటో మొట్టమొదట తెలియజేయుటకు యత్నించినవాడువికృత వివేకటీకా కర్తయైన ద్వితింత్రిణి సీతారామకవి... ఆధునికవైయాకరణులలో పరవస్తు చిన్నయసూరిగారు దీనిని చూచి, పర్యాలోచన చేసియేకావచ్చును. ఇప్పుడు మనకు సుపరిచితమైన శబ్దపల్లవ నిర్వచనాన్ని సూత్రబద్ధం చేశారు ... విలక్షణార్థాధాయ కత్వమును ద్వితింత్రిణి సీతారామ కవిగారు గుర్తించి యుండగా ఈ యన దృఢపరచినాడు అని చిన్నయసూరికి రాదగినకీర్తిని ద్వితింత్రిణి సీతారామకవికి అంటగట్టినారు. ఈ రెంటచింతల సీతారామకవి 1854 లో బాల వ్యాకరణం అచ్చయిననాటికి ఊనషోడశ వర్ష ప్రాయుడని, బాలవ్యాకరణం చూసి, తానుపక్రమించిన వికృతి వివేక టీకా రచనలో సూరిగారి సూత్రములనే మక్కికి మక్కిగా

చేర్చుకొని వావిళ్ళ రామస్వామిశాస్త్రుల వారికి సమర్పించగా వారు దీనిని అచ్చువేసినారని పైన చెప్పిన శారదా మంజీరం 307–312 పుటలలో 'ద్విసంద్రతిగి సీతారామ కవి' వ్యాసంలో స్పష్టంగా వ్రాయడం జరిగింది.

మరి ఈ 'శారదామంజీరా'న్ని వ్యాసకర్తలు చూడలేదందామా అంటే ఆ సంపుటంలోనే ప్రొ. లక్ష్మీరంజనంగారు వ్రాసిన వ్యాసం 'వరంగల్లు జిల్లా: చరిత్ర – ప్రజలు' (పుటలు 241–46) అచ్చుపడ్డదే. అందుకనే మొదట్లో ఈ రెండు అంశాలు విడ్డూరంగా కనిపించాయని అన్నాను

చరిత్ర రచనా వ్యాసంగంలో వైపు వాటాలు ఎరిగిన నిరజాణలు, పెద్దలు అయిన వ్యాసకర్తలు శారదామంజీరానికి వ్యాసాన్ని వ్రాసి సమర్పించి, అచ్చయిన సంపుటం అందిన తరువాత దాన్ని తిరగవేసి ఉండరు. లేకపోతే లక్ష్మీరంజనంగారా! ఇటువంటి వివ్యాసాలు వ్రాస్తారు!

శ్రీ సుందరేశ్వర రావు

## అక్టోబరు 77 సంచికలో సోమసుందర్ విమర్శలోని నిజానిజాలు

ఒకనాడు తెలంగాణా రైతాంగ పోరాటాన్ని సమర్థిస్తూ, 'వజ్రాయుధం' లాంటి కవిత్వాన్ని వ్రాసి, 'ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు' నినాదాన్ని తెలుగువారి కందించిన శ్రీ సోమసుందర్, ఈనాడు 'కరపత్రాల దుమారం. తెరవెనుక భాగోతం'ను సమీక్షిస్తూ విప్లవ కమ్యూనిస్టుల్ని, విప్లవ రచయితల సంఘం వారినీ, తిట్టిపోశారు కమ్యూనిస్టు పోరాటాన్ని సమర్థించే అభ్యుదయ కవిత్వంతో, కవులుగా పైకి వచ్చి ఈనాడు సినిమా కవులుగా డబ్బు సంపాదిస్తూ, విలాసాల్లో మునిగేవారెందరెందరో కూడా ఇలాగే విప్లవ రచనల్ని అసహ్యించుకునే స్థితికి దిగజారారు.

కమ్యూనిస్టు పార్టీ చరిత్రను ఆయన తమ విమర్శలో ఉటంకించారు. పార్టీ లక్ష గ్రూపులయిందన్నారు. ఇనుగూ, ఏడు గురు గుడ్డివాళ్ళ కథను ఉదహరించారు. మార్క్సు వచ్చి ఇది మార్క్సిజం కాదర్రా అంటే ఆయన గెడ్డం గొరిగేస్తారట ఉగ్రవాదులు.

ఆయన అజ్ఞానానికి మనం చింతించాం. కమ్యూనిస్టు పార్టీ ఎలా ఎందుకు చీలిపోయింది. చరిత్ర పరిశీలించాం అలాగే కమ్యూనిస్టులు యిండియాలోనేనా, ఇంకేదేశంలో కూడా చీలిపోయారా అనేది చూడాలి.

తెలంగాణా పోరాటం ముమ్మరంగా సాగుతున్న సమయంలో పార్టీ కేంద్ర కమిటీ, సాయుధపోరాట పద్ధతిని వదలి పార్లమెంటరీ ప్రజాస్వామ్య పంథాను అనుసరిస్తున్నట్లు 1950 లో ప్రకటించింది. అయితే పార్టీలోని కొందరు దీన్ని వ్యతిరేకించారు. అప్పటినుంచి పార్టీ రెండుగా చీలిపోయినప్పటివరకూ ఆ విభేదాలు పార్టీలో వుంటూనే వచ్చాయి అంతేగాని 1963 లో పార్టీ ఒక్కసారిగా చీలిపోలేదు. విప్లవ కార్యాచరణకు ప్రజల్ని సమాయత్తం చేసే ప్రాతిపదికపై మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ బయటకు వచ్చింది కానీ ఆ నిర్ణయాన్ని వారు అనుసరించలేదు. అందువలన 1968 లో ఒక ప్రకటనద్వారా నాగిరెడ్డి వర్గీయులు విప్లవ కమ్యూనిస్టులుగా బయటకు వచ్చారు. 1969 లో పార్లమెంటరీ పంథాకు వ్యతిరేకంగా, తన యమ్. ఎల్. ఎ. పదవికి రాజీనామా యిచ్చి. అసెంబ్లీలో ప్రసంగించారు. ఆయన సిద్ధాంతం ప్రకారం, మనదేశంలో విప్లవం, దీర్ఘకాలిక రైతాంగ పోరాటంవల్లనే జయప్రదమౌతుంది. అధిక భాగం, పల్లెలో నివసించేవారు కాబట్టి, భూస్వామ్యదోపిడీ అనేక రకాలుగా సాగుతుంది కాబట్టి, రైతాంగం, వ్యవసాయ కూలీలు, మధ్యతరగతి ప్రజలు, తదితర శ్రామికవర్గం ఈ విప్లవంలో పాల్గొన గలరు.

అయితే, చారుమజుందార్ నాయకత్వం దీన్ని వ్యతిరేకించింది చారుమజుందారు వ్యక్తిగత హింసావాద సిద్ధాంతాన్ని విప్లవ సిద్ధాంతంగా ప్రచారం చేశాడు. ప్రజలలో పేరుకుపోయివున్న ప్రభుత్వ వ్యతిరేకత, భూస్వామ్య వ్యతిరేకత దీన్ని ఉధృతం చేసింది. ప్రభుత్వాలు, పత్రికలు 'నక్సలైటు' పదాన్ని తీవ్రంగా ప్రచారం చేశారు. ప్రజలకు విప్లవ కమ్యూనిస్టులంటే నక్సలైట్లే అన్న అభిప్రాయాన్ని కల్గించారు. అయితే ఈ వర్గశత్రు నిర్మూలన కార్యక్రమాన్ని నాగిరెడ్డి నాయకత్వంలోవున్న విప్లవ కమ్యూనిస్టులు మొదటినుంచీ వ్యతిరేకిస్తున్నారు. చర్చలు చాలా రోజులకు గానీ ఈ అయోమయ పరిస్థితి తొలగిపోలేదు. వర్గశత్రు నిర్మూలన కార్యక్రమం విఫలమవగానే చారుమజుందార్ వర్గీయులు (వీరిలో కూడా గ్రూపులుండటం గమనించాలి) జనతాపార్టీని లక్ష్యం పెట్టుకొని కాంగ్రెసు ఓడించే ధ్యేయమంటూ పార్లమెంటరీ పంథాలోనికి ఒక్కసారిగా దిగబడిపోయారు– తమ ప్రజా వ్యతిరేక పంథాని బయటపెట్టుకుంటూ, ఈ నాటికి కూడా ఒకటే ధ్యేయంగా నిలబడ్డ విప్లవ కమ్యూనిస్టులు, తమ సిద్ధాంతాన్ని కొనసాగిస్తున్నారు. దీర కాలిక రైతాంగ పోరాటం ధ్యేయంగా దేశంలోని విప్లవశ్రేణులన్నీ ఏకమై భారత విప్లవకారుల సమైక్యతా కేంద్రం (మా. లె) గా ఈ నాడు తమ పోరాటాన్ని ముందుకు తీసుకుపోతున్నాయి.

ఇకపోతే, సోమసుందర్‌గారికి, లక్ష గ్రూపుల్లో సి. పి. ఐ. కొత్తనచ్చింది. ఎందుకు? ఆ పార్టీ అత్యవసర పరిస్థితిని సమర్థించబట్టి. ప్రజలు ఎన్నికల్లో ఆ పార్టీని వ్యతిరేకించగానే అత్యవసరపరిస్థితిని సమర్థించుట తప్పు అన్నారు గనుక. మరల అసెంబ్లీ ఎలక్షన్లలో వచ్చినవే (ఒకచోట రెడ్డి కాంగ్రెసుని, మరో చోట ఇందిరా కాంగ్రెసుని) సమర్థించారు కాబట్టి. ఈనాటికి ఊరూ పేరూ లేకుండాపోయిన పార్టీగా శ్రీ సోమసుందర్‌గారికి సి. పి. ఐ. నచ్చింది. ఫర్వాలేదు. ఆయన ఒంటికి సరిపోయిన పార్టీనే ఆయన ఎన్నుకొన్నందుకు ధన్యవాదాలు అలాగే మార్క్స

గెడ్డం గొరిగిన విషయం. వీరు సమర్థించిన ఆ సి. పి. ఐ. మహానుభావులే మార్క్సిజాన్ని తిరగ వ్రాసి రివిజనిజంగా మార్చి, ఇదివరకే ఆ మార్క్సుగారి గెడ్డాన్ని గొరిగేశారన్న విషయం అందరికీ తెలుసుగదా !

ఏదిఏమైనా సోమసుందర్‌గారు గుర్తించనంత మాత్రాన విప్లవ కమ్యూనిస్టుపార్టీ — పార్టీకాకపోదు. వారిలో ఎన్ని గ్రూపు లున్నా నిజమైన పార్టీ ఏదో ప్రజలే గుర్తించగలరు.

తరువాత ఆయన వి. ర. సం. మీద విరుచుకుపడ్డారు వాళ్లల్లో ఎన్ని గ్రూపులున్నాయో, ఎవరే గ్రూపులో వున్నారో, వారేం కవిత్వం వ్రాస్తున్నారో తెలియదట. జ్వాలాముఖి గారు మాత్రం మార్మిక కవిత్వం వ్రాస్తున్నారని తెలుసునట. విరసం చరిత్రను కూడా పరిశీలించుదాం. ఒకప్పుడు తెలుగు ప్రజల జీవనాడిగా వెలుగొందిన అభ్యుదయ కవిత్వం రాను రాను పాలక వర్గాల జేబు సంస్థగా తయారయింది. అదీగాక 1967 తర్వాత దేశంలో ఒక నూతన సంచలనం వచ్చింది. దోపిడీకి వ్యతిరేకంగా రైతాంగం ప్రజలు పెద్దఎత్తున పోరాటాలకి దిగారు. దీనినుండి పుత్తేజం పొందిన అనేకమంది యువకవులు ఈ పరిణామాన్ని తమ కవిత్వంద్వారా ఆహ్వానించారు. అభ్యుదయ రచయితల సంస్థనుంచి బయటకొచ్చిన శ్రీశ్రీ, కొడవటిగంటి, కె. వి. రమణారెడ్డి తదితరులు, నాటి దిగంబరకవులు జ్వాలాముఖి, చెరబండరాజు, వరవర రావు మొదలైనవాళ్ళు, యింకా కొంతమంది విప్లవకవులు కలిసి విరసాన్ని స్థాపించారు. విరసంనుంచి పుట్టిన సాహిత్యం చాలమందిని ఉత్తేజితుల్ని చేసింది. వాళ్ళు ఏర్పాటుచేసిన మీటింగులకు కూడా జనం బాగానే రాసాగారు. అయితే విరసం చేసిన మొదటితప్పు, తమ సంస్థలో మార్క్సిస్టులైనవారికే స్థానం వుంటుందని తమ ప్రణాళికలో ప్రకటించడం. దీనివలన, మార్క్సిస్టులు కాని ప్రజా రచయితలకు విరసంలో చోటు లేకుండాపోయింది. అదీగాక, విరసం సాహిత్యంలో అధికభాగం, వ్యక్తిగత హింసావాదాన్ని సమర్థించేదే. కొంతమంది భూస్వాములను వ్యక్తులుగా హత్యలుచేస్తే విప్లవం జయప్రదం అవుతుందనే, ప్రజానుభవాలకు, వాస్తవిక ఫలితాలకు విరుద్ధమైన నినాదాలనే విప్లవ నినాదాలుగా చిత్రించటం జరిగింది. సరిగా చెప్పాలంటే చారుమజుందార్ వర్గ రాజకీయమే విరసం సాహిత్యంగా వర్ధిల్లింది. భూస్వాములకు, రైతాంగానికి సంఘర్షణలో ప్రధాన భాగమైన 'భూమి' సమస్యను వీరు తమ సాహిత్యంలో ఎక్కడా ఉదహరించలేదు. ప్రజా సమస్యలనుంచి దూరంగావున్న వీరి సాహిత్యం పోను పోను ప్రజలకే దూరమయింది.

విరసం ఐదవ మహాసభలు అనంతపురంలో జరిగాయి. ఆ మహాసభలోనే, విరసంనుండి జ్వాలాముఖీ, నిఖిలేశ్వర్, గుంటూరు జిల్లా శాఖ, ('విరసంలో విచ్ఛిన్నకుల కుట్రల్ని భగ్నం చేయండి, జనపదంలో సాంస్కృతిక విప్లవాన్ని తీర్చిదిద్దండి' అనే నినాదంతో పుస్తకాలను అచ్చువేసి, పంచిపెట్టారు) బయటకు వచ్చారు. అలాగే కడప జిల్లా శాఖ, 'విరసంలో చారుమజుందార్ గ్రూపు రాజకీయాల్ని బహిష్కరించండి' అంటూ చీలిపోయింది.

జ్వాలాముఖీ మరి నదముగ్గురు చేసిన ప్రకటనలో సాంస్కృతిక విప్లవానికి నాయకత్వం వహించాల్సిన సంస్థల నేటి దశలో. సామ్రాజ్యవాద వ్యతిరేక. భూస్వామ్య వ్యతిరేక శక్తుల ఐక్యవేదిక యిగా వుండాలని, సాంస్కృతిక విప్లవం జనపథంలో సాగాలని లాము అభిప్రాయపడుతున్నట్లుగా ప్రకటించారు. వీరంతా అతివాద దృక్పథంనుండి విడగొట్టుకొని రావడం, సాంస్కృతిక విప్లవాన్ని జనపథంలో నిర్మించాల్సిన అవసరాన్ని గుర్తించడం హర్షించదగినది. ఇది సోమసుందర్‌లాంటి వారు గమనించాలి. విరసంనుంచి ఏరి పోయాక జ్వాలాముఖీ,నిఖిలేశ్వర్‌లు ఏం కవిత్వం వ్రాస్తున్నదీతెలియ దంటున్నారు సోమసుందరుగారు.జ్వాలాముఖీ తదితరులు ఇంతవరకూ మరే సంఘాన్ని పెట్టినట్లు లేదుగానీ, వారి కవిత్వం 'ప్రజాతంత్ర', 'ఆంధ్రజ్యోతి'లాంటి పత్రికల్లో వస్తూనే వున్నాయి. వారి కవిత్వ నైజాన్ని తెలుసుకోవాలంటే అవి చదివి తెలుసుకోవచ్చును. సోమ సుందర్‌గారికి పత్రికలు చూడటం అలవాటు లేక తెలియకపోవచ్చు గానీ తెలుగు పాఠకులకు మాత్రం వారేం వ్రాస్తున్నదీ తెలుసు.

చేనేత వస్త్రాలయం దగ్గర జేబురుమాళ్ళు ఉచితంగా పంచి పెడుతున్నారంటే జనమంతా అక్కడేవుంటారట. పోలీసులు లాటీ చార్జీ ప్రారంభిస్తే ఒక్క పిట్ట మళ్ళీకనిపించదట. ప్రజల్ని, జేబు రుమాళ్ళు ఉచితంగా ఇస్తామని పిలిచి లాటీచార్జీ జరిపే ప్రభుత్వం మనది. దీనికి ప్రజల తప్పేంవుంది. నిర్బంధాలకు ధడిసి, అభ్యుదయ కవిత్వం అంటేనే ఆమడదూరంలో వుంటున్న శ్రీ సోమ సుందర్ గారికి, అందరూ తనకులాగానే కనపడతారు కాబోలు. విరసంపుట్టిన దగ్గర్నుంచే కాదు అంతకు ముందుకూడా, మన ప్రభుత్వంవారికి కాకి అరిస్తే చాలు ధడధడలు మొదలయ్యేయి. వెంటనే పోలీసుబలగం 'విప్లవం' అనే మాటవ్రాసిన ప్రతిరచయితనీ జైల్లో తోసేవారు. (మనదేశ ప్రజలు ఏ సాహిత్యాన్ని చదవాల్సిందీ నిర్ణయించేది మన పోలీసు పెద్దలు, అనేవిషయం మనకు తెలుసు) విప్లవం గురించి ఓనమాలు తెలియని కుర్రకుంకలో, లేక అతివాద దుందుడుకు విధానంతో 'చంపండి',నరకండి' కవితలు వ్రాసి విప్లవ కవులుగా చలామణిఅయిన మరెకొంతమంది కవులో సోమసుందర్‌కి తెలిసినవారు అండర్‌టేకింగు ఇచ్చి బయటపడ్డారేమో కాని, నిజమైన ప్రజాకవులెవరూ ఈ బూర్జువా ప్రభుత్వానికి లొంగిపోయి తమ కవిత్వాన్ని మార్చుకోరు. తనకు వ్యతిరేకమైనంత మాత్రాన అందరిమీద అటువంటి అభాండాలు వేయడం నిజంగా దురదృష్టకరం.

అలాగే వందలాది ముక్కుపచ్చలారని యువకులు మాత్రం ప్రాణాహుతి కావించుకున్నారు అన్నారు సోమసుందర్‌గారు. దీనికి బాధ్యత విప్లవ రచయితలది అని ఆయన వుద్దేశం. వందలాది మంది విప్లవకారుల్ని సంఘర్షణ పేరుతో అమానుషంగా చెట్లుకు కట్టివేసి కాల్చి చంపిన ప్రభుత్వాన్ని ఈయన అసలేమి పొల్లెత్తు మాట అనలేదు. వాళ్ళు మంచి వారే, ధర్మాత్ములే, తప్పంతా కవులది. విప్లవం అన్నతర్వాత, నెత్తురుబొట్టు చిందకుండా వుండదు. విప్లవంలో పాల్గొన్నవారు తమ ప్రాణాల్ని వెచ్చించైనా సరే, ముందుతరాల వారికి సుఖసంతోషాల కోసం పోరాడుతారు.

విరసం పేరుచెప్పి అందరూ దుందుడుకు చర్యల వాళ్ళే అంటూ అందర్నీ తిట్టడం సబబుకాదు. దోపిడీదారుల్ని చంపినంత మాత్రాన దోపిడీ నశిస్తుందని ఏవిప్లవకారుడూ చెప్పడు. వ్యక్తిగత హింసావాదం ఆచరణలో విఫలమైంది. ప్రజా సమస్యలజోలికి పోకుండా వర్గశత్రునిర్మూలన జరిపిస్తాం అనే ధోరణి ఈనాడు పార్లమెంటరీ పంథాలోనికి దిగజారిపోయింది. వారి నినాదాలు నోట్టి గాలిమూటలయినాయి. కానీ వారి పేరు మాత్రమే ప్రపంచానికి తెలియజెప్పి, నిజమైన విప్లవకారుల్నీ, వారి సిద్ధాంతాన్ని తెరమరుగుచేసి, అందర్నీ ఒకే గాటకట్టి దూషించడం ఈనాడు కొంతమంది కావాలని చేస్తున్నపని. ఆ కొంతమందిలో సోమసుందర్‌గారు ఒకరని విజ్ఞులు గ్రహించగలరు. ఈ మసిబూసి మారేడికాయ చేసే విధానం ఎల్లకాలం సాగదు. విప్లవాన్ని పెడదారి పట్టించడం తప్పుగానీ విప్లవ సిద్ధాంతం తప్పుకాదు.

''దేశంలో సామ్రాజ్యవాద, భూస్వామ్య దోపిడీ పెత్తనాలను నిర్మూలించి, ప్రజల ప్రజాతంత్రవ్యవస్థను నెలకొల్పడం నేటి సామాజిక విప్లవ లక్ష్యం. సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక ప్రజాసంస్కృతిని అభివృద్ధి చేయటం నేటి సాంస్కృతిక ఉద్యమ కర్తవ్యం''. ఈ అంశం పట్ల స్పష్టమైన అవగాహన వున్న కవులు ఈనాడు చాలా మంది వున్నారు. వారి కవిత్వమే ప్రజాకవిత్వంగా వర్ధిల్లుతుంది.

శ్రీ సోమసుందర్‌గారు వర్గశత్రువుని మహాశక్తివంతమైన దాన్నిగా పోల్చారు. దానితో పోరాడటానికి పిల్లసమేరీలూ, పిచికపితూరీల వల్ల ఎట్టి పరిస్థితుల్లోనూ కాదని తేల్చేశారు. అంతటి మహాశక్తి సంపన్నమైన 'వర్గశత్రువు' (అంటే ఈ ప్రభుత్వమనేగదా సోమసుందర్‌గారి ఉద్దేశం) ను నిర్మూలించటానికి అంతలావు శక్తి సంపన్నంగా మనమూ తయారుకావాలని ఆయన ఉద్దేశం. అంటే మనకీ టాంకులూ, మెషినుగన్నూ, బాంబరు విమానాలూ వగైరాలు కావాలన్నమాట. ప్రజాబలాన్ని మించిన బలంలేదని ఆ కాలంలో రష్యా, చైనాలు నిరూపించాయి. ఈనాటి అణుయుగంలో వియత్నాం నిరూపించింది. మనకు కావలసింది ప్రజలు. మనదేశ పరిస్థితులకు అనుగుణంగా రైతాంగ విప్లవమే ఈ కార్యాన్ని నెరవేర్చగలదు. ఇది దీర్ఘకాలిక పోరాటంగా సాగాలి. దీనికి అనేక విధాలుగా నైతిక బలంకావాలి. ఏదైనా ముందు పిల్లసమేరియే. పిచికపితూరియే. అవేముందుముందుశక్తిసంపన్నంకాగలవు.

తరువాత శ్రీశ్రీగారిని కిడ్నేప్ చేసేరనీ, శ్యాండిల్యాములు మూప్పయివేలు కాజేసారనీ, వారని దొంగచెక్కులిచ్చారనీ వగైరాలు యోగమాయ ద్వారా చూసిన, విన్న, సంగతులుకొన్ని సెలవిచ్చారు సోమసుందర్‌గారు. వాటిని నమ్మేపరిస్థితుల్లో తెలుగు పాఠకులు లేరనే నాఉద్దేశం.

అనంతం లక్ష్మీకాంతంగారలు కష్టపడి కొంత సమాచారాన్ని పోగుచేసి తెలుగు పాఠకులుకు అందించారు. పాఠకులే వాటిలోని మంచిచెడుల్ని నిర్ణయించుకోగలరు. గాడిదలు మేసే వాల్‌పోస్టర్లూ, హైస్కూలు గోడల మీది కుర్రకారు వ్రాసే బూతులబుంగ తదితర విషయాలపైన పరిశోధనలు శ్రీ సోమసుందర్‌గారు చేస్తే తెలుగు పాఠకులు సంతసించగలరు.

శ్రీ బి. వీరయ్య

# కవిత్వంలో నిశ్శబ్దం

ఫిబ్రవరి నెల 'భారతిలో' శ్రీ ఇస్మాయిల్‌గారి వ్యాసంపై నా అభిప్రాయాలివి:

కవిత్వములో నిశ్శబ్దం వ్యాసమయసభలో ప్రవేశించినవాళ్ళకి గోడలేవో, గుమ్మాలేవో తేడా తెలియదు. దాంట్లో అగుపించేది వెలుతురో, చీకటో. వెలుతురు లాంటి చీకటో, చీకటి లాంటి వెలుతురో అర్థంగాని అయోమయంలో తల మున్కలవక తప్పదు. వ్యాస వాక్యాల సుడిగుండాల తత్వాన్ని బోధపర్చుకోవాలంటే వ్యాసకర్తే టీకా తాత్పర్యాలు నిర్వచించడం అవసరమేమో? [గణితం, శబ్దగణితం, నవ్యగణితం, తత్వం, శబ్దం, నిశ్శబ్దం ఇలా చాలా ఫంక్షన్‌లూ, రిలేషన్‌లూ, స్పేస్‌లు] అనుభవిక ప్రపంచంలో త్వమే వాహనమైనా జీర్ణించుకోవచ్చునేమో కాని ఇస్మాయిల్‌గారి వ్యాసాన్ని ఒంటబట్టించుకోవడం అనితరసాధ్యం అనుకుంటాను.

శబ్దం నుంచి ప్రపంచం ఉద్భవించిందని ఒక పురాణ గాథ చెబుతున్నా, పూర్వమీమాంసకులు, నైయాయికులూ శబ్దశక్తి గురించి కూలంకుషంగా చర్చించినా, ప్రాచ్యదేశాల్లో ఆధ్యాత్మిక అనుభూతి పరులు నేతి నేతి(ఇదికాదు ఇదికాదు) అని మౌనానికే ప్రాధాన్యమిస్తున్నారట. శబ్దం మౌనాన్ని దాటి హరిదాసు మధ్యలో పిట్టకథ అందుకున్నట్లు ఉపనిషత్ భాగాల్ని చొప్పించారు ఇస్మాయిల్‌గారు. పాపం కవిత్వమంటే ఒక్కటేపెలాసఫీగాభావించారేమో? బ్రహ్మజ్ఞానం ఇమ్మీడియట్‌గా ప్రత్యక్షమైంది కనుక వ్యవహారిక పదాల్లో ఇమడదనీ, అందువల్ల అనిర్వచనీయమనీ అద్వైతులు (సాక్ష్యాలు అడగమాకండి) దాన్ని ఇస్మాయిల్‌గారూ ఒప్పుకుంటున్నట్లేఉంది. సప్త సముద్రాల్లో చప్పుదారుసర్పు మూడుమునకలేయటం కంటే కఠినము జ్ఞానవంతుడు కావాలంటేనే. అలాంటిది ఇస్మాయిల్‌గారి ఊహాలోకంలో బ్రహ్మజ్ఞానం ఇమ్మీడియట్‌గా ప్రత్యక్షమైందట. అందుకే అది వ్యవహారిక పదాల్లో ఇమడదట. (గ్రాంథికాలైతే సరిపోతాయా? లేక గీర్వాణం కావాలా ?)

చావు, నిశ్శబ్దం రెండూ సరిసమానమే. నిశ్శబ్దాన్ని ప్రేమించేవాడు తనచావును తనే చేతులారా కోరుకున్న వాడికిందే లెక్క. ఎందుకంటే నిశ్శబ్దంలో ఆలోచనలూ ఉండవు, ఆవిరులూ ఉండవు, ఆవేదనలు ఉండవు, అన్యాయం ఉండదు, అక్రమం ఉండదు, అరుపులు ఉండవు. ఏది ఒకటున్నా అది నిశ్శబ్దాన్ని ఛేదించిన దానికిందే లెక్క. అనుభూతులు ఆలోచనల్ని రేకెత్తించి సృష్టించే సంచలనమే శబ్దం. అదే కలం ద్వారా వెలువరింపబడితే రచన. కవిత్వంలో నిశ్శబ్దం చోటుచేసుకున్నదంటే నిస్సత్తువ చోటు

చేసుకున్నట్లే. ఇస్మాయిల్‌గారూ కవిత్వంలో నిశ్శబ్దాన్ని సృష్టీకరించే బదులు ఉపనిషత్, ఫిలాసఫీల పాఠాలు వొప్పించారేమిటి? ఆత్మకీ, వాస్తవానికీ మధ్య తెరల్లాంటివి కావేకావు మాటలు. చెంపపై ఒకడు చాచికొడితే అమ్మోఅంటాడు నొప్పి తాళలేక ప్రతి వ్యక్తి. అంటే స్పందననూ చైతన్యాన్ని వ్యక్తీకరించేవి మాటలు. ఒక వ్యాసాన్ని వ్యక్తీకరించే ముందు దానికి సంబంధించిన సంపూర్ణ జ్ఞానసిద్ధి లేకుంటే ఇలాగే నిశ్శబ్దపు చీకటి పాతిపెట్టిన దావులా ఉంటుంది. యథార్థానికీ, మీ వ్యాసానికీ ఏమైనా సంబంధముందా అని కూపీతీయ ప్రయత్నిస్తే ఏ కొసమెరుపో అగుపిస్తుంది అంతే. కొన్ని విషయాల్లో మినహాయించి భాషకు నిశ్శబ్దమే శరణ్యం అన్నారు. మౌనం శరణ్యమైనాక భాష ఎక్కడి నుంచి పుట్టుకొస్తుంది. భాష ఉద్భవించాలంటే మొదట్లో ఆలోచనలు సంచలాన్ని సృష్టించవలసిందే. అంటే నిశ్శబ్దాన్ని ఖూనీచేయవల్సిందే. తప్పదు కదా!

వాక్యానికీ వాక్యానికీ సంబంధములేని మంత్రోచ్చాటనతో నిద్రపోతున్న కవిత్వపు నిశ్శబ్ద భూతాన్ని మేల్కొల్పాలని మీరు చేసిన ప్రయత్నము చూస్తుంటే సరిచేయని తీగల వీణపలికే అపస్వరంలా తోయకమానదు.

నిశ్శబ్దపు గొడవను విడనాడి మధ్యలో కవిత్వము గొప్పదా? సంగీతము గొప్పదా? అనే విమర్శలో దిగిపోయి ఇటు కవిత్వమూ కానిది అటు సంగీతమూ, కానిది మరోటేదో పుట్టిందట. అది అనిర్వచనీయంగా కన్పిస్తుందట. దానికొక పేరుపెట్టలేదు ఇంకా బొడ్డు కూడా కోశారో లేదో తెలియదు. దీని అనుకరణలు మాత్రం శ్రీ శ్రీ కవిత్వంలో చూడొచ్చు అంటున్నారు ఇస్మాయిల్‌గారు.

మిట్టూవున్న అనుభవిక ప్రపంచాన్ని ఆవిష్కరించడమే కవిత్వ లక్ష్యమైతే ఉదాహరణకై మీరిచ్చిన పద్యం అస్పష్టతనింపి కూర్చుందేం? అస్పష్టత తొంగి చూసిందంటే అది జటిలమైన అనుభూతా? అనుభూతిని అందరికీ అందుబాటులో, వ్యావహారిక భాషలో అందించలేకపోవడం కవి యొక్క గొప్పతనము కాదు. కవిలో భాషపై సత్తాలేని తనాన్నే నిరూపిస్తుంది. స్పష్టతను కొరవడ చేసి నిశ్శబ్దాన్ని కవితలో ప్రవేశపెట్టడం అంటే ఏమనుకోవాలి? పదచిత్రాలు అనుభవాన్ని కళ్ళముందు స్పష్టీకరించేందుకే మీరన్నట్లు అస్పష్టతా పూరిత నిశ్శబ్దాన్ని శబ్దాల్లోకి ప్రవేశపెట్టడానికికాదు. అదే కవిత్వ విశిష్టలక్షణమంటే ఇతరులు దాన్ని రూలనాడకతప్పదు.

పదచిత్రాలు మన ఇంద్రియాల్నింటికి ఐంద్రియక అనుభూతుల్ని మేల్కొల్పాలే తప్ప అవాస్తవికత, అస్పష్టతలను జొప్పించేవిగా రూపొందరాదు.

శ్రీ కె. అంజయ్య

# బ్రౌన్ ప్రభాకరుడు వేటూరి

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు జగమెరిగిన పండిత పరిశోధకులు. మల్లంపల్లివారి రెడ్డి సామ్రాజ్య చరిత్ర గ్రంథమునకు పునాదిరాయి శాస్త్రులవారి 'శృంగార శ్రీనాథము'. విశ్వ విద్యాలయాంధ్ర వాఙ్మయ ప్రణాళికలో శివకవియుగమునకు ముఖద్వారము వారి 'బసవపురాణ పీఠిక'. ప్రాచీనాంధ్ర సాహిత్య పరిశోధక క్షుదార్తులకు వడ్డించిన విస్తళ్ళు! వారు కూర్చిన ప్రాచ్య లిఖిత గ్రంథాలయ వివరణలు. తెలుగునాట రసికత చావనంత వరకు సరసజను ధరించు హృదయాభరణములు వారి 'చాటుపద్య మణిమంజరులు'. తెలుగుసం గాలంతకిన్ చేటులురేగు గంధ వాడి పూతలు వారి పీఠికలు.

శ్రీ శాస్త్రిగారు చిరకాలము మద్రపురి ప్రాచ్య హస్త లిఖిత పుస్తకాగారమున తెలుగు పండితులుగా నుండి అసూర్యంపశ్యలైపడియున్న ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను సంకలనములకు గ్రంథ వివరణములు వ్రాసిరి. కాని వారి పేరందు మృగ్యముగుట కానటి ప్రభుత్వోద్యోగ నిర్బంధనలే కారణము.

ఇది అర్ధశతాబ్ది క్రిందటి చరిత్ర. ప్రాచ్యలిఖిత పుస్తకశాల గ్రంథ వివరణ పట్టికలు (Descriptive catalogues of Govt. Oriental Manuscript Library) అచ్చుపడి, ప్రజల చేతులలో పడినప్పటినుండి బ్రౌన్ పరిశ్రమకు ప్రభాకరోదయమైనది. ఆంధ్రభాషోద్ధారకులలో బ్రౌనుదొర కలకాలము స్మరింపదగిన వ్యక్తియని తెలుగు ప్రజలు తెలుసుకొనగలిగిరి.

'ఇంపారునట్టి పద్యముల సంపాదించి, గ్రంథరూపమున వెల్వరింపం దలంపుగొని, యెఱిగినవారినెల్ల నడిగియు, దొరకిన తాళపత్ర సంపుటమెల్లం బరిశీలించియు, నానాటం గొన్ని చాటువులం గూర్చి' చాటుపద్య మణిమంజరి ప్రథమ భాగము శాస్త్రిగారు 1913 లో వెలువరించిరి. ఆ పత్రీరికలో వారు హైందవ సారస్వతమునకు గని యనదగు చెన్నపురపు లిఖిత పుస్తకభాండాగారము పెక్కు పద్యరత్నముల నొసంగినదని పేర్కొనిరి. అట్లు పేర్కొనుటయేగాక 'సి పి. బ్రౌన్ దొరగారు' అను శీర్షికనుంచి 'నూరార్లు లెక్కచేయక' యను పద్యమును, భాగవతములోని రెండు పద్యములను నుదాహరించి బ్రౌన్ యాంధ్ర భాషాభిమానమునకు, బుద్ధివైభవమునకు నివాళులెత్తినారు ఇందు 'నూరార్లు లెక్కసేయక' యను పద్యమును చాటువనికాని, ఫలానా గ్రంథమునందలిదిగా గాని వారు పేర్కొనలేదు. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో డి. 760 నెం. గల వసుచరిత్ర టీక కాగితపు ప్రతికి వీరు గ్రంథ వివరణము వ్రాసిరి. దీనిని ములుపాక బుచ్చయ్యశాస్త్రిగారు సోమనాథ కృతమగు విద్వజ్జన మనోరంజనీ వ్యాఖ్యానము ననుసరించి దీనిని సుబోధముగ వ్రాసినారని వ్రాయుచు బుచ్చయశాస్త్రి టీకయందలి అవతారికా పద్యములను గూడ ప్రచురించి యున్నారు. ఈ అవతారికా పద్యములలో నున్న 'నూరార్లు లెక్కసేయక' యను పద్యము శాస్త్రిగారు చూచియే తమ చాటు పద్యమణి మంజరి యందీ పద్యము హృద్యముగా నుండుటచే గాబోలు చేర్చుకొనిరి. బుచ్చయ శాస్త్రిగారి వసుచరిత్ర టీకలోని అవతారికా పద్యములను గ్రంథ వివరణముతో బాటు

ప్రభాకరశాస్త్రిగారు వ్రాయుగా దానిని ప్రాచ్యలిఖిత పుస్తకశాల తెలుగు గ్రంథ వివరణ పట్టికలో (డి. క్యా. సం. 2.పార్టు 2 పుటలు 1010-1013-1927) నాటి మద్రాసు ప్రభుత్వము వారు ప్రకటించుకున్నారు. తరువాత 1954లో ఈ పద్యములనే ఆప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు వావిళ్ళ వారి వసు చరిత్ర పీటికలో ప్రచురించియున్నారు. ఈ పద్యములు తెలుగు వారికి నూతనముగా నందిచ్చుచున్నట్లు ఇటీవల తిరిగి ప్రచురిం చుట పూర్వ గ్రంథ పరిచయ లోపము. ఇందలి పద్యము చాటువని భ్రమించుటకరము విచారకరము. బ్రౌన్ వ్రాయించిన ములపాకటీకను అవతారికా పద్యములను మొదట ప్రకాశమొనర్చినది ప్రభాకరశాస్త్రి -రే.

## బ్రౌన్‌చాటు పద్యములు - ప్రభాకర శాస్త్రి చోరత్వము

తమిళనాడు ప్రభుత్వము వారి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో సంస్కృత గ్రంథములలో బాటు తెలుగు గ్రంథములు భద్రపరుప బడియున్నవి. అందు తెలుగులోని డి. 2884 కాగిరపుబ్రతియు, డి. 1404 కాగితపు బ్రతియు, సంస్కృత విభాగములో నున్న డి.13063 కాగితపు బ్రతియు చాటుపద్య సంకలన గ్రంథములు. ఈ మూడును బ్రౌన్‌దొర సేకరించినవియే. ఇందు ముఖ్యముగా డి. 288 కాగితపు ప్రతిలో బ్రౌన్‌దొర స్వహస్త లిఖితముతో వివరణ లున్నవి. ఈ అమూల్యప్రతి తెలుగువారి దౌర్భాగ్యవశమున జిర్ణావస్థలో నున్నది. గ్రంథాదియందు బ్రౌన్‌దొర ఇంగ్లీషులో వ్రాసిన ఉపోద్ఘాతము కలదు* ఎడనెడ కాగితములపై నేమియులేక విడువబడినవి. మొదటి పుటలో ''శ్రీరామా చాటుపద్యాలు ఆది ఆశ్వాసము'' అని ప్రారంభించి

చాటుక కంటి నీరు
కవిరాజు కంఠంబు

అను రెండు పద్యములు పూర్తిగా నియ్యబడినవి తరువాత 'పుటలో కాశీకా విశ్వేశు' అను శ్రీనాథుని పద్యమును వ్రాసి దాని యెదురుగా 'entered in TED under తెలుంగు' అని యున్నది* ఈ విధముగా బ్రౌన్ తన స్వహస్తముతో నెన్నియో రిమార్కులు వ్రాసుకొన్నాడు. మచ్చునకు :—

''కోరికలుపుత్తిల్ల మదిగోరిన యట్టి రహస్య కేళులం
జారుతరంబుగా రతుల సంతస మందెడి జాణలెల్ల యీ
వార వధూ శిఖామణిని.........
మీరును మీరు మీరు మరి మీరును మీరు యిందుకు
యేమంటే మీరు మీరునున్.

వ. క్రిష్ణరాయల సమస్థానకు వొగ భోగింది వచ్చి అక్కడేవుండే అష్ట కవులకు ॥మీరును మీరు॥ అనే సమస్య యిచ్చినది. ఆ సమస్యకు పద్యం చెప్పడానకు తోచక తెన్నేల [వాలి]రామ/కృష్ణన్ని లింగణ్ణి పరయించగా ఆతడు పెద్దనతో చెప్పినది యేమంటే రేపు భోగందివచ్చి సమస్య అడిగినంతల్లో నా శిష్యుడు చెప్పతాడు అని మీరు చెప్పగా నేను మీ శిష్యుడనై చెప్పతానని రామలింగడు [క్రిష్ణుడు] కచేరియందు లేచి నిలువబడి చెప్పిన పద్యం అని 21వ ఫోలియోలో వ్రాయబడి యున్నది.

ఈ పద్యమశ్లీలమని, వేద శాస్త్రిగారి కాలమున శృంగార గ్రంథములపై ప్రభుత్వ నిషేధాజ్ఞ వర్తిల్లుటచేతనో శాస్త్రిగారు చాటు పద్యమణిమంజరియందీ పద్యమును. వ్యాఖ్యానమును గైకొన రైరి. ఇటువంటి బూతుల బుంగ లనేకము లీ వైదేశుడు తన సంకలనమున కెక్కించినాడు. వాని జోలికి శాస్త్రిగారు పోరైరి. వాస్తవమున శాస్త్రిగారే దాదాపు ముక్కికి ముక్కగా ఆ పద్యములను తన గ్రంథమున నెక్కించుకొన్నచో ఈ రోత పద్యముల నన్నిటిని గ్రంథస్థము చేయుటందుకు శాస్త్రిగారిని ప్రభుత్వము శిక్షించి యుండెడిది. లేదా సభ్యతాలోక మాయనను తిట్టిపోసెడిది. వేటూరి వారు వ్రాసిన చాటువులెన్నియో ఈ 'డి. 2884 చాటుపద్యాలు' అను గ్రంథమున గాని, తదితర సంఖ్యలుగల గ్రంథములందు గాని కానరావు.

చాటుపద్య సంకలనమున కెసరంత వైదుష్యమున్న చాలు. ఆ సంత వైదుష్యము తెలుగులో గడించినవాడు కాబట్టియే బ్రౌన్ బండబూతుల పద్దెములకు మురిసి తన గ్రంథమున చేర్చినాడు. శాస్త్రిగారి చాటుపద్య మణిమంజరి ప్రణాళిక వేరు. బ్రౌను ప్రణాళిక వేరు. దానికిని దీనికిని చాటుపద్య సేకరణోద్యోగమునందు తక్క అన్యత్ర పోలికయే లేదు. ప్రభాకరశాస్త్రి సేకరించిన 'ద్వాత్రింశన్మర్తులు' మొదలయిన పద్యములు బ్రౌన్ సేకరించిన గ్రంథమున కానరావు. బ్రౌన్ చాటు పద్య సంకలన మున్నదని తొలుత తెలిపిన వారును ప్రభాకరశాస్త్రులవారే. వారు క్రీడాభిరామ పీఠిక వ్రాయుచు ''క్రీ. శ. 1830 ప్రాంతము లందు ఆంధ్రభాషా మహావిద్వాంసులని, సర్వజ్ఞులని నాటి మహా విద్వాంసులచేతనే కీర్తింపబడిన మహనీయులు సి. పి బ్రౌను దొరగారు. కథా వివరణములలో శ్రీనాథుని చాటు ధారలను గొన్నింటిని సేకరించిరి. అందు గొన్ని వివరణములు, పద్యములు వారి స్వహస్తాక్షరములతో నున్నవి''. (52 వ పుట. మణిమంజరివారి ముద్రిత ప్రతి. 1952. పుట 52) శాస్త్రి గారి పై వాక్యములు పరిశీలింపగా వారికి బ్రౌన్‌పై గల గౌరవాభిమానములు మనకుగూడ లేవనియే చెప్పవచ్చును. ఉన్నచో 'ప్రభాకర చోరుడని' వ్రాయుటకు చేతులెట్లాడును ? నిదానముగా గ్రంథపరిశీలనముచేయనేరిమిలేక, ప్రశాంత మనస్కులుగాక, ఆవేశ పూరిత వాక్యములు వ్రాయువారికి సత్యాన్వేషణ బుద్ధి యెక్కడిది? నిజమునకు చాటుపద్య సేకరణ మొదలుపెట్టినది మడికి సింగన కాని బ్రౌన్‌కాదు, ప్రభాకరశాస్త్రిగారుకాదు. సింగన తన 'సకల నీతి సమ్మతమున' చాటువులను సేకరించినాడు.

## బ్రౌన్ పరిశోధనకు నాంది ప్రభాకరశాస్త్రిగారే

బ్రౌన్ పరిశోధనకు శంఖారవము పూరించినది కె. వి. లక్ష్మణరావుగారు. బ్రౌన్ సంకలనమును ముందుపెట్టు నిత్య పారాయణ చేసినది, పరిశోధనకు పూనుకొన్నది వేటూరివారు.

నేటికి అర్ధశతాబ్దమునకు ముందుగా ముక్త్యాల ప్రభువులు 'సరస్వతి' యనునొక వాఙ్మయ సాహిత్య వైద్యాది విషయిక మాస పత్రికను ముక్త్యాలనుండి నడపిరి. 1923 మార్చిలో వెలువడిన ప్రథమ సంచికయందు బ్రౌనుదొరవారికి (వాల్యూం 106.11. లెటర్ నెం. 55) మద్దూరి నరిశింహావధానులు మొకాబిలా చేయించి దాని రూకలకోసము వ్రాసిన జాబు లచ్చుపడ్డది. దాని తేది 14–3–1834. అందు బ్రౌన్ ఋగ్వేదభాష్యము కూడ వ్రాయించినాడని ఉన్నది. 'బ్రౌన్ దొరవారి జాబులు' అని పేరు పెట్టినది ప్రభాకరశాస్త్రిగారే. తరువాత 1 సం. 3 సంచిక యందు 'బ్రౌనుదొరగారు' అను శీర్షికలో 6 స్తుతి పద్యములు పడినవి. వాటికి కర్త లేదు. తిరిగి 7 వ సంచికలో 'బ్రౌన్‌దొర జాబులు' అను శీర్షిక మొదటి ఉత్తరము శ్రీ ఘన్మల్లంపల్లి మల్లిఖార్జున పండితారాధ్యులు తన తమ్ముడు వీరేశ లింగం శాస్త్రులకు వ్రాసినది. ఇందులో ద్విపద పండితారాధ్య చరిత్ర, పరమయోగి విలాసము ప్రస్తావన వచ్చినది. ఆ గ్రంథములు బ్రౌన్ దొరకు కావలెనట. రెండవ ఉత్తరము వఠెం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రుం వారికి బ్రౌన్ వ్రాయించి నది. ఇది ఈ నడుమ 'బ్రౌన్ లేఖలు' (1977) అను గ్రంథ ములో నచ్చుయినది. 'సరస్వతి'లో నిది తొలుత ముద్రితమైన సంగతి తెలియదీ గ్రంథకర్తకు. 11 వ సంచికలో శ్రీమంతు దుర్గాప్రసాద నాయుడు బ్రౌన్ దర్శనము కొరకు వ్రాసిన చిన్నలేఖ. 2 సం 1, 2, 3 సంచికల కొకే సంచికగా వెలువడిన దానిలో వాల్యూం నెం. 15–6–11 నుండి లెటరు 155గా పురాణం హయగ్రీవ శాస్త్రులు బ్రౌన్‌కు వ్రాసినది. ఈ లేఖ కూడ బ్రౌన్ లేఖలు (1977) అను గ్రంథములో తిరిగి అచ్చయినది. కాని ఇది ఈ పత్రికలో ముందచ్చయిన సంగతి గ్రంథకర్తకు తెలియదు.

1928లో ప్రభాకరశాస్త్రిగారు బ్రౌన్ దొరవారి చరిత్ర వ్రాయ నుద్దేశించి 1-9-1928 త్రిలింగ సంచికలో నీ క్రింది లేఖను ప్రచురించియున్నారు.

## ఛార్లెస్ ఫీలిఫ్ బ్రౌన్ దొరగారు

క॥ నూరార్లు లెక్కసేయక
పేర్లందిన విబుధవరులఁ బిలిపించుచు వే
నూర్లర్థమిచ్చు వితరణి
చార్లెసు ఫీలిప్పు బ్రౌను సాహెబు కరుణన్

ఆంధ్ర భాషోద్ధారకులలో కలకాలము స్మరింపదగిన మహ నీయుడు, మహావిద్వాంసుడునగు సి. పి బ్రౌను దొరగారి జీవిత చరిత్రమును, ఆంధ్రభాషకు వారు చేసిన యసాధారణ మహోప కారమును, వారి యాస్థాన పండితుల విషయమును, వారు రచించి నట్టియు, రచియింపించినట్టియు గ్రంథముల విషయమును, వారి విద్వద్గోష్ఠిలో నడచిన కథలను, వారి కితరులు వ్రాసినట్టియు వారితరులకు వ్రాసినట్టియు జాబులను సవిస్తరముగా సందానించి నేను 'బ్రౌను దొరగారి చరిత్ర' యనుపేర గ్రంథరూపముగా వెల్ల డింపనున్నాను.

బ్రౌను దొరగారు కడపలో నొక గొప్ప బంగాళాకొని పెంపొందించిరి. ఆ బంగాళాను వారు వార్థక్యమున మద్రాసులో పోస్టు మాష్టరు జనరలుగా నుండుటచే విక్రయింపవేసిరి. కడప, మచిలీపట్టణము మొదలగుచోట్ల వారు జిల్లా జడ్జీ పనిలోనుండిరి కడపలోగాని, మచిలీపట్టణములోగాని ఇంక నితరత్రా గాని వారి ఫోటో దొరుకునేమో అని కుతూహలపడుతున్నా ఆ ఫోటో ఎక్కడ నేని కలదేని ఎఱిగినవారు నాకు తెలుపగోరుచున్నాను. మరియు తెలుగు దేశమున నెక్కడగాని, ఎవ్వరియొద్దగాని వారు వ్రాసిన జాబులున్నను వారికి సంబంధించిన కథలు, పద్యములున్నను దయతో నాకు బంపగోరుతున్నాను లేదా పత్రికలలో ప్రకటింపగోరు తున్నాను. వానినెల్ల నా గ్రంథమున చేర్చుకొందును. అర్థ ప్రాణ ముల నాంధ్రభాషాభ్యుదయమునకై యర్పించి, మన ప్రాచీన వాఙ్మయమును బరిరక్షించిపెట్టిన యా మహామహుని చరిత్రము ఆంధ్రుల కెల్లరకు అవశ్య పఠనీయము. వారి ఫోటో దొరకెనేని అది ఆంధ్రభాషాభిమానుల కెల్లరకు ఆనందముతో కన్నుల కద్దు కొనదగిన దగును. ఎక్కడనేని దొరకునే దొరకదో!.

*శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి*

ఈ లేఖ ప్రచురితమైన కాలమున శ్రీ శాస్త్రిగారివద్ద ఇంగ్లీషు భాషలో లండన్‌లో 1872 నాడు అచ్చయిన ప్రతికి రకలు కూడ యుండెడిది. తరువాత వారీ పనిని నెరవేర్చినట్లు లేదు. ఏమయిననేమి బ్రౌన్‌పై పరిశోధను ప్రారంభించిన కీర్తి ప్రభాకరశాస్త్రిగారికి దక్కినది.

ఇన్ని సత్యాంశములు లోకమున వెల్లడికాగా "ఇంతవరకూ ఆయన చేసిపెట్టి పోయిన పనిని ఎవరూ చూడలేదనుకోవాలి. అథవా చూచినా ఎందువల్లనో బయట పెట్టలేదనుకోవాలి". —"బ్రౌన్ గతించిన తర్వాత కనీసం కృతజ్ఞతగానైనా ఆ పేరు ప్రఖ్యాతులను ఆయనకు చెందకుండా చేశారు మనవాళ్ళు—వేటూరి ప్రభాకరశాస్త్రి, కందుకూరి వీరేశలింగంవంటి ప్రఖ్యాత సాహిత్య వేత్తలు". వేటూరి చోరుడు కాపీకొట్టి తన 'చాటు పద్యమణి మంజరి'లో ప్రకటించుకొన్నాడు. ఈదగా "బ్రౌన్ జాబులను మొదటగా వెలుగులోనికి తెచ్చిన వ్యక్తి స్వర్గీయ వేటూరి ప్రభాకర శాస్త్రి. 1944–45 మధ్యకాలంలో ఆంధ్ర దినపత్రికలో ఆయన కొన్ని జాబుల్ని ప్రకటించాడు"—ఇటువంటి అస్తవ్యస్తపు, అవక

ననన, చిపార సావరత్రిగం అధ్యాపుపు వాక్యములేనాడు ప్రభాకర శాస్త్రి గారి వెలువడినవి. 1944-45 మధ్యలు, ఆంధ్ర దిన పత్రికలు! ఇదియేన సత్యాన్వేషణ. ఆంధ్రదినపత్రిక ఏమిటి? దానికి పేరు లేదా? అందులో ప్రచురితమైనట్టు ప్రచురించిన బ్రౌన్ లేఖలు ఏవరమలేవి? చూడలేదా? ఇదేనా పరిశోధన? ఇదేనా సత్యాన్వేషణ.

ఆమూర్యం ఎక్కగా పడియున్న బ్రౌన్ సంకలనముపై అర్ధశతాబ్దము క్రితమే ప్రభాకరశాస్త్రులు పడినవి. కాబట్టి బ్రౌన్ ప్రచారకుడు వేటూరి అయినాడు.

## చాటుధార పద్యాలు

## Telugu Anthology and Other short Compositions in Verse

The verses I collected either on account of their beauty, the celebrity of the composers, or their utility in illustrating the language : Many both ancient and modern may be found that have been preserved by oral tradition alone. I propose to arrange them in books Containing four or five hundred in each.

Each seperate article is referred to in the dictionary as one compilation, however long it may be, and the number of the since is add. Thus the 19th in book I has twenty lines.

Such short Compositions often, have move real poetical merit than those which being longer are in many cases turgid and lifeless, while these framed in the inspiration of the moment, are true to nature and proportionably attractive.

It is provable that some of these verses will ultimately be found fragments belong to some regular poem, whether still preserved or lost. Several of these are found in the writings of appacavi and other old grammarians who cite them in support of their rules.

The value of such collections is attested ... pains that the soundest criticks in Greek and other languages have taken in compiling anthologies.

The whole of Vemana's poems with those Bhaskara etc are like the చాటుధార unconnected but being arranged in hundreds, are not called చాటు పద్యాలు but శతకాలు.''

(తిరిగి మరొకసారి ఈ లిఖిత ప్రతిని ముట్టుకొన్నచో చూర్ణమగునను భయముతో నిద్దానిని నేనిచట నుద్ధరించు చున్నాను.)

## అధోజ్ఞాపికలు

* చూ: ఈ వ్యాసము చివర

* 1852 బ్రౌణ్యం తెలుగు ఇంగ్లీషు డి. నిఘంటువునకు నకలుగా ముద్రించిన ఆ. ప్ర. సాహిత్య అకాడమీవారి ముద్రణము పరిశీలింపగా తెలుంగు క్రింద నీ పద్యమేలేదు. లపెం డిక్సులో కూడ లేదు. బ్రౌన్ తన తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు మూల ప్రతి 9 సంపుటములుగా మొదట తయారు చేయించినాడు. దాని ఒక్క ప్రతిని లండనుకి ఇచ్చియుండును. ఆ మూల ప్రతియందీ చేర్పులుండియుండవచ్చును. [బరా. డి. 1391].

క్రీడాభిరామ పీఠికా ముద్రణ కాలమునాటికి పట్టము సవరింపబడినది.

స్వర్గీయ ప్రభాకరశాస్త్రి గారుదరులు సుప్రసిద్ధాయుర్వేద వైద్యులు, సంస్కృతాంధ్ర విద్వాంసులు అయిన శ్రీ శంకరశాస్త్రిగారు అందిచ్చిన సహకారమును ఈ సందర్భమున కృతజ్ఞతతో స్మరించుకొనుచున్నాను.

*శ్రీ సుందరేశ్వరరావు*
2-2-1137/5న్యూ నల్లకుంట
హైదరాబాద్–44.

## రూపసామ్యం

'భారతి' జనవరి 1975–కలగూరగంప(56–58 పేజీలు) శ్రీ ద్వా. నా. శాస్త్రి ప్రకటించిన ''రూపసామ్యం'' చర్చ–లో ఒక చిన్న పొరపాటు పడింది. దాన్ని సవరించడం, మరొక చిన్న వివరణ చేర్చడం గూడా ఈ లేఖ ఉద్దేశం.(దీన్ని గురించి యిప్పటి వరకు తద్జ్ఞులెవరూ స్పృశించనందువల్ల ఎదురుచూచి, యిప్పటికి రాస్తున్నాను.)

I బాలవ్యాకరణం క్రియాపరిచ్ఛేదంలోని 'సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు' అనే సూత్రంవల్ల 'ఇంచుక్' కేవలం సంస్కృత ధాతువులకే రావాలి–అని శాస్త్రిగారు రాశారు. కాని అది సరికాదు.

సంస్కృత ధాతువులకు, అంగల మొదలగు తెలుగు ధాతువులకును 'ఇంచుక్' వస్తుందని సూత్రార్థం. అందువల్ల 'కేవలం సంస్కృత ధాతువులకే' అన్న వివరణ తప్పు.

'అంగలించు, పలవరించు, ఆవులించు, భుజించు' మొదలయినవన్నీ అలా ఏర్పడినవే అని కూడా వారు వివరించినందువల్ల 'అంగలించు, పలవరించు, ఆవులించు' అనేవి భుజించులాగే ఇంచుక్కు వచ్చిన సంస్కృత ధాతువులేమోనన్న భ్రమ కలుగుతున్నది. ఈ భ్రమ వ్యాకరణ సూత్రాన్ని సరిగా అర్థంచేసుకోక పోవడంవల్ల ఏర్పడింది. దూసివారి టీకను వారు చూచి గ్రహించి వుంటే ఈ పొరపాటు ఏర్పడేది కాదు. (చూ. క్రియా–63 సూ.)

అంగల–ఆవుల–పలవ మొ. అదంతాలైన తెలుగు ధాతువులకు ఇంచుక్కు నిత్యంగా వస్తుందని సూరి తాత్పర్యం. సంస్కృత ధాతువులకు అన్నిటికీ, అంగల మొదలయిన తెలుగు ధాతువులకున్నూ ఈ 'ఇంచు(క్)' చివర వస్తుందన్నమాట.

అంతేగాక 'నామంబులకు ధాతుత్వ వివక్షయం దించుగాగమం బగు' అనే 65వ సూత్ర వివరణ కూడా ఇక్కడ అనుసంధించవచ్చు. సంస్కృత నామాలకు, తెలుగు నామాలకున్నూ ధాతుత్వం కల్పించేటప్పుడు ఇంచుక్కు వస్తుందని చెప్పి, 'జయించు, పయనించు' అనే సూరి ఉదాహరించాడు.

మన ప్రాచీన భారతీయ వ్యాకరణాలను ఆధారం చేసుకొని ఆధునిక భాషాతత్వశాస్త్రం ఏర్పడి రాకెట్‌లా దూసుకుపోతున్నా, ఆయా వ్యాకరణ శాస్త్రాలను గూడా సుష్ఠుగా అధ్యయనం చెయ్యకపోతే ఫలితం వ్యత్యస్తమవుతుంది. వ్యాకరణపు భూమిమీదనుంచి భాషా శాస్త్రపు రాకెట్ దూసుకుపోవడం మొదలుపెడుతుంది మరి!

II. శాస్త్రిగారి చర్చనుబట్టి మరొకటి రెండురూపసామ్య విశేషాలను ప్రస్తావిస్తున్నాను. ''సంస్కృతాన్నిబట్టి తెలుగులో సంధి విశేషాలు'' అని వీటిని అనవచ్చు:—

1. రథోత్సవము, వసంతోత్సవము మొ. వాటిలో గుణసంధి జరిగింది. వీటి రూపసామ్యాన్నిబట్టి 'తెప్పోత్సవము' అని గూడా అంటున్నాము. తెప్ప తెలుగుపదం. వ్యాకరణ ప్రకారం 'తెప్పత్సవము', 'తెప్పయుత్సవము' అని ఏర్పడవలసి వుంటుంది.

కాంగ్రెసేతర–అన్నది గూడా పై రూపసామ్యాన్నిబట్టి ఏర్పడ్డదే. కాంగ్రెస్ + ఇతర–అన్నప్పుడు, ''కాంగ్రెసితర'' అనే కావలసి వుంటుంది. ఈనాడు పత్రికల్లో ఇటువంటి మామూలైపోయిన విశేషాలు అనేకంగా చూస్తున్నాము.

ఇట్లనే, ''చూస్తోన్న'' అనే దాన్ని గుణసంధిగా చెప్పవలసి వస్తుంది. 'చూస్తూ ఉన్న' అనడానికిబదులు మామూలైపు 'చూస్తా ఉన్న' అంటారు. దీన్ని 'చూస్తోన్న' అని కలిపినప్పుడు గుణసంధి రూపసామ్యం గుర్తిస్తాము; 'చూస్తూన్న' అన్నప్పుడు సవర్ణదీర్ఘ సంధి రూపసామ్యాన్ని పరికించవచ్చు.

2. ''దాసోఽహం'' అనే సంస్కృత సంధిరూపం గమనించుదాము. 'దాసః + అహం' అన్నప్పుడు, ఇక్కడ విసర్గం ఉకారంగా మారి గుణసంధి జరిగి దాసః, దాసో (దాస + ఉ) అయింది.

దాసో + అహం – అని కలిపితే అకారం లోపించింది. ఆ లకార లోపాన్ని 'ఽ' అనే గుర్తు (అకార ప్రశ్లేష) సూచిస్తుంది. కాబట్టి 'దాసోఽహం' అన్న రూపం ఏర్పడింది.

దీనితో పోల్చిచూస్తే—

వచ్చే + అంత – వచ్చేంత
చచ్చే + అంత – చచ్చేంత
రా + అండి – రాండి
పో + అండి - పోండి
రానీ + అండి – రానీండి
పోనీ + అండి – పోనీండి

మొదలయిన రూపాలు రూపసామ్యాన్నిబట్టి వ్యవహారరూఢా లయినట్టు తోస్తుంది రండు, రండి; పొండు, పొండి – ఇత్యాది రూపాలు వ్యాకరణ సాధ్యాలయినా, పై వ్యావహారిక రూపాలకు రూపసామ్యం ఆధారం కావచ్చు.

"అండి" అన్నది మన భాషలో ఒకానొక విధమైన అనుచిత విభాగం (Wrong Split) వల్ల ఏర్పడింది.

చేయుదు, చేయుడి
చేయుండు, చేయుండి

పై రూపాలు వ్యాకరణ సిద్ధమైనవి.

'చేయుండి' అన్నది వర్ణసామీప్యాన్ని, పరిసరాన్నిబట్టి "చేయెండి, చేయండి" అని పలకబడ్డాయి. కాలక్రమంలో 'చేయండి, ఉయండి, పోయండి' వంటివి వ్యవహారంలో నిల్చిపోయి వీటి రూపసామ్యంవల్ల 'ఏమండి, ఎద్దండి, ఉండండి' వంటి రూపాలు వాడుకపడ్డాయి. వీటినుంచి "అండి" విడిగా విచ్ఛేదమై వచ్చి నిలబడింది.

ఇప్పుడిది లేని వ్యవహారం అరుదు. స్వతంత్ర ప్రయోగార్హమై కూడ ఉన్నది. దీన్ని బ్రౌను తన నిఘంటువులో గ్రహించాడు.

ఈ 'అండి', ఇంగ్లీషు పదాంతో గూడ కలసి వాడబడుతున్నదని ఆ మధ్య ఆరుద్రగారి 'రనండి' ప్రయోగం గురించి చర్చ జరిగింది. (చూ. 'భారతి' సంచికలు 1974 మార్చి, ఏప్రిల్, మే, జూలై, ఆగస్టు.)

Run అండి— రనండి (పరుగెత్తండి) అయిందన్నారు.

ఈ రూపసామ్యాన్నిబట్టి యీ క్రిందివిధంగాగూడ ప్రయోగించవచ్చు—

Win అండి – విన్నండి [గెలవండి]
Thin అండి - తినండి [సన్నని దండి].

ఐతే ఎన్నిరూపాలు ఏవిధంగా ఏర్పడినా అది వ్యవహారసిద్ధమై అర్థమవుతున్నంతవరకే వాటికి ప్రాణముంటుంది. లేకపోతే నిర్జీవరూపాలై వ్యవహారంనుండి తొలగిపోతుంటాయికదా?

శ్రీ బండి నాగరాజు

## శేషేంద్ర శాస్త్రం - గొర్రిల్లా విలాసం

మార్చి 1978 "భారతి"లో శేషేంద్రశర్మగారి "గొర్రిల్లా" కావ్యము పైని డా. ఆర్వీయస్ సుందరంగారి ప్రశస్తి పూర్వక వ్యాసము చదువగా నాకు తోచిన భావములను పాఠకుల ముందుంచుచున్నాను.

శేషేంద్ర శర్మగారి "గొర్రిల్లా" కావ్యములో "గొరిల్లా చైతన్య" మున్నట్లు సుందరంగారు వ్యాఖ్యానించిరి. గొర్రిల్లా అను జంతువు కావ్యములో నొక ప్రతీక. శేషేంద్రశర్మగారి కవిత్వము ప్రతీక ప్రతీయ మానమని తదభిమానులు అనుచుందురు కావ్యములో ప్రతీకగా గ్రహీతమయిన "గొర్రిల్లా" కును, ప్రకృతిలో నుండి జీవ శాస్త్రము వర్ణించిన గొరిల్లాకును, గల భేదా భేదములను పరిశీలించుట యుక్తము.

జీవశాస్త్రముచెప్పు జంతువుకు Gorilla Gorilla Gorilla (మూడుసార్లు వ్రాయుట శాస్త్రీయ పద్ధతి) అని పేరు ఇది గొరిల్లా కానీ, గొర్రిల్లా కాదు.

శేషేంద్ర శర్మగారు ఈ గొరిల్లాగారిని ప్రతికగాచేసి తమ కావ్యమును ఆమూలాంతము దోష భూయిష్ఠము చేసికొనినారు. ఈ విషయమును సాకల్యముగా వివరించెదను.

1. ప్రకృతిలోనున్న గొరిల్లా సాధు జంతువు. సంపూర్ణ శాకాహారి.

> "Much has been written about the ferocity of the Gorilla, but studies indicate that it is an unaggressive, even shy animal unless unduly disturbed."
>
> "The diet is exclusively Vegetarian and includes such foods as leaves roots, stalks and bamboo shoots."
>
> (Encyclo Paedia Brittanica)

మనిషి కంటె గొరిల్లా ఆహార నియమములో ఒక మెట్టు పైనున్నది. ఇక శేషేంద్రశర్మగారి గొర్రిల్లా, "అవ్యక్త భవిష్యత్కాల నాంతరాల్లో లేచే భయంకర ఆకారరేఖ గొర్రిల్లా" ... "ప్రళయ ప్రభంజనంలా బయటకొచ్చిన మహోగ్ర మూర్తి గొర్రిల్లా." పరమ సాధువు, సిగ్గరి, శాకాహారి అయిన జీవనములో గల భయంకరత్వ ఉగ్రత్వము లేమో అవగతము కావుటలేదు. దాని అందవికారమునకు జడిసి మన కవిగారు అట్లు వ్రాసి యుందురా ? అదే అయిన, చిట్టిపంతుల కంటె అంద వికారముగనున్న ఎందరో మంచివారు, దయాళువులు, మహోగ్రమూర్తులు కావలసియుండును. చెప్పరాని దుండగములుచేసే మాఫియా అను రహస్య సంఘ నాయకులు మాటిని హీరోలంత సుందరులట ! బాహ్యాంగ సౌష్ఠవమునకును, అంతస్సౌశీల్యమునకును సంబంధము ఉండనక్కర లేదుకదా ! బహుశః టార్జాన్ బొమ్మల కథలో

వచ్చు గొరిల్లా చిత్రములు చూచి, అవి నిజమనుకొని శేషేంద్ర శర్మగారు గొరిల్లాను భయంకరత్వ, ఉగ్రత్వములకు ప్రతీకగ నెన్ను కొని యుండవచ్చును. గొరిల్లా ఆఫ్రికాలోని జంతువు. ఆఫ్రికా జనులను తప్పుడుగ చిత్రించినట్లే, తెల్లవాడు ఆ ఖండపు జంతువునూ తప్పుడుగ చిత్రించినాడు తన కథంలో! ఈ వ్యాసము వ్రాయు దినములలో (మార్చి 15, 16) "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" పత్రికలో కడపటి పేజీలలో గొరిల్లాలకును, తెల్ల హీరో టార్జానుకును భయంకర యుద్ధము చిత్రింపబడినది! శాస్త్రజ్ఞుల పరిశీలన మన కాధారముకావలెను కాని తప్పుడు వ్యాపారసరళి బొమ్మలు కాదు.

2. "మనిషిలో నిద్రిస్తున్న క్రియాశక్తి గొరిల్లా. దానిని చైతన్యవంతం చేయడమే కవి పరమోద్దేశం. అందుకే శేషేంద్ర కవి గొరిల్లాను ఎలుగెత్తి పిలిచారు. లేలే గొరిల్లా, నిద్రలే" అని సుందరంగారి వ్యాఖ్య. దీనివలన తెలియునదేమనగా గొరిల్లా నిద్దురబోతు అనియు, అదే లేచిన చైతన్యము బ్రహ్మాండముగ కలుగుననియును. నిజమునకు గొరిల్లా, నిద్రకు ప్రసిద్ధిచెందిన జంతువు కాదు. ఇట, ప్రతీక కవి శేషేంద్ర శర్మగారును, వారి వ్యాఖ్యాతలు సుందరం గారును, గొరిల్లాకును, ధ్రువ ప్రాంతపు శ్వేత భల్లూకమునకు అభేదమును పాటించి పొరపాటు సలిపిరి. ధ్రువ ప్రాంతీయ శ్వేత భల్లూకము (Polar white bear) కూర్చున్నది కూర్చున్నట్లే చేతులు, కాళ్లు ముడుచుకొని, కొన్ని నెలలు కునుకు తీయును. ఈ స్థితినే హైబర్నేషన్ అందురు. ధ్రువ ప్రాంతపు శీతోష్ణ స్థితులు, ఆహారపు లేమి మున్నగు ప్రతికూల పరిస్థితుల కనువుగ, జీవధర్మముగ, ఈ కుంభకర్ణ నిద్ర ఆ భల్లూకమున కబ్బినది. ఇది పరిసరానుగుణ్య జీవధర్మము. గొరిల్లా కేమి ఖర్మ? గొరిల్లా దట్టమయిన ఆఫ్రికా అడవులలో నుండును. అందు కావలసినంత ఆహారముండును. శీతోష్ణ స్థితు లనుకూలముగ నుండును. సుష్టుగా తిని ప్రతి దినమును, ఒక వృక్షశాఖా నికుంజమును కట్టుకొని విశ్రాంతి తీసి కొనునట! అందుకే గొరిల్లా సుషుప్త్యవస్థకు ప్రతీక కాజాలదు. క్రియాశక్తికిని ప్రతీక కాజాలదు.

3. "గొరిల్లా బలిష్ట హస్తం అందిమ్మని దిక్కులేని పక్షుల మిలియన్లు ప్రత్యక్షమవుతాయి" అను సుందరంగారి వాక్యము గొరిల్లా అందరికిని సహాయము చేయునను అర్థము నిచ్చును. జీవశాస్త్రము చెప్పునదేమన గొరిల్లా చాల స్వార్థపర జంతువనియు, తాను తన కుటుంబ సభ్యులు, తన నాయకుడు ఒక జట్టుగ తిరుగుచుండునని. ఎవరైనను ఒంటరిగనున్న గొరిల్లా దగ్గఱకు పోయిన, అది బెదిరి, ఎదను రెండు చేతులతో కొట్టుకొనుచు, పెడబొబ్బలు పెట్టుచు, పారిపోవును. యిట్టి బెదురు జీవపు బలిష్ఠ హస్తమేమి పనికి వచ్చును? గొరిల్లా కాళ్లు, చేతులు సహాయముతో నడచును కాబట్టి, గొరిల్లా బరువు కొంచెము హెచ్చు కాబట్టి, ఆ బరువును, నడచునప్పుడు, భరించుటకు గొరిల్లా చేతులు బలిష్ఠముగ నున్నవి కానీ, దిక్కులేని పక్షుల కందిచ్చుటకు కాదు. అందువలన గొరిల్లా బలిష్ఠ హస్తము దిక్కులేని మిలియను పక్షుల కాసరా అగునను ప్రతీక భావము సరికాదు.

4. "ఓ గొరిల్లా...పవిత్ర హింసాసీమలకు మోసుకుపో, నీ రోమ రోమాల్లోంచి పుట్టారి కోటాను కోట్ల కర్మవీరులు, త్యాగవీరులు. పతనమవుతున్న ధరిత్రిని పైకెత్తి ప్రాణప్రతిష్ఠ చెయ్యాలి" (ఇవి శేషేంద్ర కావ్యగత వాక్యములు) ఈ వాక్యము లుద్ధరించి కావ్యవ్యాఖ్యాతలు సుందరంగారు "గొరిల్లా కోపానికి గుండెలతో ధూపంవేశాడు" (కవి) అన్నారు. ఇందు గొరిల్లా అను జంతువు హింసకును, కోపమునకు ప్రతీకచేయబడినది. గొరిల్లా సాధువనియు, సిగ్గరి అనియును ఇంతకుముందే చెప్పితిని. జంతుశాస్త్రజ్ఞులు గొరిల్లాను విచారశీలమైన జంతువని కూడా అనిరి. సాధువు, సిగ్గరి, విచారశీలమైన జంతువు హింసకును, కోపమునకును ఎట్లు ప్రాతినిధ్యము వహించును? ఇట్లు చిత్రించుట గొరిల్లా కపచారము చేసినట్లగును. గొరిల్లాకు చాల వెంట్రుకలుండును కనుక వానినుండి ఎందరైనను కర్మవీరులు పుట్టినరనుటకు నా వ్యక్తిగత వ్యతిరేకతలేదు కాని పతనమగుచున్న ధరిత్రిని పైకెత్తు బాధ్యత గొరిల్లాపైనేయుట గొరిల్లాను వరాహావతార ప్రతీకనుచేయుటే అని నా అభ్యంతరము. నల్లగ, లావుగ, బలముగ, చాలా వెంట్రుకలు కలిగిన జంతువులను ఒకదానికొకటిగ కన్‌ఫ్యూస్ చేసినారు శేషేంద్రశర్మగారు. గొరిల్లాను ఒకచోట ఎలుగుబంటిగను, ఇచట పందిగను అనుకొని అయోమయము చేసినారు. 'కన్‌ఫ్యూస్‌డ్ మెటఫర్' అను నలంకారము ఏకదేశమైనపుడు క్షంతవ్యముకాని, కావ్యము ఆమూలాంతము ఒక ప్రతీకపై నాధారపడినపుడు, ఆ ప్రతీక, స్వస్వరూప, స్వభావభ్రష్టత చెందుట, కావ్యసారస్యభంజకమే యగును. ఒక వస్తువును ప్రతీకగ నెన్నుకొని, ఆ వస్తువునకు లేని గుణములు ఆపాదించి. వాని యాధారముగ కావ్యము వ్రాయుటవలన శేషేంద్రశర్మగారి "గొరిల్లా" కావ్యములో సంభవించిన ప్రమాదమువంటి ప్రమాదమే కలుగును. నేను విమర్శించునది "గొరిల్లా" లోని కవితయొక్క గుణావగుణములను కాదు. గొరిల్లా అను జంతువునకు శేషేంద్రశర్మగారూహించిన, ఆపాదించిన లక్షణములు లేవనియు, కావున గొరిల్లా "గొరిల్లా" కావ్యమునకు ప్రతీక కాజాలదనియును.

5. అసలు గొరిల్లాను ప్రతీకగ ఏల దు కెన్నుకొనవలెను శేషేంద్రశర్మగారు? అది మనదేశ జంతువుకాదు. దాని నెవ్వరు చూచియుండరు. శేషేంద్రశర్మగారు మాత్రం చూచినారా? పోని, దానిని గురించి జంతుశాస్త్రములో చదివినారా? కవి నిశిత పరిశీలకుడు కావలెను. శాస్త్రములను చదువవలెను. ప్రకృతిని బాగుగ పరిశీలించవలెను. వాల్మీకి రామాయణములో గల సూక్ష్మాతిసూక్ష్మప్రకృతి వర్ణన చదువుడు. "ఆముక్తమాల్యద" లోని ప్రకృతి పరిశీలన అధ్యయనము చేయుడు. తమకు తెలియని, పతితల కర్థముకాని గొరిల్లావంటి వస్తువును ప్రతీకగ ఏల చేసికొన్నారు శేషేంద్రశర్మగారు? అందరికిని అర్థమగు సామాన్య

వస్తువును ఏల గ్రహించినారు కాదు ? ఇంగ్లీషు కవి జార్జ్ హెర్బర్ట్ తన కవిత్వంలో, ది కాలర్, ది బాగ్, ది పుల్లీ వంటి సామాన్య వస్తువులనే ప్రతీకలుగ చేసి నిగూఢ తాత్విక కవిత్వము వ్రాసినాడు. శేషేంద్రశర్మగారి కవిత్వములో "చేతుల కుర్చీ విప్లవమే" కదా వర్ణితము ! అందరి నోటిలో నానుతున్న ఈ "విప్లవము" వ్రాయుటకు ప్రతీకలేల, సంకేతము లేల ? సూటిగ వ్రాయకూడదా ? మన ఆధునిక కవులకు ఒక బలహీనత యున్నది. ఆధునికశాస్త్ర పరిభాషనుండి, స్పుత్నిక్, రాకెట్, ఏక్సురే, క్రోమోజోము, స్టెన్‌గన్ మున్నగు పదములను అప్పటప్పట తమ వచన పద్యములలో వెదజల్లిన లాము అంతర్జాతీయ కవులయిపోవుదురను లోలుపత కలదు. వచన పద్యంకు అలంకార ములే సర్వస్వము. అలంకారము లేని వాక్యములుండదు వీరి కవిత్వములో ! మార్చి 78 "భారతి" లోని శేషేంద్రశర్మగారి కవిత "వాక్యాల్లోనే దర్శనమిస్తాను", సౌంధ్యశ్రీగారి "దరంపస్తె... వెన్నెల్లో వాన" (Sic) పరికించుడు. సాగదీసిన రూపకాలంకారాలు తప్ప ఈ రచనలలో ప్రత్యేక గుణములేదు. అలంకారమలంకారమే కాని కావ్యాత్మ కాజాలదు. 'మెటఫర్ ఎలోన్ రిమెయిన్స్' అని సిసిల్‌డే లూయిస్ అనినా, ఆ యలంకారము తోడుగవలసిన కావ్య కాంత నిర్జీవమయిన సాధించిన దేమిటి ను ? రూపకాలంకార మును పట్టుకొని గుణింతము చేయుటయేనా కవిత్వము ? వమ త్కారము? ఈ పమ"త్కారము"యు, ఈ పమ "న్మిరియ"ములు వదలవేయుడు. అందరికిని అర్థమగునట్లు వ్రాయుడు. అందఱును వాడు పుస్తకములు వ్రాయుడు. మిఠాయికొట్టువాడు వాడు పుస్తకములు వ్రాయవలదు. దానిని (కవిత్వమును) చదివిన తర్వాత పాఠకుడు "మిఠాయికొట్టు కేమిపోవుటలెమ్మ" అని అనుకొను నట్లు చేయు కవిత్వము వ్రాయుడు.

— శ్రీ సర్దేశాయి తిరుమలరావు

# లేఖలు

## తిరువారాధనము

1978 మార్చి "భారతి" లోని శ్రీ శంకరగంటి రంగాచార్యులుగారి "తిరువారాధనము – సంధి చర్చ" చదివిన తరువాత నాకు తోచిన అభిప్రాయాలను తెలియజేస్తున్నాను.

"తిరువారాధనం" లోని పదాలను విడదీస్తే "తిరు + ఆరాధనం" అవుతుంది. ఇందులోని 'తిరు' అను పదం అన్య దేశ్యంగా తెలుగులోకివచ్చిన తమిళ పదమని, 'ఆరాధనం' సంస్కృత పదమని శ్రీ చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రిగారు అభిప్రాయపడినట్లు శ్రీ కొవ్విడి లక్ష్మన్నగారు 1977 ఆగస్టు "భారతి" లోని తమ వ్యాసంలో తెలియజేసారు. పై స్థలంలో ఉత్వ సంధి జరిగినచో "తిరారాధనం" కావాలని, యడాగమ సంధి చేయడానికి 'తిరు' శబ్దం సంస్కృతం కాదని, అందు పూర్వ శబ్దం 'తిరువు' కావడానికి అవకాశం లేదని, కాబట్టి "తిరువారాధనం" శిష్టప్రయోగంగా గ్రహించాలని చెళ్ళపిళ్లగారు అభిప్రాయపడ్డారు.

కాని ఈ సంధి పదాన్ని గ్రహించడానికి ఇంత ఇబ్బంది అవసరం లేదనిపిస్తుంది. వారనుకొన్నట్లుగా 'తిరు' పదం తమిళం నుండి తెలుగులోకి వచ్చిన అన్యదేశ్య మనవసరంలేదు. అది తమిళ పదమే. ఇందు చివరి అచ్చుకు తత్సమాకారం పరమయింది. తమిళంలో పదం చివరి 'ు, ి, ై' లకు అచ్చు పరమయినప్పుడు వకారాగమం కలుగుతుందని తమిళ వ్యాకరణాలు చెపుతున్నాయి. (చూ. ఆంధ్ర భాషా వికాసము శ్రీ గంటి జోగి సోమయాజి గారు : పే : 306). కన్నడంలో కూడ ఇటువంటి స్థలాలలో వకారాగమాన్ని ఆ భాషా వ్యాకరణాలు చెప్పినవి అంతేకాకుండ స్థానకరణ సామ్యాన్ని బట్టి చూచినప్పటికి వకారాగమం రావడం సమంజసమే. ఈ వకారాగమాన్ని తెలుగు వ్యాకరణకారులు చెప్పక పోవడం వేరే విషయం. కాబట్టి "తిరు + ఆరాధనం" అన్నచోట తమిళ సంధినియమాల ననుసరించి వకార మాగమమై "తిరువారాధనం" అయింది. ఆ విధంగా తమిళంలో సిద్ధమైన రూపాన్నే తెనాలి రామలింగకవి స్వీకరించాడని అనవచ్చును. అప్పుడు దీనిలోని సంధి విషయం తమిళ సంబంధియై సాధువగును. లాక్షణికదూరమైన శిష్ట ప్రయోగంగా గ్రహింపవవసరం లేకుండా పోతుంది. చెళ్ళపిళ్లవారు ఉదహరించిన "తిరు నక్షత్రం, తిరుమణి, తిరుచూర్ణం" వంటి పదాలలో వకారం కనిపించకపోవడానికి కారణం పరమగుచు హల్లు ఉండడమే.

ఇక రంగాచార్యులుగారు "దురలవాటు" మొదలగు పదాల లోని మాదిరిగానే "తిరువారాధనం" లోను జరిగిన సంధి దుష్ట సంధి అని అభిప్రాయపడ్డారు. కాని అది అటువంటిది కాదు. "దురలవాట్లు" మొదలగువాట్ల ఒకటి దేశ్య పదం, ఒకటి సంస్కృత పదం అయినప్పుడు సంస్కృత సంధి ప్రవర్తించినందు వలన అది దుష్టసంధి అయింది. కాని "తిరువారాధనం" లో ఒకటి దేశ్యపదం, ఒకటి తత్సమపదం అయినప్పుడు ప్రవర్తించినది దేశీయమైన సంధియే కాబట్టి అది దుష్టసంధి కానేరదు.

— శ్రీ గంగాధర

## శ్రీనాథుని జన్మస్థలం

కవిసార్వభౌముడు శ్రీనాథుడు రెడ్డిరాజుల కవనున్న విద్యాధికారి యన్నమాట లోకవిదితం. అద్దంకి రెడ్డిరాజులు క్రమనుగా కొండవీడు, రాజమహేంద్రవరములలో రాజ్యాలేలినారనుట చారిత్రక సత్యము. శ్రీనాథభట్ట సుకవి కొన్నాళ్ళు విస్తృతముగా ఆంధ్రదేశమునేగాక కర్ణాటక ప్రాంతమునకూడ సారస్వత యాత్రలు నెఱపి తన భాషకు ఎనలేని సేవ చేసినాడుగదా ! అద్దంకి రెడ్డిప్రభువులకడ ఆస్థాన విద్యాధికారిగానున్నవాడును, కాటయవేమారెడ్డి ప్రభువులకు అనుంగు మిత్రుడును అగు శ్రీనాథుడు అద్దంకిసీమలోనివాడే యనుకొనుట వెల్లదా ? కొందరు పండితులు సింగరాయికొండ ప్రాంతమువాడనియు, అవచి తిప్పయ్యసెట్టికి మిత్రుడగుటచే యిదియే యదార్థమనియు అనుచున్నారు. ఏది ఏమైననూ అద్దంకిసీమ గుండ్లకమ్మనదికి ఉత్తరముగను,

సింగరాయకొండ దక్షిణమునను వున్నది. అసిగా యీ రెండు ప్రాంతములును నేటి ప్రకాశంసీమయందే కలవు గదా! కాన శ్రీనాథ మహాకవి ప్రకాశము సీమవాడనుటకు ఎట్టి సందియమును లేదు ఆ కవిసార్వభౌముని గన్న ప్రకాశము (ఒంగోలు) సీమ ధన్యము !

ఇక జన్మస్థలమును గూర్చి యించుక పరిశీలింతము. శ్రీనాథామాత్యుని తాతగారు కమలనాభామాత్యుడు తన మనుమని ముద్దుపలుకులలో యిట్లు వర్ణింపబడినాడు: ''కనకక్ష్మాధర ధీరు, వారిధి తటీ కాల్పట్టణాధీశ్వరున్ అనుగుందాత, కమనాభామాత్య చూడామణిన్'' — సాగర తటముననున్న కాల్ పట్టణమునకు అధిపతి కమలనాభామాత్యుడు నేటి గుండ్లకమ్మనదికి దక్షిణ తటమున బంగాళాఖాతమునకు పడమరగా షుమారు యిరువది కిలోమీటర్లు దూరముననున్న నేటి ఊరు ''కొలచన కోట''. యీ 'కొలచనకోట'యే కొలసనకోట (కాల్సనకోట) అనియు వ్యవహారముననుండియున్నది. యీ గ్రామమున కమలనాభామాత్యుడుండియున్నచో — యిక్కడనుండి తరువాతికాలమున మనుమడు తాతగారి ఆశీర్వాదములందుకొని, ఆంధ్రతీర పట్టణములను దర్శించుచుండెననియు, సాగరాంధ్రమున సారస్వతయాత్రలు జరిపియుండవచ్చునియు నా పరిశీలనము. ఒకవేళ కందుకూరు ప్రాంతమగు సింగరాయకొండకు చేరువగల నెలవులలో శ్రీనాథుడుండెనని అనుకొన్ననూ, యిక్కడనూ అద్దంకి దాపున నొక 'సింగరి కొండ' యున్నది. ఇదియు నారసింహక్షేత్రమే, ఇదియూ ప్రసిద్ధమే. కనుక ఏ విధముగ జూచిననూ శ్రీనాథ కవిసార్వభౌముడు ప్రకాశముసీమలోని వాడనియు, జన్మస్థలము నేటి 'కొలచన కోట' యని పిలువబడుచున్న కుండికానదీతీర గ్రామమేననియు నిర్ధారింప వీలగుచున్నది.

పరిశోధక పండితులు పరిశీలింతురు గాక!
యదార్థమును నిరూపింతురని ప్రార్థన! ఇతిశివమ్!

— శ్రీ ఇలపావులూరి శేషగిరిరావు
'గిరీంద్ర'
ఇలపావులూరు, ప్రకాశం జిల్లా.

# ''సంప్రదాయం''

''భారతి'' ఫిబ్రవరి సంచికలో ''సాంధ్యశ్రీ'' గారు రచించిన ''సంప్రదాయం ప్రగతి వ్యతిరేకమా ?'' అనే వ్యాసం చదివాను. ''సంప్రదాయం'' గురించి వర్తమాన సంఘానికి తెలియవలసినంత తెలియదు'' అని వారన్నారు. వేదాలు, ఉపనిషత్తుల్లో ప్రతిపాదించబడిన ''సంప్రదాయం'' తరతరాలుగా ఒక వర్గంచేతనే అధ్యయనం చేయబడుతూ, సంఘంలోని మిగతా అసంఖ్యాకవర్గాలవారికి అందుబాటులో లేకుండా చేయబడింది. ఇది సర్వులకూ సువిదితం. వర్తమానంలోనూ దాదాపుగ యిదే పరిస్థితి. అందుకే వర్తమాన సంఘానికి సంప్రదాయం గురించి తెలియవలసినంత తెలియదు. అంతేగాక యీ సంప్రదాయం అనే పదం చాలా అర్థాలలో వాడబడుతూ ఉన్నది. ప్రాచీనకాలంనుండి అమలులోనున్న సాంఘిక, మత, వ్యవహారాలు, విశ్వాసాలు, ఆచారాలు, యివన్నీ సంప్రదాయం పేరులో వ్యవహరింపబడుతున్నాయి. అట్టి సంప్రదాయం మొదట్లో సంఘ పురోగమనానికె ఉపయోగపడినప్పటికీ, కాలక్రమంలో అదే సంఘ పురోగతికి ఆటంకంగా పరిణమించింది. అభివృద్ధిశీలమైన పరిణామ ధర్మాన్ని అంగీకరించని యీ సాంప్రదాయం కేవలం మౌఢ్యరూపం ధరించింది. అసమానతను చాటే వర్ణాశ్రమ ధర్మాలు, అస్పృశ్యత, బ్రాహ్మణాధిక్యత మొదలైనవి సంప్రదాయం పేరుతో సమర్థింపబడుతున్నాయి. అందుకే సమానత్వ సిద్ధాంతాన్ని విశ్వసించే ఆధునికులు అటువంటి దుర్మార్గపూరితమైన సంప్రదాయాన్ని ప్రగతివ్యతిరేకంగా భావిస్తున్నారు.

సమకాలీన మానవతావాదుల్ని వీరు చాల దారుణంగ గేలి చేశారు. ఈ మానవతావాదము ఇదః పూర్వంలేదని, తమకు తామై కనుగొన్న నూతనాంశమని మానవతావాదు లెవరూ భావించరు. మానవ చరిత్ర ప్రారంభంనుండి, పవిత్రమైన మన వేదభూమిలో విద్యను, విజ్ఞానాన్ని సొత్తుగ తీసుకొన్న ఒక బలమైన వర్గం, తోటిమానవుల్ని పందుల్లో పందులుగా పరిగణించిన సత్యం, అన్ని విధాల అసమానతల్ని పెంచి పోషించిన వాస్తవం గమనిస్తే ఈ వేద ప్రతిపాదితమైన మానవతా దృక్పథం ఎంతగా మంటగలిసిందో అర్థమౌతుంది. వర్తమానంలో తీవ్రంగా ప్రచారం చేయబడుతున్న మానవతావాదం, వేదాల్లో, ఉపనిషత్తుల్లో నిబద్ధమైయున్న అద్వైత సిద్ధాంతానికి ప్రతిరూపం.

ఇక ''మార్క్సియుల''పై వీరు సాగించిన దాడి కేవలం ద్వేషపూరితం. రామాయణ మహాకావ్యంలో ''మార్క్సియ'' దృక్పథము కనరాదని యెవరో యన్నారట. అలా అన్నవారెవరో శ్రీవారే సెలవిచ్చియుంటే బాగుండేది! ఇటువంటి తలా తోకలేని విమర్శ ''మార్క్సియులు'' ఎవరూ చేయరు. రామాయణం కాలంనాడు; మార్క్స్ ప్రతిపాదించిన విధంగా, వైరుధ్యాలతో అసమానతలతో, దోపిడిలో కూడిన వ్యవస్థ ఉందా? లేదా? ఉంటే దాని స్వరూప స్వభావాలేమిటి ? అనేమార్క్సిస్టులు అధ్యయనం చేస్తారు. అందువలన, ''సాంధ్యశ్రీ'' గారు ''మార్క్సియుల''ను వెక్కిరించక, సంస్కారంతో అర్థంచేసుకోగలరనిభావిస్తాను.

వీరు తమ వ్యాసాన్ని ముగిస్తూ చివర శ్రీశ్రీ యొక్క వచన కవితా భాగాన్ని ఉదహరించారు. ''సంప్రదాయం'' అంటే శ్రీశ్రీ గారి అవగాహన యేమిటో నాకు తెలియదు. కాని ''సాంధ్యశ్రీ'' గారు తామనుకొన్న అర్థం మహాకవి గేయపాదాల నుండి రాబట్టినట్లు అనుకొంటున్నాను.

ఏమైనా ''సంప్రదాయం'' గురించి వైదికపరంగా వర్ణిస్తూ ఆసక్తికరమైన వ్యాసం పాఠకులకు అందించినందుకు వారు అభినందనీయులు.

— శ్రీ సి. ప్రభాకర

# గ్రంథ విమర్శలు

## శ్రీ కలువకొలను సదానంద

అభినందన సంచిక

[సంపాదకుడు : ఓలేటి కృష్ణ, ప్రచురణకర్తలు – సదానంద సన్మాన సంఘం, పాకాల, చిత్తూరు జిల్లా.]

సుప్రసిద్ధ రచయిత. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీత శ్రీ కలువకొలను సదానందగారి సన్మానోత్సవం 1977 డిసెంబరు నాలుగవ తేదీన జరిగింది. ఆ సందర్భంగా వెలువడిన సన్మాన సంచిక ఇది. శ్రీయుతులు వెలగర శంకరరావు, పాయసం సుబ్రహ్మణ్యం, ఎస్. మునిసుందరం "నరేంద్ర" పాలగుమ్మి పద్మరాజు, పింగళి గణపతి శాస్త్రి, ఎమ్వీయల్, కొడవటిగంటి కుటుంబరావు ప్రభృత రచయితల ప్రశంసలతోపాటు శ్రీ సదానంద వ్రాసిన బాలగేయాలను, వేసిన కార్టూన్లనూ, పిల్లల కథలను కూడా ఈ సంచికలో చేర్చడం ఎంతో సమంజసంగా వున్నది. ఇలాంటి ప్రముఖ రచయితలు తెలుగునాట ఇంకా యెంతోమంది వున్నారు. మరి వారి సన్మానాలు ఎప్పుడో?

## శతావతారాలు

[రచన : ముక్కామల నాగభూషణం; వెల 3-50. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ – 520 004].

శ్రీ ముక్కామల నాగభూషణంగారు పండితుడు. రాజకీయ నేత. శాస్త్రీయ దృష్టితో సాహిత్య పరిశీలన చేయగల దిట్ట. అనుకనే "రామాయణం రంకు, భారతం బొంకు" అనే మాటలు విశేషంగా ప్రచారంలో వున్న ఈ రోజులలో ఇంత నిబ్బరంగా ఈ రెండు కావ్యాలను పరిశీలించి, కొన్ని అంశాలను విజ్ఞుల ముందుంచారు. ఇలాంటి కృషి చేయగల సామర్థ్యం ఆయనకే కలదనడం అతిశయోక్తి కాదు.

మానవ వికాస పరిణామ క్రమంలో ప్రధాన యంశాలను చర్చించిన తర్వాత, స్త్రీ పురుష సంబంధాలలో వచ్చిన మార్పులను వివరించితేగాని రామాయణ, భారతాలు ఏనాటివో, వాటిని వ్రాసిన వారెవరో శాస్త్రీయంగ తేలదని శ్రీ నాగభూషణం అభిప్రాయం

రామకథ ఆర్యులదేనని నిస్సందేహంగా చెప్పవచ్చునని ఈ రచయిత తేల్చారు. అంతటితో ఆగకుండా విస్తరించిన ఆర్యులతో పాటే రామకథ గూడా పాకిపోయిందని అయినా ఆసియాలో జరిగినట్టుగా యూరప్‌లో రామకథా రచన జరుగలేదన్న ఈ రచయిత అభిప్రాయంతో శాస్త్రీయ చారిత్రకులు ఏకీభవిస్తారనుకొంటాను.

ఇలాగే అనాగరిక యుగం మధ్యలోనే రామకథ పుట్టిందనడానికి శ్రీ నాగభూషణం కొన్ని ఉపపత్తులు ఇచ్చారు రామకథ పశుసంపదకు సంబంధించినదే అయి ఉంటుందనీ, ఆర్యులు అనాగికయుగం మధ్య దశలో వున్నప్పుడే ఈ కథ పుట్టి ఉంటుందని మార్క్సిస్ట్ దృక్పథంగల శ్రీ నాగభూషణం అభిప్రాయపడుతున్నారు.

భారతగాథ, రామాయణ గాథకు భిన్నమైనదని రామాయణ గాథకు మూలం త్యాగం కాగా, భారత గాథకు మూలం రాజ్య కాంక్ష అయినందున ఈ రెండు దృక్పథాలు, ప్రయోజనాలు వేరుగా వున్నాయని ఈ రచయిత తేల్చారు.

ఈ రెండు కావ్యాలను గురించి ఇంకా వివరంగా పరిశీలించి "రామాయణ భారత గాథలు రెండూ శతాబ్దాలు ఎత్తినప్పటికీ, వాటిని చారిత్రక దృష్టిలో పరిశీలించాలి" అని ప్రజలమనస్సులపై మత్తుమందు చల్లి, మూఢనమ్మకాలను పెంచే గ్రంథాలనో వాటిని త్రోసి పుచ్చకూడదు అన్నారు రచయిత ఇది నిజంగా ప్రశంసనీయమైన దృష్టి. నేటి యువతరం చదివి,ఆలోచించి, నిగ్గు తేల్చవలసిన అంశాలనేకానేకం ఉన్నాయి ఈ చిన్నా 92 పేజీల పుస్తకంలో. ఈనాడు యువత దృతవేగంగా ముందుకు పోతున్నది ఇలాంటి అంశాలను నిష్పక్షికంగా చర్చించే వ్యవధి వారికి వుంటుందా?

శ్రీ వి. ఎస్ అవధాని

## వాసవీ విజ్ఞాన సుధ

[వాసవీ విజ్ఞాన సర్వస్వ ప్రథమ భాగము. సంకలన, ప్రచురణముల కర్త. ఆర్ష ధర్మ విభూషణ, యాజి శ్రీ కొంకిమళ్ల చంద్రశేఖర గుప్త, అడ్వొకేట్, శ్రీ వాసవీ విజ్ఞాన పీఠము, ఖమ్మం (ఆం. ప్ర) డెమ్మీ–244 పుటలు, అమూల్యం.]

ఆంధ్రదేశంలోని వైశ్యులకు వాసవీ కన్యకా పరమేశ్వరీదేవి కులదైవం. ఆ దేవికి దేశమంతటా నాల్గువందల ఆలయాలున్నవి. ఆమె పేరిట ఎన్నో ధర్మ సంస్థలున్నవి. ఆలయాల్లో పూజాదులు పేరుకు జరుగుతున్నవేకాని శ్రద్ధ క్రమ క్రమంగా క్షీణించినది తిరిగి యీ పూజాదికమైన ఆర్య ధర్మాన్ని ఉద్ధరించి కార్యకలాపం యథా విధిగా జరిపే సంకల్పంతో ఖమ్మంలో శ్రీ వాసవీ విజ్ఞాన పీఠం ఏర్పరచబడింది. శ్రీ వాసవీదేవి యెడల అపార భక్తిశ్రద్ధలు కల సంకలనకర్త ఆ దేవతను గురించిన విజ్ఞాన సర్వస్వాన్నితయారు చేసి ప్రకటించ సంకల్పించారు. అందు ఇది మొదటి భాగం.

ఈ సంకలనంలో వరుసగా శ్రీ వాసవీ దేవ్యుపాసనా క్రమం (పుటలు 1–56), శ్రీ వాసవీ సహస్ర నామావళి (57–96), అష్టోత్తర శతనామ స్తోత్రం (97–99), అష్టోత్తర శత నామావళి పరిమళ వ్యాఖ్య (100 139), వాసవీగీత (తత్త్వ

ర్యంతో 140–240) ఇయ్యబడినవి. చివర నాలుగు పుటలలో పేరు పొందిన కొందరు వైశ్య ప్రముఖుల గోత్ర ప్రవరాదులు ఇయ్యబడినవి (గ్రంథ ముద్రణ కోసం, ప్రచారం కోసం వాసవీ విజ్ఞాన పీఠంలో సభ్యులుగా చేరిన ప్రముఖుల పేర్లు, వారు ఇచ్చిన చందా సొమ్ము — ఆ గోత్ర ప్రవర విభాగంలోనే వారి వారి పదవులతో కూడా తెలుపబడినవి.

వాసవీ కన్యకా పరమేశ్వరిని గురించిన గ్రంథాలు కొన్ని ఇది వరకే వెలువడి ఉన్నవి. కాని ఇట్టి సంకలన గ్రంథం వెలువడినట్లు లేదు సంకలనకర్త ఎంతో శ్రమకోర్చి దీనిని సమకూర్చినట్లు తెలుస్తున్నది. దీని రెండవ భాగం 'వాసవీ సప్తశతి' అనీ, అది ముద్రణకు సిద్ధంగా ఉన్నదనీ తెలుస్తున్నది. అందులో వాసవీ మంత్రపూతమైన 26అధ్యాయాలు ఉంటాయనీ, షోడశసంస్కార కర్మల వివరణమూ ఉంటుందనీ సంకలన కర్త అంటున్నారు ఆయన కృషి వల్ల వాసవీదేవిని గురించిన విషయాలన్నీ సంకలితాలయి ఆయన సంకల్పించిన సంకలనం తన సర్వస్వ నామాన్ని సార్థకం చేసుకోగలదని భావిస్తున్నాను.

దీనికి లోపలి ముఖపత్రం, విషయ సూచిక, పీఠిక లేక పోవడం మాత్రం కొరతగానే కానవస్తున్నది.

"ఆంగీరస"

# శ్రీ అరవిందుల జీవిత చరిత్ర

(రచయిత : శ్రీ కాకుమాను — తారానాథ్, క్రౌను సైజు 220 పుటలు. వెల 5 రూ. ప్రకాశకులు: శ్రీ వల్లూరి సూర్య నారాయణరావుగారి గ్రంథనిధి, ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు, పశ్చిమగోదావరి జిల్లా.)

పాశ్చాత్య వాతావరణంలో పెరిగి, విదేశాలలో ఉన్నత విద్యను అభ్యసించినా, ఉత్తమ జాతీయ భావాలను పుణికి పుచ్చుకుని, జాతీయ నాయకులలో అగ్రశ్రేణిని అలంకరించి, భారతదేశంలోని బ్రిటిష్ భూభాగాన్ని విడిచి, దక్షిణాదిలోని పుదుచ్చేరిలో ఆశ్రమం ఏర్పాటుచేసుకుని, యోగసాధనలో లీనమైన మహాయోగి శ్రీ అరవిందులు. ఆయన రచనలను చదివి, ఆ మహాయోగి విచారధారవల్ల ప్రభావితులైన రచయితకు — శ్రీ అరవిందుల శతజయంతి సందర్భంగా ఆయన జీవిత చరిత్రను వ్రాయాలనే సంకల్పం కలిగింది. ఆ సంకల్పమే గ్రంథరూపం దాల్చి ఈ "శ్రీ అరవిందుల జీవిత చరిత్ర"గా తయారయింది. రచన 1972 లో పూర్తయి, ప్రచురణ మాత్రం 1977 లో జరిగింది. శతజయంతి నాటికి ప్రచురణ కావలసిన దీని ప్రచురణలో జాప్యం ఏర్పడ్డానికి కారణాలను రచయిత — పుస్తకం మధ్యను ఉంచి పంపిన 8 పుటల 'నేనూ — నా అరవిందులు' అనే 'కరపత్రం' లోనే వివరించారు దీన్ని ప్రకటించడానికి ఉత్సాహం చూపుతూ సమ్మతించిన సుప్రసిద్ధ ప్రకాశకసంస్థ ఎం. శేషాచలం కంపెనీవారు. ఏళ్ల తరబడి వ్యాపించి జాప్యాన్ని, కోరిన మార్పులతో, మార్పులు చేసిన పుస్తకాన్ని మూల పడవేయగా — అతికష్టంమీద దానిని సంపాదించగలగడాన్నీ అందులో రచయిత వివరించారు. చివరకు శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారి గ్రంథనిధి నిర్వాహకుల ధర్మమా అని యిది వెలుగుచూచింది.

శ్రీ తారానాథ్ ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వోద్యోగి కావడం వల్ల ఉద్యోగధర్మాన్ని నిర్వహిస్తూనే — పలు తావులకు మారుతూ ఉన్నా పట్టుదలతో దీని రచనను సాగించారు. ఈ పుస్తకం సంగ్రహరూపమైనా సమగ్రమైనది. దీని 'భూమిక'లో భారత దేశ పరిస్థితి, ఇతర దేశాలతో తులనాత్మకమైన పరిశీలన, ఆధ్యాత్మికదృష్టి, ఆవశ్యకత వివరించబడినవి. 'దేశకాల పరిస్థితులు' అనే శీర్షికలో 1858 నుంచి 1893 వరకూ భారత రాజకీయ, ఆర్థిక, సాంఘిక, కార్మికరంగా 'విహంగావగాహనంగా' పరిశీలించటం జరిగింది. తర్వాతి శీర్షికతోనే అరవిందుల జీవితగాథ ప్రారంభమవుతుంది. అందులో ఆయన బాల్యం, విద్యాభ్యాసం వివరించబడినవి. తర్వాతి రెండు ప్రకరణాలు ఆయన బరోడా జీవితాన్నీ, కలకత్తా జీవితాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించాయి తర్వాతి ప్రకరణంలో ఆయన ఆలీపూర్ జైలు నివాసం గురించి తెల్పబడింది. జైలులో ఉన్నప్పుడే ఆయనలో మార్పు కలిగింది. దృష్టి రాజకీయాలను విడిచి ఆధ్యాత్మికంలో ప్రవేశించింది. అందుకోసమే కాబోలు ఆ ప్రకరణానికి 'ఆలీపూర్ ఆశ్రమవాసం' అనే పేరు పెట్టబడింది. ఆ ప్రకరణం చివరనే అరవిందులు పుదుచ్చేరికి స్టీమరులో ప్రయాణం కావడం తెల్పబడింది. తర్వాతది యోగసాధనను గురించిన ప్రకరణం. తర్వాతిదానిలో యోగసాధనతో పాటు పాండిచేరి జీవితం, బ్రిటిష్ ప్రయత్నపు విఫల ప్రయత్నాలు, ఆశ్రమ స్థాపన మున్నగునవి వివరించబడినవి. తర్వాతి ప్రకరణంలో ఫ్రాన్సు దేశీయురాలు, తర్వాతి తర్వాత మదర్ (మాత)గా ప్రసిద్ధి పొందిన మిరా రిచర్డ్ సతీమణిని గురించి ఉన్నది. చివరలో ప్రధానమైన "అరవింద విచారధార" వివరించబడింది.

శ్రీ అరవిందులను గురించిన గ్రంథాలు చిన్నవీ, పెద్దవీ, ఆంగ్లభాషలోనూ, దేశీయభాషల్లోనూ చాలా వచ్చాయి. ఆంగ్లంలో శ్రీ కె. ఆర్. శ్రీనివాసయ్యంగార్ వ్రాసినదే బృహద్గ్రంథం. అరవిందాశ్రమవాసులు మనోజ్‌దాస్‌గారు వ్రాసి, సాహిత్య అకాడమీ వారు ప్రకటించినది సంగ్రహరూపం! ఇలా పేరుపొందిన అరవింద జీవిత చరిత్రలు ఎన్నో ఉన్నాయి. కాని, ఈ రచయిత బహుగ్రంథ పరిశీలనచేసి, వాటినుండి గ్రహించవలసిన విషయాలను తీసికొని దీనిని రచించడంవల్ల దీనికొక ప్రత్యేకత ఏర్పడింది. భాష చాల సరళంగా ఉన్నది. శ్రీ అరవిందులనుగూర్చి సమగ్రంగా తెలుసుకోవాలంటే దీనిని చదివితే చాలు.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య

## "సోవియట్ యూనియన్‌లో విద్య"

[రచన: ఎన్ డి. సుందరవడివేలు [అనువాదకుడిపేరు లేదు] ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్ – విజయవాడ – 520004. పుటలు: 120. వెల: రు–3–75.]

ప్రతి వ్యవస్థ తనకు కావలసిన విద్యావిధానాన్ని రూపొందించుకుంటుంది. పెట్టుబడిదారి సమాజం తనకు అవసరమైన పోటీ మనస్తత్వాన్ని, ఆడంబరాలను పెంచే విద్యావిధానాన్ని అమలు చేసుకుంటే సోషలిస్టు వ్యవస్థను శ్రామిక సమ సమాజ నిర్మాణంలో భాగంగావున్న దేశాల్లో నూతన తరహా విద్యాపద్ధతులను ఆచరణలో పెడతారు. నూతన మానవుడి ఆవిర్భావానికి ఆ సోషలిస్టు విద్యా పద్ధతి వరవడి దిద్దుతుంది మన దేశంలోని విద్యావిధానం ఎటూ కాకుండా మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అనే సంకర వ్యవస్థను ఫ్యూడల్–పెట్టుబడిదారి మనస్తత్వాన్ని పెంచే పద్ధతిగనే కొనసాగుతోంది. మన ఈ విద్యా విధానంలో భాగస్వామ్యంవుండి ఉన్నత పదవులను నిర్వహించి ప్రముఖ విద్యావేత్తగా పేరుపొందిన సుందరవడివేలు "సోవియట్ యూనియన్‌లోని విద్యావిధానాన్ని" సన్నిహితంగా పరిశీలించి ఆ పద్ధతిలోని నిర్మాణాత్మకమైన అంశాలను భారతీయులకు ఈ పుస్తకంద్వారా అందించారు.

జారిస్టు ప్రభుత్వంలోని విద్యాపద్ధతులకు, ఈనాటి విద్యా విధానానికి వున్న వ్యత్యాసాన్ని చక్కగా వివరించి చెప్పారు సుందర వడివేలుగారు. సార్వజనిక అక్షరాస్యతకు రష్యా పుట్టిల్లుగా రూపొందిన పాఠశాల పూర్వపు విద్యనుంచి ప్రాథమిక – సెకండరీ విద్యా దశల్లోంచి ఉన్నత విద్య ఎలా బోధించబడుతుందో అనేక దృష్టాంతాలద్వారా వివరించారు. "పరీక్షలు" అనే అధ్యాయం మనకు మరెంత ఆసక్తికరంగా వుంటుంది. వృత్తి, ప్రత్యేక సెకండరీ విద్యా ఇతర అంశాలు భారతీయ విద్యావేత్తలకు నూతన అవగాహనను కలిగిస్తాయి. ప్రస్తుత సోవియట్ యూనియన్ రాజకీయ పాలకవర్గంలో కొన్ని లోపాలున్నా, రాబోయే వర్గరహిత సమాజ స్థాపనకు జరిగే కృషిలో సాంస్కృతిక విప్లవాలు నిరంతరాయంగా సాగవలసిన అవసరంవున్నా, వెనుకబడి ఈనాటికి ప్రయోగాలతో కొట్టుమిట్టాడుతూ సంఖ్యల కూడిక–తీసివేతలవిధానాలతో గొడవ పడుతున్న మనకు ఈ పుస్తకం సోషలిస్టు తరహా విద్యావిధానాన్ని, దాని గుణపాఠాలను విడమర్చి చెబుతోంది. సోషలిస్టేతర దేశాలకు కూడా ఆ విద్యావిధానం ఆదర్శంగా, అనుసరణీయంగా వుందని రచయిత చెబుతున్నారు ఇందులో తప్పకుండా యదార్థంవుంది– ఈ పుస్తకంలో వరసగా 6,7–10,11 14,15 18,19 పుటల్లో అచ్చుకాకుండా ఎనిమిది పుటలు తెల్లగా వుండిపోయాయి.

## 'దేముడు జీవినిచంపి మోక్షమిస్తాడా?'

[రచన: గుడిపాటి ప్రసాదరావు, ప్రచురణ: ప్రసాద్ పబ్లికేషన్స్–దేశాయ్‌పేట, వరంగల్ 506006, పుటలు: 208–వెల: రూ 5/–]

ఈ అనంతమైన సృష్టికి మూలమేదో ఒకటి వుందని, ఆ మూలమే 'దేవుడని' లేదా 'సృష్టికర్త' అని విశ్వసిస్తున్న ఆధ్యాత్మికవాదులు–మతవాదులు–భావవాదులు ఈ ప్రపంచమంతా వున్నారు. భారతదేశంలో ఈవిశ్వాసాన్ని హిందూమతం, ఆ తర్వాత వచ్చిన ఇస్లాం, క్రైస్తవమతాలు పెంచి పోషిస్తూ ఈ నాటికీ సజీవంగా వున్నాయి. ఈ విశ్వాసానికి భిన్నంగా 'వస్తువు'ను లేదా 'పదార్థాన్ని" అన్నింటికి మూలంగా స్వీకరించి తరతరాలుగా భావవాదంతో పోరాడుతున్న చార్వాకులు, భౌతికవాదులు హేతువాదులు మన మధ్యనే వున్నారు. ఆధ్యాత్మికత, దైవనిర్ణయం చాటున కులాధిక్యతను, తద్వారా వర్గాధిక్యతను సుస్థిరం చేసుకోవాలని "బ్రహ్మదేవుడు" అనే కల్పితమైన ఒక అతీతశక్తిని సృష్టించుకున్నాయి ఉన్నత వర్గాలు. అందువల్లనే ఆనాడే లోకాయతులు (భౌతికవాదులు) ఇలా వ్యాఖ్యానించారు: "బ్రహ్మదేముడు పేదల నొసట కత్తితో వ్రాస్తే, ధనికుల నొసట హంస ఈకతో వ్రాశాడు."

ఈ లోకాయతుల–భౌతికవాదుల హేతువాదపు వారసత్వాన్ని కొనసాగిస్తున్నారు గుడిపాటి ప్రసాదరావుగారు. ఈ వైజ్ఞానిక యుగంలో విజ్ఞానం సాంకేతికాభివృద్ధివల్ల, అన్ని భౌతిక సుఖాలు పొంది, మానవ వికాస పరిణామక్రమాన్ని కళ్లార చూస్తూకూడా "ఆత్మ–అతీతశక్తి–మహిమలు" అని బూటకపు బాబాలవు ఊడిగం చేస్తున్న శాస్త్రజ్ఞులు మసలుతున్న పుణ్యభూమి మనది.

ప్రోటోప్లాజం అనేది జీవానికి మూలాధారం అనే యదార్థాన్ని నమ్ముతూ ఆ జీవపదార్థం నిరంతర చర్యలవల్ల జీవిస్తూ, చర్యలు ఆగిపోయినపుడు మరణావస్థలోకి వెళ్ళిపోదం ఇది సహజ పరిణామం ఇలాంటి జీవిని దేవుడనేవాడు ఒకడు సృష్టించి, ఆ తర్వాత దానిని చంపి పునర్జన్మ కల్పించి లేదా మోక్షమిస్తాడనే విశ్వాసంతో ఆస్తికులు అతీత శక్తులగురించి ప్రచారం చేస్తున్నారు. కాని ప్రతి జీవి పదార్థం మూలాధారంగా కొన్ని పనులు నిర్వహించి అస్తిత్వ లక్ష్యాన్ని సాధిస్తుంది. ఆ పనులు–ఆహార స్వీకారం, శ్వాసక్రియ, జీవపదార్థం, మలిన పదార్థ విసర్జన, జ్ఞానము, సంతానకాంక్ష వీటిద్వారా జీవన క్రమంలో తిరిగి ప్రతి జీవి తన ధర్మాలను పాటిస్తున్నది. అంతే తప్ప పుక్కిటి పురాణాల నుంచి నేటి బూటకపు బాబాల అభూత కల్పనలు వివరించినట్లు మాత్రం కాదు.

గుడిపాటి ప్రసాదరావుగారు ఈ పుస్తకంద్వారా ఒక మహత్తర లక్ష్యాన్ని సాధించే ప్రయత్నం చేసారు. తమ నిరంతరకృషి, అధ్యయనం, హేతువాద విశ్లేషణద్వారా సృష్టిమూలం- జీవపదార్థం యొక్క యధార్థాన్ని విడమర్చి చెప్పారు. "మానసిక ఔన్నత్యాన్ని సాధించాలనెడి విషయంలో తప్ప మిగిలిన అన్ని విషయాలలో మార్క్సిజం సన్యాక్రమింపగల్గింది" అనే సత్యాన్ని అంగీకరించారు.

సరియైన అర్థంలో దేవుణ్ని వ్యతిరేకించవలసిన అవసరం తనకు లేదని, "దేవుడు" అంటే మానవులు సమిష్టిగా, సామాజి

కంగా తాము బతుకుటకై చేయు దేవులాట లేక ప్రయత్నం. ఈ దేవులాడే లక్ష్యం ప్రతి ప్రాణిలోనూ వుందని చెబుతూ సమాజ పరిణామక్రమంలో స్వార్థపరవర్గాలు కరువు, కాటకాలు, ఆకలి, బాధలు, నిరుద్యోగం అనేవాటిని రూపు మాపి బతుకుదెరువును చూపించే వాడొకడున్నాడనే భ్రమను కల్పించారని వివరించారు. సామాజిక శ్రమశక్తి, చైతన్యంతో ప్రకృతిని వశం చేసుకోడం దేవుడైతే అలాంటి అవగాహనను తాను నమ్ముతాను కాని అభౌతికం, అదృశ్యం అన్న దేవుణ్ణి నమ్మడం మూర్ఖత్వమే కాగలదనే దృఢ విశ్వాసం ప్రసాదరావుగారికి వుంది. అదేవిధంగా భయం మొదట దేవతలను సృష్టించి వ్యాపింపచేసిందనే నిజాన్ని ఆయన నమ్ము తారు—

15 అధ్యాయాలువున్న ఈ పుస్తకంలో ప్రసాదరావుగారు సవివరంగా అనేక అంశాలను వ్యాఖ్యానించారు. దేవుడనేవాడు లేన ప్పుడు జీవిని చంపి మోక్షమిచ్చే ప్రసక్తిలేదనే వైజ్ఞానిక వాస్త వాన్ని వివేచించడానికి జీవశాస్త్రం, ఆధ్యాత్మిక అంశాలు—వివిధ మతాల వైఖరి, ప్రాచీన గణతంత్ర రాజ్యాల చరిత్ర తదితర అంశా లను సోదాహరణగా చర్చించారు. చివరికి వ్యభిచారం—పడుపువృత్తిని కూడా మతపరంచేసి ఒక సానికులాన్ని వివిధంగా శాశ్వతం చేసారో, తమ ఆస్తిక [ధనిక] వాదాన్ని ప్రచారం చేసుకున్నారో రచయిత గతి తార్కిక—భౌతికవాద దృష్టితో వివరించారు అయితే వ్యభి చారం గురించి చెప్పాలనుకున్నప్పుడు స్త్రీ—పురుష మర్మాంగాలను బొమ్మలుగావేసి చూపించవలసిన అవసరంలేదు. అలాగే గ్రాంథిక పదజాలాన్ని, వాక్య నిర్మాణాన్ని పరిహరించివుంటే బాగుండేది.

''భగవంతుడున్నాడా? లేడా? అన్న ప్రశ్నకు ప్రాధాన్యత నిచ్చుట నిరర్థకము. మానవుల జీవిత విధానాలను నిర్ణయించునది పాలక వర్గాల చేతుల్లో బందీ గావింపబడిన ప్రకృతి సంపదలను స్వాధీనం చేసుకొనగా నేర్పడిన ఉత్పత్తి సంబంధాలు మాత్రమే దీన్ని మానవుల ఆలోచనా ధోరణుల నుండి తప్పించుటకే దైవ సృష్టిని ఎప్పటి కప్పుడు పాలక వర్గాలు రూపొందించుతున్నా యనెడి యధార్థాన్ని గుర్తించటం ద్వారానే...'' మానవ పురోభి వృద్ధికి పటిష్టంగా ముందుకు సాగగలమనే తపన రచయితది. (ఇదే తపనతో ఆయన వాడిన భాషను సక్రమంగా వాడుకొని సామాన్య పాఠక లోకానికి అర్థమయ్యే రీతిలో చిన్న చిన్న వాక్యాల ద్వారా సులభ శైలిలో రచన చేసివుంటే ఆశించిన శ్రామిక జనం దగ్గరకు ఈ పుస్తకం సరాసరిన చేరే అవకాశం వుండేది.)

జీవ పదార్థం — సృష్టి తదితర మౌలికాంశాల గురించి వివరించేటప్పుడు ప్రసాదరావుగారు ఇటీవల వచ్చిన మరో వాదనను కూడా పరిగణనలోకి తీసుకోవలసి వుండేది. ''డార్విన్ పరిణామవాద క్రమం''లో ఆలోచిస్తూ మనిషి జీవశాస్త్రపు సముచ్చయం తప్ప స్వీయ నిర్ణయాధికారంతో ''నూతన మానవుడి''గా రూపొందే అవకాశం లేదని కేవలం వికాస పరిణామంలో ప్రకృతి నిర్దేశించే మానవ పాశవిక ఘర్షణలతో ఉనికి కాపాడుకోవలసిందే ననే వాదన వుంది. దీనిని డా. యన్. డి. నారంగ్ తన పరిశోధన గ్రంథం "An introduction to the theory of Bio-Economics" ద్వారా, ఆ తరువాత డా. ఎడ్వర్డ్ విల్సన్ (హార్వర్డ్ యూనివర్సిటి) సాంఘిక జీవశాస్త్రమనే పద్ధతి ద్వారా మనిషిని కేవలం ప్రకృతి చేతిలో కీలుబొమ్మ అని చిత్రిస్తున్నారు. మానవ మేధస్సు సంస్కృతి, మానవ చైతన్యం అనేవి నూతన మానవున్ని రూపొం దించే కృషిని నిరంతరాయంగా కొనసాగిస్తాయని గతి తార్కిక భౌతికవాదం విస్పష్టం చేస్తున్నది. ఇలాంటి శాస్త్రీయ అవగాహ నతో ప్రసాదరావుగారు ప్రజాపంథా, ప్రజాసాంస్కృతిక కార్యక్రమం ద్వారా మూఢ నమ్మకాలను తొలగించే ప్రయత్నం జరగాలని కోరు తున్నారు.

సమ సమాజ స్థాపన ధ్యేయంతో నాస్తికవాదాన్ని — హేతు వాదాన్ని రమ పద్ధతిలో వివేచించిన రచయిత కృషి అభినందనీయం. స్వామి వివేకానందుడు దేవుడు — దెయ్యం గురించి చెప్పిన మాట లను రచయిత ఉటంకించారు — ''మానవుని వూహయే భగవంతుని రూపకల్పన. దీనికే గనుక వూహించే శక్తి వుంటే అది దేముణ్ణి పెద్ద చీమగా వూహించుకునేది. బర్రెకే గనుక వూహించుకొనే శక్తి వుంటే, అది పది కాళ్లు, పది తలకాయలు, ఇరవై కొమ్ములు గల భూమినుండి ఆకాశంవరకూ నిండిన గేదెగా వూహించుకునేది. కానీ వూహాశక్తిగల మానవుడు రెండుకాళ్లు, 4చేతులు, 5 తలలు గల దేవునిగా వూహించుకున్నాడు. నిజానికి అటువంటి వుడుగాని, దెయ్యముగాని లేదు.'' ఇలా వ్యాఖ్యానించిన వివేకానందున్ని ఆధ్యా త్మిక వాదులు మరో విధంగా తమ ఆస్తికవాద సముద్ధరణకే ఉప యోగించుకున్నారు. అయితే ''దోపిడి విధానాలను బలపరచెడి ఆధ్యా త్మిక సాంస్కృతిక స్తాత్రే భూసామ్య పెట్టుబడిదారీ సంస్కృతి'' అనే సాంశాన్ని రచయిత సహేతుకంగా నిరూపించారు.

—యన్. యల్

## అతిథి

[కథాసంపుటి. కొవిలిపాటి విజయలక్ష్మి. క్రౌన్ 1/16 100 పేజీలు, ధర రు 4/, ప్రతులకు: స్పందన సాహితీ సమాఖ్య, 23/182ఇ, మ్యునిసిపల్ క్వార్టర్సు, వేణుగోపాలపురం, మచిలీపట్నం—521001.]

ఈమె విశిష్ట కథారచయిత్రి; ఈమె కథలు కొన్ని సినిమా తెరపైకి ఎక్కి ఉన్నవి. ఇది వీరి కూర్చిన కొన్ని కథల గ్రంథం. కథలలో వ్యంగ్యం, హాస్యం, బాగున్నవి. అతిథి అంటే తిథిలేనివాడు— పిలువకుండా వచ్చినవాడనుట. ఒక కవయిత్రికి ప్రభుత్వ సన్మానం చేయబోయి, అనక తవకలతో రసాభాసం పట్టించిన ఉదంతాన్ని వక్రంగా విమర్శించినది. సినిమాతారలతోగూడ సభలకు రాను మంత్రులే జంకి చులకన చేయబడుతుండగా, ఇక ఒక కవయిత్రి సంగతి చెప్పాలా? సినిమాతార సంబరంలో ఉద్యోగులతబ్బిబ్బు లను బాగా కీలు పట్టించినది.

కొన్ని కథలలో పాత్రోచిత గ్రామ్యాన్ని వాడటం ఉచితమే. విప్లవ కథలలో సంఘమలిన స్థాయినే—పతిత మానవులనే వర్ణించినది. ఇది సహజమైనా, లబ్బీలో మాణిక్యంవలె పాపకూపంలో ప్రకాశించే కొన్ని పాత్రలున్నవిగదా! వాటిని గూడా వర్ణించి ఉంటే, మంచిచెడ్డల కలనేత గుడ్డఅయిన మానవ సంసారాన్ని వివరించి నట్లుండేది. ఇప్పుడీ గ్రంథం చీకటి మూలలనే తడివినట్లున్నది. ఈ సాహసం చేపట్టడం—ఫరాసు కథకుడు మొపాసా వని.

వీటిలో కథక చాతురి కాస్త తగ్గినదనాల. కథ చెప్పడంలో విస్పష్టత కొన్నిచోట్ల తగ్గి ఉన్నది; అందువల్ల పాత్రలకు సహజత ఉన్నా జీవకళ తగ్గినది.

ప్రొద్దు పుచ్చుకోను చదివే దానికి ఈ సంపుటం బాగా పనికి వస్తుంది.

# స్వాతంత్ర్య వీరుడు

["ఒమిః ప్రాభవ సర్వ సైన్యసముపేతాంగ్లేయ సామ్రాజ్య సింహము మీసల్ నులవెట్టి లాగిన" ఉయ్యాలవాడ నరసింహారెడ్డి విప్లవ వీరగాథ.

— పాణ్యం నరస రామయ్య.

క్రౌన్ 1/16 – 128 పుటలు; వెల : రు. 5/ – ప్రతులకు – గ్రంథకర్త – ఉయ్యాలవాడ పోస్టు; కోయిలకుంట్ల తాలూకా; కర్నూలు జిల్లా.]

ఆంధ్ర పౌరుష లక్ష్మీ కీర్తి కేతనాన్ని ఎగగట్టే క్షాత్ర గాథను నరసరామయ్యగారు ఆంధ్ర భారతికి కానుక బెట్టినారు. సిపాయి పితూరి అని ఆంగ్లేయులు పేరు పెట్టిన 1857 భారత స్వాతంత్ర్య సమరానికి – పదేండ్ల ముందే మాతృ దేశభి మానంతో, రాయలసీమ ధరా రమణిని పులకలెత్తించిన విప్లవగాథ – ఈ మహాకావ్యం! గాంధీ యుగంలో అల్లూరి సీతారామరాజు తిరుగుబాటు దీనికి ప్రతిరూపం. కుంపిణీ రాజ్యంపై తిరుగబడిన ఇంకొక ఆంధ్ర వీర కుమారుడు – వీరపాండ్య కట్ట బొమ్మన్, తమిళనాట నిజ ఆత్మార్పణ రుధిరాన్ని అలలు గట్టించినాడు. ఝాన్సీ లక్ష్మీబాయి అంతటి వీరనారి – కిత్తూరు చెన్నమ్మ, కొంకణ తీరాన విప్లవ ఖడ్గం ఝుళిపించినది.

(ఈమధ్యనే పోస్టల్ స్టాంపు వెలువడినది.)

ఆంధ్ర పౌరుషాన్ని చాపాడజేసిన ఈ వీరుడు మజ్జారి వంశపు మొటాటి రెడ్డి – ఉయ్యాలవాడ నరసింహారెడ్డి కోయిల కుంట్ల ప్రాంతాన ఒక జాగీరుదారు. ఏటేటా 30వేలరూపాయలు వచ్చే వీరి జాగీరును కుంపిణీ ప్రభుత్వం పెటుక్కొని, నరసింహారెడ్డి తండ్రి పెద మల్లారెడ్డికి నెలకు 70 రూపాయల బత్తెం ఇచ్చినది. అన్న దమ్ముల భాగాలవల్ల మన కథానాయకునికి నెలకు పదకొండు రూపాయలు ముట్టినవి; ఈ చిప్పపుహాదు గూడా దేబిరించగా పుచ్చేది. ఇట్లనే ఇనాందారులు పాలెగాండ్రు పట్టు బడిదారుల హక్కులను విదేశ ప్రభుత్వం హరించినది; విచ్చలవిడిగ నిరంకుశపాలనను సాగించినది. ఈ వర్గ్యే ఉయ్యాలవాడ తిరుగు బాటుకు మూల బీజం. నానాసాహెబు, ఝాన్సీరాణి వారసత్వాలను నిగబెట్టుటేగదా ఆ స్వాతంత్ర్య యుద్ధానికి (సిపాయి తిరుగుబాటు అనబడిన) కారణమైనది. ఈ తిరుగుబాటుగూడ యిట్టిదే కారణమై, దేశ విముక్తి ఉద్యమాలకు ఒక ఘనా దర్శాన్ని నెల కొల్పినది.

చుట్టుపట్ల చిన్నజమీందార్లు కోయలు బోయలు, కొందరు బ్రాహ్మణులు ఈ ఉద్యమంలో చేరినారు. దీనికి రెడ్డి నాయకుడు. ముందుగా చెప్పి పంపి, దివిటీలు ఎత్తుకొని ఖజానాల మీదబడి దోచుకొనే వాళ్ళు. బ్రిటీషు సైన్యాలకు, ఈ విప్లవ సైన్యానికి దుర్గాలలో, అడవులలో చాలా ప్రత్యక్ష యుద్ధాలు జరిగినవి. ఉభయ పక్షాల సైన్యం నష్టమైనది. చివరకు, నల్లమల కొండ కోనలలో, పేరసోముల దుర్గంలో, జగన్నాథాలయంలో, ప్రతిన్యాతుడైన నర సింహారెడ్డి దెబ్బలిస్స కొదమ సింహంవలె పట్టుబడినాడు. తూకు శిక్ష విధింపబడినది. 500 అనుయాయులు శిక్షింపబడినారు. 1847 ఫిబ్రవరి 22 తేది కోయిలగుంట్ల దగ్గర, వేలాది ప్రజల ఎదుట ఉరిదీసి, ఈ జోదుని తలను కోటకొమ్మకు గట్టినారు. గోసాయి వెంకన్న ఈ వీరునికి గురువు.

---

ఇది దోపిడి దొంగల చర్య అని కొందరంటే, కాదు - స్వాతంత్ర్య యుద్ధమని తెల్ల దొరలే చాలామంది నిరూపించినారు. మన చరిత్ర పండితుడు-ఎన్. బి చౌదరి ఇది స్వాతంత్ర్య సమర మన్నాడు

నరసింహారెడ్డి లోక ప్రియుడైన వీరుడు కాబట్టే జయర గీతాలు, కోలాటపు పాటలు పుట్టి పెరిగి దేశమంతా అలముకొన్నవి. ఒక జానపద భాగం :—

అడుగో వచ్చె అడుగో వచ్చె నరసింహారెడ్డి
పళ పళ కేక వేసెరా నరసింహారెడ్డి
ఇంద్రాయుధము చేతబట్టెను నరసింహారెడ్డి
ఆవుల మందలో పులి దూకినట్టిందము దుమికినాడు
కరువు వచ్చినా కాలమొచ్చినా ఆదరించే రెడ్డి

కోటప్ప కొండ చిన్నప్పరెడ్డి, దాచేపల్లి సుర్రాల గోపిరెడ్డి మొదలైన వీరులమీద కవి గట్టిన వాఙ్మయం గూడ ఇట్టిదే.

ఈ సాహసోపేత ఆత్మబలిదాన కథను నరస రామయ్యగారు మోడులు చిగిర్చే, కడుపులో కండలు కదలంగ వీరరసం వెల్లువ బెట్ట వ్రాసినారు. ఈ పండిత కవి శ్రీనాధునివలె గంభీర ధారా వాహిక కవిత్వ చెప్పి, రసానికి తగిన పద బంధాలతో ప్రబంధ శైలిలో సజీవంగా నరసింహారెడ్డి వీర కథను చెప్పినారు. తెనుగు నుడికారం చాలచోట్ల సొంపు దీపించగా, సంస్కృతం వృషభరాజం వలె నడచినది. పాత్ర పోషణము, కథా వివరణము సంభాషణలు ఈ కావ్యాన్ని అలంకరించే వీర కుంకుమ రేఖలు. ఈ వీరునిగన్న గ్రామం నాదన్న ఆవేశంతో రేగిన కవితావేశాన్ని గ్రంథకర్త సద్వి నియోగం చేసినాడు. ఈ గ్రంథం చదివి ప్రతి ఆంధ్రుడు వీర గంధం పట్టించుకోవలసి ఉన్నది.

ఆచార్య తూమాటి దొణప్ప రెడ్డిని గూర్చిన జానపద గేయాలను సేకరించి, మంచి పీఠికతో ప్రచురించినారు. డాక్టర్ తంగిరాల వెంకట సుబ్బయ్య (మైసూరు) తమ థీసిస్‌లో ఈ తిరుగుబాటును ప్రత్యేకంగా పేర్కొని ఉన్నారు. నరసింహారెడ్డి కీర్తి అమెరికా మిన్నెసోట విశ్వ విద్యాలయ ప్రాంగణం ప్రాకినది. అక్కడ ఒక తెల్లదొర ఈ విషయమై విశేష పరిశ్రమచేసి, తను అమెరికా శిష్యురాలుచేత డాక్టరేటుకు విమర్శక గ్రంథం వ్రాయించి నాడు.

పాణ్యంవారి రచనలకు ఆధారమైన మన ఆచార్యుల గ్రంథా లలో కొన్ని పుక్కిటి పురాణాలు దూరినవి. ఇది తప్పుగాదు — ఆనాటికి ఒప్పే. ఇటీవల బంగోరె, బ్రౌను సాహిత్య పరిశోధనలు చేస్తూ, కడప పాతగజెట్లు ప్రభుత్వ రికార్డులు, పత్రాలు పరిశో ధించి ''బ్రౌన్ జాబులలో స్థానికచరిత్ర శకలాలు'' అన్న గ్రంథంలో నరసింహారెడ్డి విప్లవాన్ని గురించి చారిత్రిక విషయాలు ప్రకటించి నారు. నరసరామయ్యగారు రామున్న ముద్రణలో దీని ప్రకారం సవరణలుచేస్తే ఈ వీర కావ్యానికి ఇంక కొంత చారిత్రిక గౌరవం గూడ లభిస్తుంది. ముఖ్యంగా-విప్లవారంభం 1846 జులై 6. రెడ్డిని ఉరి దీసినది 1848లో జ్రరేటి ఒప్పున కాదు - 1847 ఫిబ్రవరి 22 తేది కోయిలగుంట్ల దగ్గర.

అతని జీవాత్మ భౌతికమైన తనువు
వదలి యంతట వ్యాపించి బహు మహోద్య
మమ్ము లొనరించి యొక శతాబ్దమ్మునకు
మాతృ భూమికి స్వాతంత్ర్య మహిమగూర్చె

అని జాతీయ కవి నరస రామయ్య భరతవాక్యంగా పలికినారు.

# అరపదిపాత్రాలు

## 1. గేయగుంజారవము

[భక్తిగీతాలు జోలదరాశి--కె. దొడ్డనగౌడ. క్రౌన్ 1/16 112 పుటలు; వెల : రు 2-50; ప్రతులకు—ఎర్రిస్వామి జీవ సమాధి మందిరము; చేన్నగురికి, బళ్లారి జిల్లా.]

గుంజ అంటే అవ్యక్త మధురగానం, అయినా ఈ గేయాలు వ్యక్తమధురంగానే ఉన్నవి. వీరశైవం పుట్టుకతో కర్ణాటకంలోను, పశ్చిమాంధ్రంలోనూ మతం, సంకుచితశాస్త్ర బంధంనుండి, పీఠాల పిడికిళ్లనుండి బయటబడి, సంస్కృతాన్ని వదలి స్థానిక భాషలలో ప్రజలలో ప్రవేశించినది; అద్వైతం చెప్పిన సమతను ప్రవేశ పెట్టినది. ఇంతకుముందు కొన్ని శతాబ్దాలక్రితం తమిళంలో ఆళ్వారుల నాయనమారుల గీతాలు భక్తిభావ స్రవంతిని ఉద్భవింప జేసి, సామాన్య ప్రజలను భక్తులను జేసినది. పూజారులు అనే మధ్యవర్తులులేని సర్వజన భక్తజనారావమేగదా ఈ భక్తి ప్రక్రియ.

శైవ ప్రాబల్యంతో శక్త్యాదిగురువుల మఠాలు దేశమందం తటా వెలసినవి. అవధూతలైన మహానుభావు లెందరో మఠాలు స్థాపించి సర్వజాతుల స్త్రీ పురుషులకు మంత్రోపదేశంచేసి, గ్రామీ ణులను శివభక్తి పరాయణులుగా జేసినారు...స్థానిక భాషలద్వారా వేదాంతగ్రంథ ప్రచారణం గావిస్తున్నారు అట్టి మహాస్వాములలో ప్రసిద్ధులు-ఈ ఎర్రిస్వామి అవధూత. వీరి జీవసమాధి మందిరం, చేన్నగురికిలో (ఉరవకొండ బళ్లారి మార్గం) ఉన్నది. ఈ మహా సిద్ధుని శిష్యుడు-తిక్కయ్య. ఇట్టి మఠాలు ఇప్పుడు ఎన్నో ఉన్నవి. ఇవి తమ ప్రచారంవల్ల సామాన్యులకు సర్వజనీన మతానికి పట్టు కొమ్మలై ఉన్నవి.

ఎర్రిస్వామి మఠం ప్రచురించిన ఈ గ్రంథం—భక్తులు వ్రాసిన భక్తిగేయాలకు ఆంధ్రానువాదం. అనువాదకులు — కన్న డాంధ్ర కవివర్యులు, జోళదరాశి. కె. దొడ్డన గౌడ. రెండో భాగంలో ఈయన సొంత గీతాలు గూడ చేర్చబడి ఉన్నవి ఇవి పాటలరూపంలోనుండి ప్రజాబాహుళ్యాన్ని ఆకర్షిస్తున్నవి. గౌడ కవనంలో భక్తి భావోన్నతి భాషాసౌకుమార్యము, గతి సౌభాగ్యము కలిగి, మతజ్ఞానాన్ని సులభంచేసి, విన్నవారిని, పాడినవారిని భక్త

భూషణముల జేస్తున్నవి. గౌడగారి సంగీతజ్ఞానం పాటలను గాన సుధాపూరంగా చేసి ఉన్నవి.

"నీ పిచ్చి బట్టించి సన్నేలుకో" అని ఎఱ్ఱితాతతో సాయుజ్యాన్ని కోరుతున్నాడు. "మా యింటికి రావా, దోవ చూచెదనయ్యా మాటి మాటికిని" అన్న స్తోత్రగీతం శబరి భక్తికి ప్రతిరూపం. "కాగితాల చదువు రాకున్న నేమాయె, కనిపించె లోకాన్నె మానియై చదివాడు, లోకానుభవమే శివానుభవమన్నాడు, చదువు శాస్త్రాలన్ని నడతలో చూపేడు" అని అలౌకిక విజ్ఞానాన్ని ప్రదర్శించినా.

ఈ పాటలకు ప్రాణం -ను తెనుగు నుడికారం; సరళ భాషలో వేదాంత ప్రవచనం. భక్తి పారవశ్యంలో ఎఱ్ఱితాత మహిమలు పాడబడినవి.

రెండవభాగం—గౌడగారి సొంతగీతాలు. ఇవి భక్తి ప్రధానరసంగా, మతరహస్యాలను బయటబెట్టి విన్నవారిని ప్రార్థనాయత్తచిత్తులుగా జేస్తున్నవి. మతైక్యాన్ని చెప్పిన తీరు చూడండి: "జాతులు మతాలు పంథములన్ని సామాజిక ఎదుపాయ భేదములు, జీవుడు శివుడై వెలగాలంటె మానవధర్మంబొక్కటె గదరా". బళ్ళారి రాఘవాచారి నాట్యకళా వైభవాన్ని, ఆయన పొందిన శివసాయుజ్యాన్ని (వైష్ణవుడుగా పుట్టినా) రసవంతంగా కీర్తించినాడు. ఈ గేయాలలో వేదాంత సాంకేతిక పదాల వివరణం సామాన్య భక్తుని ఎరుక కలిమికి తోడ్పడుతున్నవి. ఎగతాళి ఎత్తిపొడుపు, లోకవృత్త వ్యంగ్య నిరసనము, నిందాస్తుతులు బాగున్నవి. కపట స్వాములను, మూఢాచారాలను, భక్తిలేని పూజల ఆడంబరాలను బాగా నిందించినాడు. విప్లవం అనే గీతంలో దొంగ రాజకీయాలను గేలిపట్టించి "తెల్లని టోపీలో ఇంతటి నలుపా!" అని ఆశ్చర్యపడుతున్నాడు. చివరన "నా నవ్వు పూవుల పూజచేస్తాను, నావల్లకాదిడి ఓ బాడిదదైవమా" అని ఆటోప పూజల నిరసిస్తూ భావ నైర్మల్యాన్ని చాటుతున్నాడు ఈసుకవి. శైవంలో ఉండే సారస్యమె ఇట్టిదిగా ఉన్నట్లున్నది.

## 2. ఏటి కోళ్ళు

[ఖండకావ్యం : డాక్టర్ నారపరాజు శ్రీధరరావు. క్రౌన్ 1/16–64 పేజీలు; ధర రు 2–50; ప్రతులకు—గ్రంథకర్త, రామచంద్రా క్లినిక్, చీరాల, ప్రకాశం జిల్లా, 523155.]

వైద్యుడై, ఆత్మప్రీత్యర్థం కవితల్లడం—పైపై చదువులపై మోజు దినాలలో ప్రీతికరమైన విషయం. "మనవి" ఈ డాక్టర్ హృదయ పరిణతకు, ఆధ్యాత్మిక వాసనా బంధురతకు నిదర్శనం. ఒక సైన్టిస్టు హేతువాద దృష్టిలో వేదాంతానికి సమన్వయం గూర్చిన ఒక్కటి దాత— ఈ మనవి. షణ్మతాలను ప్రస్తావించి, ప్రకృతికి దేవునికి అభేద ప్రతిపత్తిని జూపి ఆస్తికులౌతున్నాడు. వివేకానందస్వాములవారు చెప్పినట్లు— వేదాంతుల బ్రహ్మము, సైన్టిస్టుల ఎనర్జి (శక్తి) పురాణ మతమందలి దేవునికి భేదము లేదన్నదాని సమన్వయమేగదా ఇది.

శతపత్రం—నంబరు లేకపోయినా, నూరుపద్యాలలో పేరుకు ఔచిత్యాన్ని గూరుస్తున్నది. ఇవి శతకంవంటి విడి విడి ప్రార్థనలు. "డెందమనియెడు కాసారమందు మొలచి నిత్యవృద్ధిని జెందిన సత్యమిది" అన్న ఉపమానానికి నిందితసంలేదు సత్యకమలాలని ఉంటే బాగుంటుందిగదా! పద్యాల నడక భావప్రకటన బాగా కుదురుకొన్నవి. "కీర్తి నాసింపరాదపకీర్తి కదియ బీజమై యొప్పు" అన్నదానిలో అంతర్ముఖమైన భావన పరిమళిస్తున్నది. "ప్రేమ కిద్దరు లేనిది పెరుగఁబోవ దొకఁడ వీవైన నొకండ నేనుందు స్వామి" అన్న సాపేక్షికవాదంలో ప్రపత్తివంటి భావమున్నది. ఈ కవి లోకవృత్తాన్ని చెపుతూ సర్వజనాశ్రేయాన్ని కోరుతాడు. అసూయానలం ప్రక్కే ఒకతెగ కవుల తెగులుకు ఇది భిన్నమై హాయిని గూరుస్తున్నది.

"మా కందం"లో కందపద్యాలు సరళంగా సాగినా, మొదట కాస్త బిగువు తగ్గినా పోను పోను భావానికి చేవ ఎక్కినది. మాకందం (మామిడి) ఏ పండైనా తీపేగదా! "నరకమ్ము, స్వర్గమనునవి నరులే కల్పించినట్టి న్యాయములు" అవును—నిజం చెప్పినాడు ఇది పౌరాణికుల కల్లబొల్లి కత. ప్రారబ్ధవాదంచేసే వేదాంతంలో వీటికి చోటెక్కడ ఉంటుంది? షేక్స్పియరు ఇవి మానసిక కల్పనలు అన్నాడు.

చివరన చేర్చిన అనువాదపు తునకలు బాగున్నవి. ముఖ్యంగా సూఫీ కవిది ఒక్కటి మధురభావం. రోగులకు స్వాస్థ్యము, కవితా ప్రియులకు ఆనందము ఈ వెజ్జు కూర్చుందునుగాక.

## 3. శ్రీ కురవి వీరభద్ర మాహాత్మ్యము

[ముళ్లపూడి సచ్చిదానందమూర్తి. క్రౌన్ 1/16—పేజీలు 64; వెల : రు. 3/–ప్రతులకు :—సాహిత్యరంజని; H. N. 17–7–818, యాకుత్‌పుర, హైదరాబాదు—500023.]

వరంగల్లు సమీపాన, మానుకోండ (మహబూబాబాద్) దగ్గరఉన్న కొరవి గ్రామంలో వెలసిఉన్న వీరభద్రస్వామి మాహాత్మ్య ఆలయం చాళుక్యులనాటిది. ఈ కవి అచ్చమైన తెనుగు ఛందమైన మధ్యాక్కఱలో కోవెల మహిమను వ్రాసి, ప్రతిదానికి తాత్పర్యంగూడ ఇచ్చినాడు. రచన ప్రౌఢంగా ఉన్నదిలెండి. ఈ మధ్యాక్కఱ పదంలో "బండిరా" ప్రక్కన "ఒత్తుథ" ఎట్లావచ్చిందో భాషావేత్తలు చెప్పాల. ఇందు పార్వతీ పరమేశ్వరుల కల్యాణము, వీరభద్ర జననము వర్ణింపబడుటేగాక, పెద్ద ఎత్తున జరిగే జాతరను గూడ వర్ణించినాడు. మా ప్రాంతంలో జంతుబలులిచ్చే గ్రామదేవతల (పోతేరమ్మ) తిరునాళ్ల జాతర; కొలుపు అంటే యాదవులు బలి లేకుండా చేసేవి.

కవిత్వం వివిధ రసానుగుణంగా సాగినది. "మాధుర్య కవనాల విందారగించరా—పద్యముల వల్లుల పందిరివేసి వేచియున్నానయ్యా—

ఉలిపొర చీరగట్టి — ఆకులురాలు కాలమవి —'' మొదలగు భావ విలసనంతో ఒప్పారే నుడికారాలున్నవి.

మాహాత్మ్యానికి — మహాత్మ్యమని, శ్మశానానికి స్మశానమని ఉన్నది. ఈ చిన్న దొసగుల సవరించుకోవడం మంచిది.

మొత్తంమీద కవిత పఠితకు ఆనందాన్ని గూరుస్తున్నది.

## 4. రాధేయుఁడు

[బి. నారాయణరావు. క్రౌన్ 1/16. 140 పేజీలు; ధర రు. 5/–; ప్రతులకు: బొద్దులూరు నారాయణరావు, వల్లభ రావుపాలెం; వయా పొన్నూరు, గుంటూరు జిల్లా].

ఈ కావ్యకవితాపాకం మధురం. ఎత్తుగడ కథచెప్పు తీరు, నడక చాలా బాగున్నవి. ఈ మధ్యవచ్చిన మంచికృతులలో ఇదొకటి. సందేహం లేదు.

కాని, పాండవ పక్షపాతులచే మలినం చేయబడి, పౌరాణికులచే పాడుచేయబడి, పుక్కిటి పురాణాల పొత్తిళ్లలో చాకబడినాడు రాధేయుడు. ఆంధ్ర భారతాన్ని లెక్కబెట్టక, ఈ రచయిత సొంపు లేని కొత్త కల్పనలతో, సంఘటనల స్థలాల మార్పులతో మొదలే గచ్చుపొద అయిన కర్ణుని కథను రేగుకంప జేసినాడు. ఇది ఇతిహాసం. తలకొకతీరుగా మార్చి ఈ గతి పట్టించినారు. ఉన్నవాటికి తోడు ఈ మార్పులు — చేర్పులు. వాదోపవాదాలుండవచ్చునుగాని, అంత మాత్రాన కథకు గౌరవం చెడుతుందా? ఎంత పెద్ద హిందీ కవి చెప్పితే మాత్రం మూలకథను మార్చడం బాగుంటుందా? మార్పు చేస్తే ఔచిత్యం ఉండాల. మహాభాగత శకుంతల తన తలిదండ్రుల కామలీల చెప్పగా కాళిదాసు ఈ సంగతి చెలికత్తెలచేత చెప్పిస్తాడు. ఉత్తర రామాయణంలో యాగాశ్వాన్ని లవకుశులు పట్టడంలేదు; భవభూతి నాటకీయతకు ఆ మార్పుచేసినాడు.

తెనుగు భారతంలో ఎర్రన తిక్కనలు — కర్ణుని ఒక మహిమోపేత కీర్తిమూర్తిగా — సహజ సౌభాగ్యంతో, మానవుని పొరపొచ్చాలతో, వీరుడుగా స్వామిభక్తి పరాయణుడుగా, దాన వీరుడుగా సృష్టించినారు. కన్నతల్లిచే పరిత్యక్తుడై, గురువుచే శప్తుడై, సారథిచే వంచితుడై, ఇంద్రునిచే అపహృతుడై, విధిచే వధింపబడినాడు. అధిపు మన్నన అప్పుదీర్పను — కుంతీ కృష్ణుల చేత మర్మభేదక] రహస్యాలు వినికూడా హిమాలయం మాదిరి సేవా లక్ష్యంతో నిండబడి, యుద్ధ వీర సముచితాచారాలకు భిన్నంగా చంప బడుతాడు. ఇది తిక్కన చిత్రించిన రాధేయుని ఉజ్జ్వలమూర్తి.

ఈ కవి చేసిన మార్పులు లటు రాధేయునికిగాని, ఇటు ఈ కావ్యానికిగాని రక్తిని, కీర్తిని కల్పించడం లేదు.

జన్మవృత్తాంతం చివరన చేర్చబడినది. ఇది సినిమాలలో Flash Back వలె అందాన్నే కూరుస్తుందిగాని, ఈ సంగతి పాఠకునికి తెలియని సందర్భంలో (కొత్తవాడే అనుకొందాం) భానుజుడు అంటే పదప్రయోగ ఔచిత్యం అనిపించుకొంటుందా? (11 పేజి) నిర్వచనోత్తర రామాయణంలో, తిక్కన చూపిన రావణ పదప్రయోగ కళావైదుష్యాన్ని చూడండి.

పెట్టెను మోసుకొనివచ్చినది ఎన్నో ఉపనదులైతే, ఒక్క గంగే అంటాడు — ఈయన. సూతుడు అంతఃపుర కాంతలతో జలక్రీడలాడుతుంటే సందనం దొరకుతుంది. ఇక్కడ ఒక్కడే మునుగుతుంటే పెట్టెనుబట్టి రాచనగరికి మోసుకొనిపోతాడు. ఈ మార్పు మార్చిన ఘనత ఏమైనా ఉన్నదా? ఇట్టి చెప్పిన చేర్పులు చాలా ఉన్నవి.

మన పెద్దలు కొందరు ఈ రచనను విన్నారని కవి అంటు న్నాడు. వారైన ఈ కర్ణపాత్ర శీలహననాన్ని నివారించలేక పోయినారా?

ఈ మిత్రుడు తన మంచి కవిత్వానికి శోభ కలిగేటట్లు తెనుగు భారతం ప్రకారం రాధేయుని చరిత్ర మరల వ్రాయుమని కోరుతున్నా.

## 5. శ్రీరామ చంద్రిక

(పద్యకావ్యం— అష్టకాల నరసింహరామశర్మ. డెమ్మీ 1/8, 120 పొరటలు; మూల్యం రు 6/- ప్రతులకు : రచయిత — రాజగోపాలపేట; సిద్దిపేట తా॥ మెదక్ జిల్లా. (2) శ్రీనివాస బుక్ డిపో, సిద్దిపేట 3.)

ఇది రామాయణ కథాసారం, కొత్తపోకడలతో కథ చెపుదా నని కవి శపథం. ఈ సంతం చాలావరకు నెగ్గించుకొన్నారు. ఋష్యశృంగుడుతో మొదలుపెట్టి, పరమేష్టితోగూడ 17 పాత్రం చేత కథ పూర్తిచేయించినాడు. కవి ఎద్దుబట్టినట్లే రామరావ ణాదులైన పెద్ద పాత్రల జోలికి పోలేదు ఈ పాత్రలు ఉత్తమ పురుషలో కథచెప్పి సొంపుగూరుస్తున్నారు.

రారాజి (సి. ఆర్.) తన భారత రామాయణాలను ఇట్లే పాత్రానుగుణంగా విభజించి కథ నడిపినారు. బహుభాషా కోవిదుడు — విప్లవ వీరుడు — వి. వి. ఎస్. అయ్యరు, ఇంగ్లీషులో వ్రాసిన కంబ రామాయణానికి ఇదే ప్రక్రియ అవలంభించినారు.

వేదం పంతుల నరసింహశాస్త్రిగారు ప్రస్తావనలో — ఈ నాటక పద్ధతిని భాణము అని వివరించి, ఒకే పాత్ర నేపథ్యాన్ని ఉద్దేశించి వ్యక్తులతో మాట్లాడినట్లు కథ నడపడమని చెప్పినారు అట్లనే ఉన్నది కావ్యం. ఇంగ్లీషు షేక్స్పియర్ మొదలగు వారు తమ నాటకాలలో పెద్ద పెద్ద స్వగతాలతో (సొలిలొక్వి) ఈ పని చేసి, నాటకీయతకు, రసౌచిత్యానికి ప్రాణం పోసినారు (హ్యామ్లెట్) వీటిని బెర్నార్డ్ షా వంటి ఆధునికులు పరిహరించినారు. తెనుగులో బళ్లారి — ధర్మవరం రామకృష్ణమాచారి, తమ నాటకాలలో ఈ స్వగతాలు ప్రవేశపెట్టి, నాటకరక్తికి కీలక స్థానంగా చేసినాడు. వీటిని ఆయన మేనల్లుడు — కళాప్రపూర్ణ — టి. రాఘవ అక్కట చేస్తుంటే, తన్మయం పొందనివారు లేరు. ఈ ప్రక్రియను ఈ కవి కళాపూర్ణంగా ఉపయోగించుకొన్నాడు.

రాముడు అవతార పురుషుడుగానే ప్రారంభించి, సాంప్రదాయిక పద్ధతిలో భక్తి రక్తి కుదిరేటట్లు వ్రాసినారు. సంస్కృతం ధాతులపై సమానమైన అధికారంతో, రెండు చేతులలో వాసి కెట్లు వృత్తాలు అల్లినారు. గంభీరమైన నడకలో, లాలిత్యమైన పద గుంఫనంతో రచన కావ్యమంతా నిండి, కవితా ప్రియులకు ఆనందాన్ని గూరుస్తున్నది. కథక శక్తి చక్కని అలంకారాలను చేర్చుకొని ఉన్నది. రామాయణాన్ని తిట్టిపోసే విప్లవ వాదులను ఓపిని చదువమని దేబిరించేవారుండరు. చాగితం వేస్తు అంటారేమో వీరు — రామబాణంకు మింగుడుబడనిది ఈరామకథలేనని కాలం ఋజువు చేస్తుంది.

విషయ సూచిక ఉంటే చదువరికి సులభంగా ఉండేది.

*శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి*

## అదృష్టదీపక్ ప్రాణం

దాదాపు పదేళ్ల క్రితం కొత్తగా కవితలూ, సంపాదక లేఖలూ వగైరాలు రామ్మూర్తి కీర్తి సోపానాల నెక్కబోతున్నా ఒక యువకుడు 'కళాకేళి' మాసపత్రికకు తన కవితలు పంపేడు. ఆధునిక సాహిత్యంపై బాధ్యతవహించే స్ఫూర్తి కావాలని కృషిచేయుచున్న ఆ పత్రికా సంపాదకుడు వాటిని పరిశీలించి, పెద్దదోషాలు తొలగించి అందగించి ప్రచురించాడు. తెలుగు కవితా రంగంలో ఆవిధంగా ఎందరో నవయువకులను పరిచయం చేశాడు. వారిలో అనేకులు మొక్కవోని దీక్షతో కృషి సలుపుతూ ఎక్కి వస్తున్నారు. ఆవిధంగా అదృష్టదీపక్ అనే ఈ యువకవితో ఈ సమీక్షకునికి ఏదేళ్ల పరిచయం ఉంది. ఇప్పుడాతని రెండో కవితాసంపుటి ప్రాణం ఈ వ్యాసపీఠాని కెక్కింది. కవితాకృషిలో ఎన్నో విజయాలు సాధిస్తూ నిరంతరధ్యేయంతో సాగుతున్న ఆ యువకవి రంగుల కలలన్నీ దర్శనమిచ్చాయి.

ఈ వచన కవితా సంపుటి ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం తూర్పుగోదావరి జిల్లా శాఖ పక్షాన ఈ రచయితచే ప్రచురింపబడింది. విశాలాంధ్ర ప్రచురణాలయం వారిచే అమ్మకాలు సాగింపబడుతోంది. 1/4 క్రౌను 64 + 12 పుటలతో, అందంగా, ఆకర్షవంతంగాఉన్న ముఖాలంకరణతో, వెలువడిన ఈ పుస్తకం వెల రెండురూపాయలే! దాదాపు ఈ ఖరీదు నామమాత్రమైనదే! బీరుపోకుండా వేయి ప్రతులూ అమ్ముడుపోతే కూడా పెట్టుబడి సొమ్ము చేకూరడం దుర్లభమే! ఏమెస్కో ప్రచురణల సంప్రదాయం మాదిరి ఇన్నర్ టైటిలు కూడ ఎడమంకు పరచు కొన్న చక్కని చిత్రంతోబాటు ప్రచురింపబడింది. అభ్యుదయ కవిత్వానికి ప్రాణంగా నున్న స్త్రీ, సౌందర్య ప్రదర్శన ఎందుకు అవసరమైందో? ఆమె చేలాంచలాన్ని, కచాంచలాన్ని గాలి కెగరపోస్తూ శిఖరాల కెగ్రాకడమేమిటో? కుచబాహుమూల అథోమూలాదులను ఎందుకు ప్రదర్శింపవలసి వచ్చిందో—తెలియదు. ఏడోలసెన్సుకు సంబంధించిన వెకిలి కోరికల వెసులుబాటు కోసమనుకొని, మనం ఉదారంగా కవినీ, చిత్రకారుణ్ణీ క్షమించవలసిందే మరి!

ఇందలి కవితల గురించీ, వాటి అచ్చుమచ్చుల గురించీ రచయిత కృతజ్ఞతలు వెల్లడించుకున్నారు. అంతట రాచమల్లు రామచంద్రారెడ్డి ప్రవేశించి ఇట్లనును: ''భావుకత్వమంటే బాహ్య ప్రేరణలకు స్పందించేశక్తి! ఆ ప్రేరణ బాధాకరమైనది కావచ్చు. ఆనందదాయకమైనదీ కావచ్చు!''

ఎంతో చక్కని నిర్వచనం యిచ్చారు. పలుగు రాళ్లలో ఉలులు మోదని చోటల్లా శ్రీ రాచమల్లు మంచి ఆలోచనాపరులుగానే కనిపిస్తారు! వారే మళ్ళీ—''భావుకుడైనవాడల్లా కవికాలేడు. తన హృదయంలోని అనుభూతిని పాఠకునికి అందించగలిగినపుడే అతను కవి ఔతాడు. అతనికి కలిగిన అనుభూతి పాఠకునికి కూడా కలిగినపుడే ఆతని రచన కవిత్వమౌతుంది'' అంటూ హృద్యంగా సార్వత్రిక నిర్వచనాలుచేసి, అవి ప్రస్తుత కవి కేవిధంగ అతుకుతాయో వివరించి తమ పరిచయం ముగించారు. శ్రీ గజ్జల మల్లారెడ్డి అభిప్రాయం చెబుతూ, కవి ప్రదర్శించిన ఉత్తమ కవితా వాక్యాలనుగాక-దినవారీ వచనంలో కూడా తారసిల్లే చప్పని వాక్యాలనుల్లేఖించి, కవికి ఉజ్వల భవిష్యత్తు నాశించారు. పన్నెండు మాత్రలూ ఒక యతిప్రాసం వారి కందించి గేయాలు రాయమంటే-గజ్జలగుర్రంలా కదం తొక్కుతూ ముందుకు సాగగలరే కాని వారికిలాంటి సాహిత్య విమర్శ అలవాటులేని ఆపోసన అయితే వారెందుకీ మిడతంభొట్లు జోస్యం చెప్పడానికి ముందుకు వచ్చా

రంటారా - రాష్ట్ర సి. పి. ఐ. కార్యవర్గ సభ్యులుగా ఆంధ్రప్రదేశ్ అరసానికి వారే అధినాయకులు మరి!

ఇక ఈ సంపుటిలో అనుభూతి మొదలుకొని ప్రాణంవరకూ 31 కవితలున్నాయి. ఈ సంఖ్య బహుశా రచయిత వయస్సుకు సంకేతమేమో తెలియదు. 'అనుభూతి' అనే ఆద్యకవితలో—''అమావాస్యలో అలమటిస్తున్న అస్తవ్యస్త జీవితాల ఊరేగింపుగావచ్చి గుండె తలుపులు తడతాయి. కలల బిడారులు గమ్యం చేరకుండానే కంటి ప్రమిదలలోని కాంతి దీపాలను కసిపూనిన ఇసుక గాలులు కబళించిన కథలు చెబుతాయి!'' అంటూ ప్రారంభించిన ఈ కవిలో కవితా భావుకత్వం పుష్కలంగా ఉంది. రసమయ కవితా హృదయమూ ఉంది. లేనిదల్లా ప్రతి అభివ్యక్తినీ నిశితంగా రూపొందించుకోగల పరిశీలన. సంక్షిప్తంగా వ్యక్తీకరించగలిగేదక్షత; అందువల్లనే పై ఉల్లేఖిత వాక్యం పేర్పుడుతో హనుమంతుని తోకలా సాగుతుంది. దీనివల్ల చదువరి హృదయానికి గుచ్చుకొని నిరిచేలా మలచగలిగే సంవిధాన చాతుర్యం భంగపడుతుంది. కవితా సృజనను పునః పరిశీలించి భావావిష్కరణ విషయంలో సర్వజాగ్రత్తలూ తీసుకోబడ్డవో లేదో పరీక్షించుకొనే ధ్యానంమృగ్యమవుతోంది.

''సంఘర్షిస్తున్న ఆలోచనలతో నన్ను నేను నరుక్కుంటాను.'' ఆలోచనల సాంద్రత కలిగించే ఆత్మవేదనను ఇంతకన్న అందంగా చెప్పడం సాధ్యంకాదా?...మోడరన్‌గా ఉందామనీ, ఏదో అందామనీ తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని అర్థంలేని ఇమేజరీతో కలగా పులగం చేయడమంటే ఇదే! ఇలాంటివాన్నే స్వర్గీయ తిలక్ అధిక్షేపించాడు. ''నా పెదవుల్ని కత్తిరించి నీ వీపుమీద అంటిస్తాను, ఇలా రాయడం కొత్తగా గమ్మత్తుగా ఉంటుంది, కాని ఇది నాన్సెన్సు!'' అన్నాడతను.

''కన్నీళ్లు కవిత్వంగామారి కాగితం మీదికి దూకుతాయి. భావాలు లావాలో స్నానంచేసి భాషను ఎరుపెక్కిస్తాయి'' అన్నాడీ కవి అదే కవిత ముగిస్తూ; నిజమే. కవి నిర్మించిన అక్షర రమ్యత పాఠక హృదయంలో భావతరంగాలను ఉత్తుంగం చేయాలి. రసభావాలను కదిలించాలి. అప్పుడే కన్నీరు చేదగలవు; తప్పక కవి మాత్రుడే తానుగా కన్నీరు కార్చి క్రుమ్మరిస్తే కాగితాల ఖరాబే తప్ప ప్రయోజనం ఉండదు.

కాంతిఖడ్గం అనే రెండో కవితలో—'సామాజిక చైతన్యాన్ని వెలిగిస్తాను...పీడిత వర్గాలకు పంచిపెడతాను' వగైరా వాగ్దానా లెనిమిదింటిని వ్రాకుచ్చారు. రాజకీయ పక్షాల నిరర్థక వాగ్దానాల వ్యర్థ పరంపరలో ఈ జాతికి ఉత్తమాటలపై విలువ లేకుండా పోయింది. ఎప్పటికైనా అధికారాన్ని హస్తగతం చేసుకొనే రాజకీయ పక్షాల వాగ్దానాలకే యింత భ్రష్టాచారంపడితే—కలం తప్ప మరేమీలేని కవిగాడి వాక్ గాండీవాల కెవరు విలువ యిస్తారు. కవి నుంచి సహృదయుడు కోరుకొనేది వాగ్దాన ప్రభంజనంకాదు. అనుభూతుల మలయపవనం!

''నిరుపేద రక్తాన్ని తమ మోటార్లకు ఇంధనంగా వాడుకునే ధనస్వాములు...'' అన్నాడీ కవి 'అగ్నిచిత్రం'లో. హృదయంగమమైన అతిశయోక్తి అంటే ఇదే! ''పేదల ఎముకలను నున్నంచేసి రక్తంతో రంగరించి తన పాదాలకు పారాణిగా పూసుకుంటున్నాడు ధనస్వామి'' అని ఒక కవి మూడు పదుల క్రితమే అన్నాడు. దానికిది అనుకరణకాదు కాని అలాంటిదే యిదిన్నీ! ప్రతిహృదయంలో చిరావాసం కలిగించుకోగల సుందరోక్తి! ''అభ్యుదయ ఆకాశాన్ని అందుకోవడానికి అవతరించిన అపూర్వ అవకాశాలు'' (పు. 11) వంటి పులుముడువల్ల మనసులో కలిగేదీ మిగిలేదీ ఏ అనుభూతీ ఉండదు. ఇలాంటి పులుముడులను పరిహరించుకొని ప్రతి కవితోక్తినీ ఆలోచనా తరంగాల వేల్పుగల్పగలిగే రమణీయోక్తిగా మార్చినపుడే మన అభ్యుదయ కవిత్వం జనహృదయంలో బ్రతుకుతుంది. ఆ రహస్యమేదో తెలుసుకుందుకు పాశ్చాత్య అభ్యుదయ కవులను అధ్యయనం చేయాలి.

అదృష్టదీపక్ కవితల్లో శ్లిష్టత వుంది. సాహిత్య సౌరభం వుంది. చిత్తశుద్ధీ ఆవేశమూ ఉన్నాయి. ఇన్ని సద్గుణాలున్న కవి ఉత్తమ వచనానికి సమాంతరస్థాయిలో మాత్రమే వచన కవితను సృజించడం గర్వకారణంకాదు. ''కథల్లోని పాత్రల కాళ్లను కళ్లకద్దుకునే వెధవాయత్వ ప్రజలనుంచి వెళ్లిపోతోంది'' వంటి శక్తివంతమైన అభివ్యక్తులు అక్కడక్కడ తగలకపోవు. కాని అట్టివానిని వెదుక్కోవలసిన పూచీ పాఠకునిపై నెట్టివేయకూడదు 'జనారణ్యం' అనే కవితలో—''చిరకాలంగా సాగుతున్న జీవన సాగర మథనంలో కష్టపడేవాడి కెప్పుడూ హాలకూటమే దక్కుతోంది!'' చిరకాలంగా జరుగుతున్న మోసానికి చక్కగా అతికే పురాణ ప్రతీకను ప్రయోగించగలిగాడు. అలాంటి దర్శనాశక్తి ఈ కవికుండడం ముదావహం. అట్టి శక్తే ఈ పరిశీలనకు ఇంత బాధ్యత కలిగించింది.

స్వప్న చిత్రాలలో—''తెరకాస్త తగలబడిపోయినపుడు కలల చిత్రాలుమాత్రం ఎక్కడ కనిపిస్తాయి? ఎలా కనిపిస్తాయి! పొగలో చేతులూపితే పిడికిటి కొచ్చేదేమిటి?'' అంటూ ఆలోచనా స్ఫోరకమైన ప్రశ్నలువేసి పాఠక హృదయాన్ని రవంతసేపు ఆపుచేస్తాడు.

'విద్యుద్గీతం' అనే కవిత ఒక్కటిచాలు — ఈ యువకవిని ఉత్తమ కవుల శ్రేణిలో నిలపడానికి! ఇలా నేనడానికి కారణమైన వాక్యాలు—''పదండి మానవులారా! కలలు కరగిపోతున్న కళ్లలో— కసిమాత్రం జారిపోనీకండి!'' వంటివిమా తం కావు.

'కాంతి మార్గానికి అడ్డంవస్తే
కంటి రెప్పలనైనాసరే కోసెయ్యండి!'

వంటి అభినవోక్తులు మాత్రమే! ఈ అభివ్యక్తి మన తెలుగు కవితకే అపూర్వమూ, అనవద్యమూను. ఈ కవిలో ఇతరేతర కవుల వాక్యాలకు అనుకరణలూ, అనుసరణలూ ఎక్కడా కనిపించవు. ప్రతి కవితా అతని యువహృదయనీహారికను చీల్చుకువచ్చిన కాంతిరేఖే! ఈ అంశంలోమాత్రం ఈ కవి ప్రశంసార్హుడు!

శ్రీ సోమసుందర్

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. · Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**

